
The Largest Circulated Telugu Monthly
చతుర
ఆగస్టు 1990 * రూ. 4/-
నరబలి
కె.విశ్వమోహనరెడ్డి

# బ్రేక్‌ఫాస్ట్ కోసం చాక్‌లెట్!




# క్రొత్తది! బాని మిక్స్(T) చాక్‌లెట్

## రోజు ఆరంభానికి చాక్‌లెట్ లాంటి పద్ధతి!

మీ బాబుకు అతను తిరస్కరించలేని బ్రేక్‌ఫాస్ట్‌ను ఇవ్వండి, బానిమిక్స్ చాక్‌లెట్.
ఇది చిరుధాన్యములు, పళ్ళు కాజుపల్కులతో చాక్‌లెట్ కలిసిన పోరిజ్.




**తయారుచేయుటకు ఎంతో అనుకూలమైనది.**

వండుకోవలసిన అవసరం లేదు. ఒక గిన్నెలో కావలసినంత పరిమాణంలో బానిమిక్స్‌ను వేయండి. మరగపెట్టి సిద్ధంగా ఉంచిన పాలను అందులో పోయండి. మీకు కావలసిన మృదువైన జావ తయారయ్యేదాకా, నెమ్మదిగా, కలియబెట్టండి.



**బాని మిక్స్(T)**

ఓ క్షణంలో తయారయ్యే పోరిజ్.
**2 రకాలలో లభిస్తుంది.** నాచురల్ * చాక్‌లెట్

గ్లాక్సో నుండి వస్తుంది మంచి ఆరోగ్యం.

GL/C/1/89/TEL

# చతుర ప్రపంచం

## నాథ్ ద్వారా

నాథ్‌ద్వారా మందిరం మధ్యయుగాలలో వెలసింది. అదొక అంధయుగం. ఆ కాలంలో ధర్మాన్ని సంస్కృతిని ధ్వంసం చేసే ఘోరప్రయత్నం జరిగింది. ఆక్రమణదారులు మన ప్రాచీన మందిరాల వైభవాన్ని దోచుకోవడమేకాక ప్రపంచంలోని అన్నిటికంటే ప్రాచీన సంస్కృతిని వంచించే విఫలప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నంలో భాగంగానే వారు అయో



ధ్యలో రామజన్మభూమి మందిరాన్ని మధురలో కృష్ణ జన్మభూమి మందిరాన్ని కొల్లగొట్టారు.

315 సంవత్సరాల క్రితం నాథ్‌ద్వార అనే పేరు కల గ్రామమేలేదు. కాని 1672 అక్టోబరులో పర్వతాలు, కీకారణ్యాలతో నిండిన రాజస్థాన్‌లోని ఒక చిన్న అజ్ఞాతగ్రామం రెండవ బృందావనంగా మారింది. అక్కడ శ్రీనాథ్‌జీ విగ్రహాన్ని ప్రతిష్ఠించటం వల్ల శ్రీనాథ్‌జీ పేర 'నాథ్‌జీద్వార' అనే పేరుతో పిలవబడసాగింది.

శ్రీనాథ్ ఓ మందిరం నిర్మాణం కాకముందు ఆ ప్రదేశం ధార్మిక ప్రాముఖ్యత గూర్చి ఏ గ్రంథంలోనూ పేర్కొనబడలేదు. అయితే ఉదయపూర్ మహారాజు రాజసింహుడు శ్రీనాథ్‌జీ విగ్రహాన్ని రథంలోబ్రజ్ ప్రాంతం నుండి స్వయంగా తీసుకొని బయలుదేరాడని, దారిలో రథచక్రాలు బురదలో దిగబడ్డాయని ఆయన దానినొక సంకేతంగా పరిగణించి అక్కడే శ్రీనాథ్‌జీ మందిరం నిర్మింపచేశాడని కొందరు చరిత్రకారుల అభిప్రాయం.

అయితే చరిత్రకారుల అభిప్రాయంతోపాటు ఆ మందిరం గూర్చి మారెన్నో జనశృతులు ప్రాచుర్యంలో ఉన్నాయి. శిల్పకళ దృష్ట్యా శ్రీనాథ్‌జీ మందిరం బయటి నుండి అతిసాధారణంగా కనిపిస్తుంది. బహుశా అప్పటికాలపరిస్థితిని గమనించి మందిరాన్ని అతిమామూలుగా నిర్మించి ఉండవచ్చు.

భవనంకంటే భావనకు ఎక్కువ ప్రాముఖ్యం లభించింది. అందువల్ల ఆ మందిరం అనతికాలంలోనే తన వైభవానికి దేశమంతటా ప్రఖ్యాతిగాంచింది. మందిరంలోపల పెక్కు ఆభరణాలున్నాయి. బంగారం, వెండితో తయారుచేసిన వినుగ్రాళ్లు ఉన్నాయి. వాటితో ప్రత్యేక సందర్భాలలో నివేదన చెయ్యడానికి వివిధ ధాన్యాలు వినరబడేవి. మందిరం లోపల లభించే ప్రసాదం అత్యంత రుచికరంగా ఉండటం వల్ల విదేశాలు కూడా పార్సిళ్ల ద్వారా తెప్పించుకుంటాయి.

మందిరంలో ప్రతిరోజు ఉదయం నుండి రాత్రి వరకు శ్రీనాథ్‌జీ నల్లని విశాలరాతి విగ్రహం 8 సార్లు విభిన్నరూపాలలో అలంకరించబడుతుంది. ప్రతిసారి ఆభరణాలు, దుస్తులు, సేవా పద్ధతి మారుతుంది. సంగీతంకూడా మారుతుంది.

కాకతాళీయంగా శ్రీనాథ్‌జీ మందిరానికి కే

ముఖచిత్రం : జగ్‌మోహన్

వలం 10 కిలోమీటర్ల దూరంలోనే ప్రఖ్యాతి గాంచిన చారిత్రాత్మక హల్దీఘాటీ ఉంది.

నాథ్‌ద్వారలో సంవత్సరమంతటా దూర ప్రాంతాల నుండి వచ్చే తీర్థయాత్రికులు, పర్యాటకులు, కృష్ణభక్తులతో నిండిపోతుంది. కాని సంవత్సరంలో 7 రోజులు అక్కడ 'గణ గౌర్' (గౌరి) పూజ అత్యంత ఆడంబరంగా నిర్వహించబడుతుంది. 7 రోజులు కొనసాగే ఆ పూజా ఉత్సవం హోలికాదహనం తరువాత ప్రారంభమవుతుంది.

గణగౌర్ ఉత్సవం రాజస్థాన్ అంతటా నిర్వహించబడుతున్నా కాని నాథ్‌ద్వారలో అత్యంత వైభవంగా నిర్వహించబడుతుంది. వరుసగా 7 రోజులు గౌరి ఊరేగించబడుతుంది. ఆ ఊరేగింపు ప్రత్యేకత ఏమిటంటే అందులో పాల్గొనే స్త్రీ పురుషులందరూ ప్రతి రోజు ఒక కొత్తరంగు వస్త్రాలు ధరిస్తారు. ఆ రంగు అంతకుముందురోజే నిర్ణయించబడుతుంది.

ఒకటి నుండి ఒకటిన్నర మీటర్ల పొడవైన గౌరికాష్ఠ ప్రతిమకు రంగు రంగుల నూతనవస్త్రాలు, ఆభరణాలు ధరింపచేసి శోభాయాత్ర తీయబడుతుంది. ఆ యాత్ర నాథ్‌ద్వార ప్రధాన మహంత్ (సాధువులలో ముఖ్యుడు) నివాసస్థానమైన మోతీమహల్‌నుండి ప్రారంభమవుతుంది. పద్ధతి ప్రకారం బ్యాండ్ బాజాల ధ్వని ప్రతిధ్వనించగానే ప్రధానమహంత్ తన నివాస భవనం నుండి బయటకు వచ్చి నిలబడతాడు. ముందు ఆయన నడుస్తుంటే పల్లకిపై గౌరి విగ్రహం వస్తుంటుంది. అనేక సంవత్సరాల నుండి ఇదంతా ఒక పరంపరగా కొనసాగుతోంది.

నాథ్‌ద్వారలో గౌరీ ఉత్సవం సందర్భంగా మరో సంప్రదాయం పాటించబడుతోంది. నాథ్‌ద్వార ప్రధాన మందిర యాజమాన్యం అక్కడ కొంతమంది అద్దకపు పనివారిని నియమిస్తుంది. వారు బజార్ల పక్కనే ఆ వారమంతా మకాం వేస్తారు. నాథ్‌ద్వార నగరవాసులకు, తీర్థయాత్రికులకు ఆ వారంరోజులు దుస్తులకు నిర్ణయించిన రంగును వెయ్యడం వారి పనివారీ పనిని ఉచితంగా చేస్తారు. అయితే వారికయ్యే ఖర్చు మొత్తం నాథ్‌ద్వారమందిరం నిర్వాహక ట్రస్ట్ భరిస్తుంది.

## మరణించాక కూడా ప్రపంచం చూడాలంటే...

కిట్టీహజారియా మనదేశంలో ప్రఖ్యాతులైన ఫొటోగ్రాఫర్లలో ఒకరు. ఫొటోగ్రఫీ జీవనాధారంగా, వృత్తిగా ఎంచుకున్న ఆయన నైపుణ్యానికి మంచి గిరాకీ వుంది కూడా. అయినా తను తీసే ఫొటోలలో ఏదో ఒకచోట స్పష్టత లోపించిందనో, ఫలానా రంగు మరింత నిర్దుష్టంగా వుంటే బాగుండుననో తను తరచుగా అనుకుంటూంటానని వివరించారాయన. దీని వలన ఆయన ఫొటోలలో లోపాలున్నాయనో, వాటిని ఉపయోగదారుల నిర్దుష్ట సూచనల మేరకు ఆయన తీయలేకపోయాడనో అనుకుంటే పొరపాటే. సృజనాత్మక ఆవేశాన్ని మరింత రెచ్చగొడుతూ, మరింత స్పష్టమైన, చక్కని ఫొటోలు తీయమని ఈ ఆలోచనలు తనను రెచ్చగొడుతుంటాయని అంటారు హజారియా.

ఒక ఫొటోగ్రాఫర్‌గా వేల రూపాయల విలువైన కటకాలకంటే కళ్ళు ఎంత విలువైనవో గ్రహించగలిగిన కిట్టీహజారియాతో కలిసి ఆయన భార్య, కూతుళ్ళూ కూడా తమ మరణానంతరం తమ కళ్ళను దానం చేస్తామని వాగ్దానపత్రంపై సంతకంచేసి 'లైమ్స్ ఐ రీసెర్చ్ ఫౌండేషన్' వారికి అందించారు.

సర్వేంద్రియానాం నయనం ప్రధానం. అని చెబుతూ, కంటిచూపు విలువను ప్రాచీనులు ఏనాడో గుర్తించారు. మనం మరణించిన తరువాత మనకు ఎందుకూ పనికిరాని కళ్ళను దానంచేస్తే, అంధుల జీవితంలో వెలుగు నింపవచ్చు. అందుకే కళ్ళను దానం చేయగోరే వారిని ప్రోత్సహిస్తూ, కొన్ని స్వచ్ఛందసేవాసంస్థలూ, ప్రభుత్వమూ అనేక కార్యక్రమాలు చేపడుతున్నాయి. ఆయాసంస్థలకు విరాళాలు పంపితే ఆ డబ్బుతో కొందరు అంధులకు కనుచూపు అందించటానికి అవసరమైన ఖర్చుకు సహాయం చేసినట్టవుతుంది. ఇన్‌కమ్ టాక్స్ చట్టం 1961లోని సెక్షన్ 80 (జి) ప్రకారం ఈ విరాళాలకు ఆదాయపు పన్ను నుండి మినహాయింపు లభిస్తుంది కూడా.

కళ్లు దానం చేయగోరేవారు ముఖ్యంగా తెలుసుకోవలసిన ప్రాథమిక విషయాలు కొన్ని వున్నాయి. స్త్రీ పురుష భేదంగానీ, వయోతారతమ్యంగానీ లేకుండా ఎవరైనా తమ కళ్లను దానం చేయవచ్చు. కళ్లజోడు వాడుతున్న వారైనా, కాటరాక్ట్ వున్న వారైనా, కంటి ఆపరేషన్ చేయించుకుని చూడకలుగుతున్న వారైనా సరే, తమ కళ్లను దానం చేయవచ్చు.

కళ్లు దానం చేయగోరినవారు మరణించిన తరువాత 6 గంటలలోగా వాటిని తొలగించాల్సి వుంటుంది. ఇందుకు మృతుని బంధువుల చొరవ ఎంతైనా అవసరం. అంతేకాక స్వచ్ఛందంగా కళ్లు దానం చేస్తామని వాగ్దానంచేసి మరణించిన వారి కళ్లను తొలగించటానికి, ముఖ్యంగా వారి బంధువులతో గొడవలు వచ్చిన సందర్భాలెన్నో వున్నాయి. ఇలాంటివి రాకుండా వుండటానికీ, సకాలంలో కళ్లబ్యాంకువారికి దాత మరణం గురించి తెలువటానికీ మృతుని బంధువుల సహకారం ఎంతైనా అవసరం. అందువల్ల కంటిదాతలు తమ వాగ్దానంతోపాటు ఇద్దరు సాక్షులు, ముఖ్యంగా దగ్గరి బంధువులతో ఆ వాగ్దానపత్రంపై సాక్షి సంతకాలు చేయించటం మంచిది. ఇందువల్ల ఆ దాత తన కళ్లను దానం చేయగోరిన విషయం వారికి తెలియటంతోపాటు, వాళ్లు ఆ తరువాత ఎలాంటి అడ్డంకులూ కలిగించకుండా ముందే వాళ్లను ఒప్పించేపని పూర్తవుతుంది. అంతేగాక ఆ సాక్షులు కూడా తమ కళ్లను దానం చేయటానికి సుముఖులయ్యే అవకాశం కూడా ఏర్పడుతుంది. కంటిదానం చేస్తానని వాగ్దానం చేయకపోయినా, ఆ విషయం గురించి ఏనాడూ వ్యతిరేకంగా మాట్లాడని బంధువులు మరణించినప్పుడు, వారి కళ్లను దానంచేసే వీలును మృతుల సన్నిహితులకు మన చట్టం కల్పించింది.




మరణించిన 6 గంటలలోగా కళ్లను తొలగించాల్సి వున్నందున వెంటనే ఆ విషయం కంటి ఆసుపత్రివారికి తెలియజేయాలి. కంటి ఆసుపత్రివాళ్లు వెనువెంటనే తమ వైద్యుణ్ని మృతుని ఇంటికి పంపిస్తారు. కళ్లను తొలగించటానికి 10 నుండి 15 నిమిషాలకన్నా ఎక్కువ సమయం పట్టదు. అంతేగాక ఆపరేషన్ చేసిన గుర్తులుకానీ, మచ్చలుగానీ, వికారంగా కనబటంగానీ జరగదు. ఒక కంటిని ఒకరికి చొప్పున ఇద్దరు అంధులకు ఆ కళ్లను అమర్చుతారు. అంటే కంటిదానం చేసినవారు తమ మరణం తరువాత కూడా ఈ ప్రపంచాన్ని చూస్తుంటారు. మామూలు మనుషులు తమ రెండుకళ్లతో ఒకేసారి ఒక్క దృశ్యాన్ని మాత్రమే చూడగలిగితే, కంటిదాతలు తమ రెండు కళ్లతో రెండు వేర్వేరుచోట్ల వేర్వేరు దృశ్యాల్ని చూస్తారన్నమాట. ముఖ్యంగా రెండు అంధకార జీవితాలలో కనుచూపు వెలుగు నింపుతారు.

కళ్లను దానం చేయగోరేవారు ఆ విషయానికి సంబంధించిగానీ, విరాళాలకు సంబంధించిగానీ తమకు సమీపంలోని కంటి ఆసుపత్రివారినిగానీ, ఇందుకు సంబంధించిన ఏదైనా స్వచ్ఛందసేవాసంస్థను గానీ సంప్రదిస్తే వారు అన్ని అనుమానాలూ తీరుస్తారు. ఇలాంటి సంస్థల్లో, టైమ్స్ ఐ రీసెర్చ్ ఫౌండేషన్, ద టైమ్స్ ఆఫ్ ఇండియా, 10 దర్యాగంజ్, న్యూఢిల్లీ-110 002 అన్న చిరునామాలోగల సంస్థ ఒకటి.

# వింతవర్షాలు

వానతోపాటు అప్పుడప్పుడూ వడగండ్లు పడటం మనందరికీ తెలుసు. కాని 1892 జూన్ 17న ఇంగ్లండ్‌లోని మిడిల్‌సెక్స్‌లో వర్షంతోపాటు పీతలు, నత్తలు కురిశాయి. ఎక్కడ చూసినా గుట్టలుగుట్టలుగా పడుతున్న వాటిని చూసి ప్రజలు అప్రతిభులైపోయారు.

1944 ఫిబ్రవరిలో తూర్పు ఆఫ్రికాలోని కొన్ని ప్రాంతాలలో చిక్కటి ఎరుపురంగు పెయింట్ వర్షించడంతో కొన్ని నగరాలు ఎర్రబారిపోయాయి. అదే సంవత్సరం అలాంటి వర్షమే రోమ్‌లోని బ్లూయిష్‌లో కూడా పడింది. దిలిషాపాకు చెందిన ఒకానొక ప్రాంతంలో 1951 జులై 6న కప్పలవాన కురిసింది. అలా కురిసిన కప్పలలో చాలా భాగం కొన్నిరోజులపాటు ప్రాణాలతో ఉన్నాయని తెలియవచ్చింది. లండన్ పశ్చిమ ప్రాంతంలో 1959 సెప్టెంబర్ 9న వానతోపాటు లక్షలకొద్దీ నల్లని కందిరీగలు కురియడంతో ప్రజలు భయభ్రాంతులై నదుల్లోనూ, బావులలోనూ దూకి వాటి బారి నుంచి తప్పించుకొన్నారు.

1950 సెప్టెంబర్ 17న స్వీడన్‌లోని అనేక పర్వతప్రాంతాలలో రకరకాల కీటకాలు కుప్పలు తెప్పలుగా వర్షించాయి. పాకిస్తాన్‌లోని తంగివాలెయన్ గ్రామంలో 1966 ఏప్రిల్ నెలలో వానతోపాటు రాళ్ళు పడ్డాయి. అవి ఒక్కొక్కటి ఇంచుమించు అరకిలోపైనే తూగాయి. 1889 ఆగస్టు 7న ఇరాన్‌లోని మలకాన్ అడవిలో యాసిడ్ వర్షంలా కురిసింది. ఫలితంగా ఎన్నో ఎకరాల అడవి బూడిద కుప్పగా మారిపోయింది. ఫ్రాన్స్‌లోని లాలేగ్రామంలో 1794 జనవరి 9న హఠాత్తుగా మేఘాలు కమ్ముకొచ్చి పెద్దపెద్ద కప్పలు, పాముపిల్లలు అరగంటపాటు వర్షించాయి. హైతీ దీవిలోని ప్రిన్స్‌పోర్ట్‌లో 1786 మే 5న నల్లటి గుడ్లవాన కురిసింది. కాని అంత ఎత్తునించి పడినా ఆ గుడ్లలో ఏ ఒక్కటి పగలకపోవడం మరింత ఆశ్చర్యం!

1857 నవంబర్ 9న కాలిఫోర్నియాలోని నియాకొంట్ గ్రామంలో పానకం వర్షించిందట. ఆ నీరు ఎంతో తియ్యగా పంచదార నీటిలా ఉండటంతో ఆ ప్రాంత వాసులు తెగసంబరపడిపోయారు.

రష్యాలోని గోర్కి ప్రాంతంలో జూన్ 17, 1940న రూబుల్ నాణాలు వర్షంలా కురిశాయి. దానికి అసలుకారణం భూగృహంలోనున్న ఓ ఖజానా ప్రమాదవశాత్తు విస్ఫోటనం చెంది ఉవ్వెత్తున నాణాలు పైకిలేచి ఆ ప్రాంతమంతా వెదజల్లబడ్డాయి. అదే నాణాల వానలా




కన్పించింది. అలాగే తిక్కశంకరయ్య లాంటి ఓ రోమన్ పైలట్ మిలియన్ల కొద్దీ ప్రభుత్వధనాన్ని విమానంలో తీసుకుపోతూ సరదాగా ఆ కరెన్సీ పెట్టెని తలక్రిందులు చేశాడట. ఇంకేం! ఆకాశం నుంచి కరెన్సీ కాగితాలు వర్షంలా కురిసి ప్రజల్ని ఆశ్చర్యచకితుల్ని చేశాయి. ఈ సంఘటన 1976 అక్టోబరు 8న జరిగింది.

# వింత పలకరింపులు

సాధారణంగా పరిచయస్థులు ఎదురైనపుడు మనం 'హలో' అనో, 'నమస్కారం' అనో, 'బాగున్నారా?' అనో పలకరిస్తుంటాం. ఈ పలకరించుకునే పద్ధతి విదేశాలలోనూ ఉంది. కానీ ఆ పద్ధతులు మనకు అతి విచిత్రంగా కన్పిస్తాయి.

టిబెటన్లు పలకరించుకునే పద్ధతి భలే గమ్మత్తుగా ఉంటుంది. ఒకరికొకరు ఎదురైనప్పుడు వాళ్లు నాలుక బయటకు చాచి సన్నగా ఈలవేస్తారు. స్పెయిన్‌లోనైతే పలకరింపుగా ఒకరికొకరు రొట్టిముక్కలు చూపించుకుంటారు. అందుకోసమే ప్రత్యేకంగా వాళ్ళెప్పుడూ కొన్ని రొట్టిముక్కల్ని చేతపుచ్చుకు తిరుగుతుంటారట.

ఫిలిప్పీన్స్‌లో ఈ విధానం మరింత గమ్మత్తుగా ఉంటుంది. ఎవరైనా ఎదురయితే వాళ్లు తక్కున చెవులు మూసేసుకుంటారు. ఆ తర్వాత గౌరవ పురస్కారంగా ఓ కాలు పైకెత్తి చూపిస్తారట. ఫ్రాన్స్‌లో పలకరించుకోవటమంటే ఒకరి మెడ ఒకరు అప్యాయంగా కొరుక్కోవటమే పద్ధతట!




రెడ్ ఇండియన్లలో ఈ పలకరించుకోవటం పరస్పరం చుట్టలు ఇచ్చి పుచ్చుకునే రూపంలో జరుగుతుంది. థాయిలాండ్‌లోనైతే అచ్చం మన భారతీయుల్లానే చేతులు జోడించడం ఆనవాయితీ. కానీ ఆ తర్వాత వాళ్ళు 'స్వస్తి' అని పలుకుతారు. మలయాలో మాత్రం ఒకరి తలనొకరు తాకితే పలకరించుకొన్నట్లేనట. టాస్మానియన్లు పలకరించుకోడానికి చిహ్నంగా ఒకరి ముక్కునొకరు కొరుక్కుంటారు. ఆఫ్రికాలోని కొన్ని జాతులవాళ్లు ఒకరికొకరు తారసపడ్డప్పుడు తువ్వాళ్ళు మార్చుకుంటారట. ఇక లాప్‌లాండ్ విషయానికొస్తే అక్కడ స్త్రీ పురుష భేదం లేకుండా ఒకరినొకరు గాఢంగా ముద్దు పెట్టుకోవడమే పలకరింపుగా భావిస్తారు.

# మూషికాలతో శతదినోత్సవం

ఇండియాకు చెందిన అమియా గోస్వామి అమెరికాలోని లాస్‌ఏంజిల్స్‌లోనున్న ఓ పెద్ద లాడ్జికి యజమాని. అయితే ఆ పెద్దమనిషి నిర్లక్ష్యవైఖరి వల్ల లాడ్జిగదుల్లో ఎలుకలు యధేచ్ఛగా సంచరించసాగాయి. కష్టమర్లెంత మొత్తుకున్నా ఇండియాలోమల్లే చెల్లుబాటైపోతుందనే నమ్మకంతో గోస్వామి వారి గోడును చెవికెక్కించుకోలేదు. ఫలితంగా కష్టమర్లు కోర్టుకెక్కారు. నేరం రుజువు కావడంతో జడ్జిగారు గోస్వామికి ఓ వింతశిక్ష విధించారు. ఏమంటే ఎలుకలతో నిండిన ఓ గదిలో 100 రోజులపాటు అతన్ని నిర్బంధించడం. చివరికి కాలకృత్యాలకోసం కూడా అతన్ని బయటికి విడిచేందుకు వీలులేదని ఆ న్యాయమూర్తి ఆజ్ఞలు జారీచేశారు.

అంతేగాక గోస్వామిలాంటి 'అతితెలివి ఘటాలు' శిక్ష సరిగ్గా అమలు జరగనీయకుండా వక్రమార్గాలు తొక్కినా తొక్కగలరని భావించి అతని ప్రతి కదలికా తనకి తెలిసిపోయేలాగా ఆ గదిలో ఓ క్లోజ్‌డ్. సర్క్యూట్ టీ.వీని కూడా ఏర్పాటు చేయించాడాయన. శిక్షాకాలం 100 రోజులు ముగిసేలోగా గోస్వామి తన లాడ్జిలోని ఎలుకలన్నింటినీ తరిమేయించాలనీ, ఆ తర్వాత అక్కడ ఒక్క ఎలుక కనబడ్డా ఇంకా భయంకరమైన శిక్షకు గురికావాల్సిఉంటుందని ఆయన గోస్వామిని గట్టిగా హెచ్చరించాడు.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి టాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

**ఆగస్టు చతుర నవల 'నరబలి'**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................




**జూన్ నెల 'చతుర'లో ప్రచురితమయిన వయ్యస్సారెస్ నవల 'భీమఖండం" పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగాఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.**

## హాస్యఖండం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

"వయ్యస్సారెస్" గారి "భీమఖండం" నవల రసవత్తరమైన ఒక హాస్యఖండం. సునిశితమైన హాస్యంతో గలగలపారే ఒక సాంఘిక ప్రవాహం. తెలుగు లెక్చరరు భీమన్న ఒక చాదస్తపు బామ్మని అమితంగా అభిమానించే మట్టిలోని మాణిక్యం. సూపర్ సోనిక్ స్పీడ్‌లో పయనిస్తున్న కాలంలో తానుమారి బామ్మ చాదస్తం మానిపించాల్సిందిపోయి, ఎక్కడ వేసిన గొంగళి అక్కడేనన్న సామెతలా మిగిలిపోయిన అచ్చ తెలుగు కుర్రవాడు భీమన్న. స్వయం కృషిలో పైకివచ్చినా, బామ్మ ప్రేమ అనే అగాతంలో పడి నవ్యప్రపంచానికి దూరంగా నిలిచిపోయిన అమాయకుడు. అతన్ని మట్టిలో నుంచి వెలికి తీసి సానబెట్టిన వకుళ, ఓ వజ్రపుతునక. క్లాస్‌రూమ్‌లో స్టూడెంట్ల అల్లరి అదుపుచేయలేని భీమన్నని, చిన్నచూపు చూస్తారు హిస్టరీ, ఇంగ్లీషు మాష్టర్లు. పితూరీలు ఆధారంగా నిజానిజాలు గ్రహించకపోగా భీమన్ననే చీవాట్లేస్తారు ప్రిన్సిపాలుగారు. లుంగీలు అచ్చిరావటంలేదని, అర్థచెడ్డీలు వేయించి, పాచిపోగులు తీయించే బామ్మగారి పిచ్చి ప్రేమ, వకుళ ఆకతాయితనం పసిపిల్లవాడి క్రింద జమకట్టి, తనకు తన పూర్వీకులలో ఒకరైన కవి భీమన్న లాంటి గొప్పతనం రాలేదన్న నెపంతో అస్తమానం సాధించే బామ్మ మనస్తత్వం. ఇవన్నీ కలిసి భీమన్నని ఓ వింతమనిషిగా చేశాయి. తానందరికీ ఒక వింత జీవిగా కన్పిస్తున్నానని ఆయనకు తెలీదు. తానెందుకు పదిమందిలో నగుబాట్ల పాలవుతున్నానన్న విషయాన్ని ఆలోచించడు. వాస్తవాల మైక్రో స్కోపులోంచి అవన్నీ గమనిస్తే గాని నిజం తెలిసిరాదని కూడా అతనికి తెలీదు. అలా అని, తాను పరిహాసానికి గురి అవుతున్నానని గమనించలేని అమాయకుడూ కాదు. తన బలహీనతల్ని అసమర్థతని ప్రతిరోజూ విమర్శించుకుంటూ, తనకు జరిగే అవమానాలకి పర్మనెంటుగా ఫుల్‌స్టాప్ పెట్టాలని గట్టి ప్రయత్నాలు అనేకసార్లు చేస్తాడు. ఈ పరిస్థితే ఇంకా కొన్నిరోజులు సాగివున్నట్టయితే భీమన్న చాలా మానసిక విపత్తుల్లో చిక్కుకోవల్సి వచ్చేదే. కాని ప్రయత్నాల ఎదురీతలో అతనికివన్నీ పూచికపుల్లల్లా తగుల్తాయి. వకుళతో పరిచయం ఉధృతమైన ఒక అలలా ప్రవేశించి ప్రశాంతంగా ఒడ్డుకు చేర్చింది. భీమన్నలోని ఆకర్షణలకు లొంగటమే కాకుండా, అతనిలోని బలహీనతల్ని చదివేసి తీగలా అల్లుకుపోయి, అపోహల్ని తొలగించేలా సంస్కరించి, అతనికి వాస్తవాల్ని అవగాహనకి తెచ్చే బాధ్యతని గూడా నెత్తిన వేసుకొంది. అమాయకుడైన మాష్టారికి ఓ స్టూడెంట్ జీవనసత్యం బోధించవలసి రావటం, ఈ నవలలోని ప్రత్యేకత. ఇటు భీమన్న మనసు నొప్పించక, అటు బామ్మ

అచారవ్యవహారాలకు ఇబ్బంది రానీకుండా ఇద్దరి మనుసులు చూరగొన్న వకుళ, వారిద్దరి హృదయాల్నే గాక, యువపాఠకుల హృదయా ల్ని గూడ చూరగొంది. భీమఖండం నిజంగా ఒక హాస్యఖండమే.

**—శమంతకమణి**, తిరుపతి.

## అపరిపక్వత

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**జూన్**నెల నవల 'చతుర'లో ప్రచురించిన 'వయ్యేస్సారెస్' గారి "భీమఖండం" కేవలం కాలక్షేపం నవల. అలా అలవోకగా చదివేసి ఇలా తేలిగ్గా మర్చిపోతారు పాఠకులు. 'చ తుర' నుండి వెలువడి మెదడుకు పదునుపె ట్టిన, హృదయాల్ని కుదిపి వేసిన అనేక నవలల్ని చదివిన వారికీ నవల నిరాశ కల్గించిందని చెప్పక తప్పదు.

ఈ రచనకు గాను, రచయిత కున్న కథాంశం చాలా చిన్నది. అయినా మంచి కల్పనతోనూ, సునిశిత హాస్యంతోనూ రక్తి కట్టించవచ్చు. కానీ అలా జరగలేదు. ఎక్కడా ఒక్క బలమైన సన్నివేశమూ లేదు. హాస్య నవల అయినా 'కడుపుబ్బనవ్వించే' చతుర సంభాషణలూ లేవు. ఈ నవల్లో వాస్తవికమైన జీవితమూ, దాని చిత్రణా లేదు. రచయిత జీవితాన్నుండి కాక, మన హాస్య రచయితల పాత రచనల నుండి ప్రేరణ పొంది, ఆ ఉత్సాహంతోనే 'ప్రయత్నించి' రాసినట్లుంది. చివరి పేజీల్లో మాత్రం ఛాందస బామ్మలు మారాలనీ, మారే కాలంతో మారని మనుషు లకు తిప్పలు తప్పవనీ, మారటం అవసర మనీ సలహాలు, సందేశాలు ఇవ్వబోయారు రచయిత. ఇవేమీ కూడా వాస్తవికత నుండీ బలమైన సన్నివేశాల నుండీ అనువైన రీతిని సందర్భోచితంగా, సహజంగా ఏర్పడినవిగా లేవీ నవల్లో.

పాత్రల్లో కూడా ఒక్కటీ వెన్నముక ఉన్న పాత్రకాదు. ముఖ్యంగా భీమన్న ఓ వైపు బామ్మకు దాసోహం అంటూ ప్రపంచం అంటే ఏమిటో తెలీనివాడుగా పరిచయమవుతూ మరోవైపు అందుకు విరుద్ధమైన ఆలోచనలు చేస్తాడు. భీమన్నలో మార్పు, అతని ప్రేమ వ్యవహారం, బామ్మను బావిలో కప్పుత త్వంనుంచి బయటపడేయటం లాంటి ఎన్నె న్నో ప్రయత్నాలు, వాటిఫలితాలు కేవలం కొన్ని రోజుల వ్యవధిలోనే చకచకా జరిగిపో యాయి. ఏ సంఘటన యొక్క సంభవా సంభవాలకీ కూడా పునాది లేదీ నవల్లో.

నవలకోసమే అన్నీ జరిగిపోయాయి. 'వ కుళ' భీమన్నను ఎందుకు ప్రేమిస్తోందో, అత నిలో ఏం చూసి ఆకర్షితురాలవుతోందో, వకుళ మనో భావాలేమిటో, ఇత్యాది ముఖ్యమైన ప్రశ్న లకు సమాధానాలు లేవీ నవల్లో. రచయిత ఉద్దేశించిన హాస్యం అంతగా పండలేదు. రచ యిత ఏమి ఉద్దేశించి ఈ నవల రాశారో స్పష్టంగాలేదు. తను చెప్పదలుచుకొన్నది పాఠ కులలో నాటుకునేటట్లు చేయడంలో రచయిత సఫలీకృతులు కాలేదు. ఈ నవలలోని లోపా లకు కారణమైన అపరిపక్వతను రచయిత పరిహరించుకోవాలి.

**— సి. హెచ్. రమాదేవి**, హైద్రాబాద్.

## చెప్పదలిచినదేమిటి?

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**కాలేజీ** లెక్చరర్ల పాత్రలతో అనేక నవలలు వచ్చినప్పటికీ ప్రతి నవలలోనూ ఏదో ఒక కొత్తదనం ఉండి తీరుతుంది. కారణం రచయి తలు కొన్ని కాలేజీలోని సంఘటనలను అంశా లుగా తీసికొని వ్రాస్తుంటారు గనుక ఆయా సంఘటనల మధ్య వైవిధ్యం ఉండి తీరు తుంది. కనుకనే రచనల మధ్య తేడా కన్పి స్తుంది.

"భీమఖండం" నవలలో కూడా కాలేజీల సంఘటనలకు కొంత ప్రాధాన్యత చూపించిన ప్పటికీ, కథానాయకుని పాత్రలోని అమాయ కత, బామ్మగారి అతి ప్రేమ దాన్ని డామినేట్ చేశాయి. భీమన్న అమాయకత, విద్యార్థినీ విద్యార్థుల గడుసుదనం, కొంత హాస్యాన్ని సృష్టించినప్పటికీ వెలితి అనేది స్పష్టంగా కన్పి స్తుంది. లెక్చరర్‌గా భీమన్న పడిన బాధలు దాదాపుగా ప్రతి లెక్చరరుకూ తొలిరోజుల్లో తప్పవు అన్పిస్తుంది. భీమన్నలో తానుకూడా ఎలాగైనా అమాయకత్వాన్ని త్యజించి తెలి విగా ప్రవర్తించాలనే తపన కన్పిస్తుంది. కానీ

దానికి అద్దంకి బామ్మగారి అపరిమిత నియంత్రణ అని, దాన్నించి తప్పుకోలేని నిస్సహాయతలో ఉన్నాడనీ అన్పించినా దానిని తనకు తాను సమర్థించుకోవడంలో అతని అమాయకత సందేహాస్పదంగా కన్పిస్తుంది. బామ్మను కాదని తాను స్వతంత్రంగా వ్యవహరించే ఆలోచన అతనికి వకుళ ద్వారా వచ్చిందే తప్ప స్వంత ఆలోచనగా వచ్చినట్లు కన్పించదు. చివరలో అతని శాపాల సన్నివేశం ఎబ్బెట్టుగా వుంది. నవలమొత్తం మీద బామ్మగారి మనస్థత్వాన్ని సృష్టించటంలో మాత్రం రచయిత చక్కని నైపుణ్యాన్ని చూపించారు. అయితే నవలలో చివరకు రచయిత ఏమి చెప్పాలనుకున్నాడో మాత్రం అర్థం కాలేదు. బామ్మగారిని మార్చడమో, తను మారడమో, విద్యార్థులకు దగ్గరవడమో పెళ్లిచేసుకోవడమో ఏది జరిగినా నవల ముగించడానికే రాసినట్లు అన్పిస్తుంది. మొత్తానికి ఇదో కాలక్షేపం నవల.

—**పొత్తూరి నాగేంద్రం**, తెనాలి.

## చదివించిన నవల

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**వ**య్యేస్సారెస్ గారి 'భీమఖండం' నవల ఏకబిగిని చదివించింది. ఆశువుగా సాగిన హాస్య సంభాషణలా, నవలముగించే సరికి మంచిమిత్రునితో చక్కగా కాలక్షేపం చేసినట్టుంది. చతురనుండి ఇలాంటి నవలల్నే మేం ఈ మధ్య కాలంలో ఆశిస్తున్నాము కూడా. సున్నితమైన హాస్యంతో సాగుతూనే చక్కని సందేశంతో ముగిసిందీ నవల. నొప్పించక తానొవ్వక తాను చెప్పదలచుకున్న విషయాన్ని చివర్లో జీజీరావుతో చెప్పించేసి తన బాధ్యత తీర్చుకున్నారు రచయిత.

సహజమైన వాతావరణ చిత్రణ చేయడంలోనూ, సరస సంభాషణలు చేయించటంలోనూ, నేటివిటీని ప్రతిబింబింపచేయడంలోనూ, రచయిత చాలా శ్రద్ధ చూపించారు.

తెలుగు మాష్టారిపట్ల నేడున్న చిన్నచూపు, భీమన్నలాంటి వాళ్ళలో ఉండే అనేకానేక స్వీయ మానసిక వైరుధ్యాల వల్ల కలిగే విచిత్ర ప్రవృత్తి, తద్వారా వారనుభవించే, వెల్లడించే ఆత్మన్యూనత, అది వారి ప్రవర్తనల్లో వెల్లడికావటం ఇత్యాది విషయాలు మంచి పరిశీలనా శక్తితో రచయిత చిత్రించారు.

కాలేజీ, స్టాఫ్ రూమ్, క్లాస్‌రూము, విద్యార్థినీ అధ్యాపకుల సంబంధాలు మొదలయినవి చిత్రించడంలో మంచి నైపుణ్యంచూపించారు రచయిత.

అయితే బామ్మ, భీమన్నల అనుబంధాన్ని చూపించినంతగా వకుళ భీమన్నల సంబంధాన్ని ఒప్పించలేక పోయారు రచయిత. వకుళ భీమన్న పట్ల ఆకర్షితురాలయే పరిణామాన్ని మరింత సంయమనంతో చిత్రిస్తే బాగుండేది.

అభిమానాలూ, ప్రేమలూ వ్యక్తులను కట్టిపడేసి వాళ్ళ అభివృద్ధికి ఆటంకం కారాదనీ, వాళ్ల సామాజిక జీవితానికి అవరోధం కారాదనీ ఈ నవల ద్వారా గుర్తిస్తాము. మారుతున్న కాలంతో మారని మనుష్యులు ఎన్ని ఇబ్బందులకు గురి కావాల్సి వస్తుందో హెచ్చరిస్తుందీ నవల.

కృతక సంభాషణల భారంతో వీర సన్నివేశాల గాఢతతో పాఠకుల్ని మరింత స్ట్రెయిన్ చేయకుండా హాయిగా చదివిస్తుందీ నవల.

ఇలాంటి నవలలే మళ్ళీ మళ్ళీ రావాలనలేంగానీ అప్పుడప్పుడూ వస్తుండాల్సిందేనని కోరుకుంటాం.

—**పి. సుధారాణి**, హైదరాబాద్.

## సుగర్ కోటెడ్ పిల్...

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**మా**రుతున్న సమాజానికి అనుగుణంగా వ్యక్తి, అతని ఆలోచనా విధానం మారాలి. సమయస్ఫూర్తిగల వ్యక్తిత్వంతో పరిసరాలను తన కనుకూలంగా మార్చుకోవాలి. చదువుల్లో సమర్థతేకాదు, సామాజిక జ్ఞానం, అవగాహన కలిగి వుండాలి. అలాంటి వాడే నలుగురిలో రాణించగలుగుతాడు. లేకుంటే సూపర్ సోనిక్ స్పీడ్‌లో పయనిస్తున్న కాలంలో ఎక్కడ వేసిన

గొంగళి అక్కడేనన్న సామెతలా పదిమందిలో ఫెయిలవుతూ, సనాతన సాంప్రదాయాల, ఛాందస భావాలవరదాల మాటున పెరిగిన బిడ్డడు భీమన్నలా అవస్థలపాలు కావలసి వస్తుంది. నేటికి మన సమాజంలో బామ్మ లాంటి, భీమన్నలాంటి క్యారక్టర్స్ అక్కడక్కడ కనపడుతూనే వుంటారు. మారుతున్న కాలంలో మారని మనుషులకు ప్రతీకలు వీళ్లు. వీళ్ళు తమచుట్టూ కాలం చెల్లిన భావాల తాళ్ళు బిగించుకుని సంఘంలో ఇమడలేక ఇడుములు పడుతుంటారు. జీవితంలోని అపజయాల నుండే వీళ్ళు గుణపాఠాలు నేర్చుకుంటారు. ఈ నవలలో రచయిత "వకుళ" పాత్రను ప్రవేశపెట్టి ఆమె వీళ్ళిద్దరినీ మార్చినట్లు చూపించారు. వకుళ చిన్నవయసుదయినా భీమన్న కన్నా తక్కువ చదువుకున్నా సమాజాన్ని వాస్తవాల మైక్రోస్కోప్ నుంచి గమనించాలన్న జీవిత సత్యాన్ని జీర్ణించుకున్న యువతి. ఈ పాత్రద్వారా తను అందించదలుచుకున్న సందేశాన్ని సునిశిత హాస్యంతో చక్కగా వ్యక్తీకరించారు రచయిత. చిక్కని జీవితసత్యాన్ని అందించే ఈ రచన సుగర్ కోటెడ్ మాత్ర శారీరక రుగ్మతల్ని దూరం చేసినట్లు, తన సామాజిక కర్తవ్యాన్ని కొంతవరకైనా తీరుస్తుంది. నేటి విద్యాలయాల్లో కొత్త లెక్చరర్ల అగచాట్లు, విద్యార్థుల అగడాలు సాటి ఉపాధ్యాయ ప్రవర్తనలు కూడా చక్కగా ప్రతిఫలించాయి. రచయితకు ధన్యవాదాలు.

—మాధవి, నర్సింహులపల్లె.

## సినిమాటిక్

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'ఇతరుల నొప్పించక, తానొవ్వక తప్పించుకు' తిరిగే మనస్తత్వమున్న భీమన్నలాంటి నగటు విద్యావంతులు ఇంటా, బయటా మానసికంగా ఎలాంటి సంఘర్షణలకూ, అపహాస్యానికీ గురవుతారో 'భీమఖండం'లో సునిశిత హాస్యమిశ్రమంతో ఆహ్లాదంగా చిత్రించారు రచయిత.

కొత్త లెక్చరరుగా ఇంటర్మీడియట్ క్లాస్‌లో ఒక పద్యం రాగయుక్తంగా పాడటానికి నానాపాట్లూ పడ్డ భీమన్న అనతికాలంలోనే ఆ విద్యార్థుల 'కీలెరిగి వాతపెట్టే' స్థాయికి పరిణతి చెందిన తీరు అత్యంత సహజంగా వుంది. కాలేజీలో యితర లెక్చరర్ల 'ఉద్యోగ నిర్వహణ విధానం' భీమన్నపట్ల వాళ్లు ప్రదర్శించే జాలి, కరుణ వగైరాలు నేటి కళాశాలల్లోని వాతావరణాన్ని ప్రతిబింబించాయి. ముఖ్యంగా ప్రిన్సిపాల్ భీమన్నకిచ్చిన సలహాలు నిజానికి ఆ స్థాయిలో ఉన్న వ్యక్తి ఇవ్వదగినవి కాకపోయినా, అనుభవజ్ఞుడైన వ్యక్తి ఇచ్చే ట్రైనింగ్‌లాగే వున్నాయి.

ఇంట్లో భీమన్న బామ్మతో పడేపోరు వ్యంగ్యంగా, హాస్యంగా మాత్రమే కాకుండా సహజంగా కూడా వుంది. రచయిత బామ్మా మనవళ్ళ మధ్య ఉన్న అనుబంధాన్ని ఆత్మీయతనూ హృదయానికి హత్తుకునేలా వివరించారు. భీమన్న నీటిబిందె మోసే సందర్భంలోనూ, 'పాచిపోగుబుట్ట సంఘటన'లోనూ బామ్మ భీమన్నల మధ్య జరిగిన వాదనల్లో ఎటు చూసినా న్యాయం వుంది. ఈ విషయంలో రచయిత చూపిన శ్రద్ధ అభినందనీయం. పైకి తిట్టినా, మనసులో బోలెడు ప్రేమను బారెడు అభిమానాన్నీ తన మనవడి పట్ల చూపే బామ్మ పాత్రనూ, బామ్మ చాదస్తాన్ని పైకి విమర్శించి, ఆమె చేష్టలకు విసుక్కున్నా గుండెలో 'తట్టెడు ప్రేమను బుట్టెడు అభిమానాన్నీ' నింపుకున్న భీమన్న పాత్ర చిత్రణలోను రచయిత కృతకృత్యులైనారు. కాలేజీలోని కొన్ని సంఘటనల్లో జీజీరావ్ సంభాషణల్లో ఇంకా మరికొన్ని చోట్ల రచయిత చక్కని హాస్యాన్ని అందించారు.

అయితే నవల్లో చాలాచోట్ల సహజత్వం లోపించింది. కథలోని చివరి సంఘటనలు మరీ కృత్రిమంగా వున్నాయి. ముఖ్యంగా భీమన్న రేషన్ షాపువాడితోనూ, కాలేజీ విద్యార్థులతోనూ అవమానానికీ, అవహేళనకీ గురికావటం, వకుళ పాత్ర స్త్రీ లోకానికి ఆదర్శప్రాయంగా ధైర్య సాహసాలనీ, సమయస్ఫూర్తినీ నేర్పేదిగా వున్నా మరీ చిన్న పిల్లచేత అంత పెద్దపెద్ద పన్లు చేయించటం అంత బాగాలేదు. రచనా విధానం చాలాచోట్ల 'సినీమాటిక్'గా వుంది.

—వై.టి. శ్రీదేవి, తిరుపతి

# చతుర

సంపుటి : 13 సంచిక: 7

ఆగస్టు 1990


దైవాంశ సంభూతుడుగా, భక్తుల పాలిట కల్పవృక్షంగా పూజింప బడుతున్న అతను... భారతదేశంలోని ప్రజలందరికీ మాతృమతం హిందూ మతమేనని ఉద్బోధించడానికే కంకణం కట్టుకున్నానని చెప్పే అతను... ఆరాధనా మందిరాలు కట్టించి భగవద్గీతతో కాలక్షేపం చేసే అతను...

ఎందరెందరో తల్లిదండ్రుల కడుపు కోతలకీ, పసిపిల్లల అంగవై కల్యాలకీ, ఆర్తనాదాలకీ మూలకారణమనీ, దొంగనోట్ల ముద్రణలతో, నరమేధాలతో, దోపిళ్ళతో సంబంధం కల వివాదాస్పదుడనీ, వ్యభి చారి అనీ, తాగుబోతు అనీ ఆరోపణలకు గురయ్యాడు.

ఇంతకీ ఎవరతను?

అతనిపై వచ్చిన ఆరోపణల్లో నిజం ఎంత? అది కేవలం గిట్టని వారి దుష్ప్రచారం మాత్రమేనా?

నిప్పులాంటి నిజాలు ఎప్పటికైనా అబద్ధాన్ని నిలువునా దహించి వేస్తాయనీ, జనవాహిని ముందు ఎంతటివారైనా తలవంచి తీరా ల్సిందేనని నిరూపిస్తూ-కె.విశ్వమోహనరెడ్డి దర్శింపచేసే

# నరబలి

ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

కళ్ళు తెరచి చూశాడు ప్రసాద్! ఎదురుగా తనని తట్టిలేపుతున్న వసుంధర కనిపించింది.

"అబ్బబ్బా! ఒకటే నిద్ర. కళ్ళు తెరచి చూడండి టైమెంతయిందో?" అంటోంది విసుగుతో.

ప్రసాద్ మంచంలో అటు ఇటూ పొర్లుతూ "నాకు తెలుసులేవోయ్! ముందు నీపనికానియ్!" అన్నాడు నిద్రమత్తుతో.

"నాపని ఓ పట్టాన తెగదండీబాబూ! మీకు ఫ్యాక్టరీకి టైమయింది. లేచి కాలకృత్యాలు కానిచ్చి తయారవండి!" అంటూ లోపలకు వెళ్ళింది.

ప్రసాద్ లేచాడు. దుప్పట్లు తీసి మడత పెట్టి టాయ్‌లెట్స్ వైపు కదిలాడు. వసుంధర అటు వైపు తొంగిచూసి, తిరిగి హాలులోకి వచ్చి పిల్లవాడిని కూడా లేపింది.

ప్రసాద్ కాలకృత్యాలు తీర్చుకుని వచ్చి తల దువ్వుకుంటూ నిలబడ్డాడు.

వసుంధర అతని వెనకాలే వచ్చి కాఫీ అందించింది.

"ఎప్పుడూ నీ తొందర మానుకోవు వసూ! ఇంకా పావుగంట టైముంది. ఏదో కొంపలు మునిగిపోతున్నట్లు ఒకటే లేవడం ఏమిటి?"

"అంతేలేండి మరి! మంచం మీద నుండి లేవడం ఆలస్యం ఫ్యాక్టరీకి పరుగుతీయడం! ఫ్యాక్టరీ నుండి రావడం ఆలస్యం మంచం ఎక్కడమే! ఈ మధ్యలో భార్యాపిల్లలనేవాళ్లు ఉన్నారని జ్ఞాపకం రాదు. వారి అచ్చటా ముచ్చటా తీర్చాలన్న ఆలోచనే ఉండదు మరి" అంది బుంగమూతిపెట్టి.

ప్రసాద్ కాఫీ తీసుకుంటూ నవ్వాడు "మరీ అంత సన్యాసిని కాదులేవోయ్! ఇటు గృహ విధి, అటు ఫ్యాక్టరీ విధి కూడా నిర్వర్తించాలి మరి. ఏదో ఒకదాని మీదనే కాలు మోపి కూర్చోవడం సాధ్యం కాదు గదా!"

అతని మాటలు వింటూనే వంటింట్లోకి పరుగుతీసింది వసుంధర.

ప్రసాద్ కాఫీ తాగి వంటింటి వైపు తిరిగి "వసూ! వెళ్తున్నాను" అన్నాడు.

తనపని చేసుకుంటూనే ఆమె ఇటువైపు తలెత్తి చూసి చిరునవ్వు నవ్వి తల పంకించింది.

ప్రసాద్ హాలులోని సైకిల్ బయటకు తీసి బయల్దేరాడు.

ప్రసాద్ సర్జికల్ ఫ్యాక్టరీలో క్లర్కుగా పనిచేస్తున్నాడు. ఆర్థికంగా ఉన్నత స్థానంగాకున్నా ఉద్యోగ రీత్యా తగు స్థానంలోనే ఉన్నాడు. వచ్చే సంపాదన మధ్యతరగతి జీవితావసరాలకు సరిపెట్టుకుంటే సరిపోతుంది. ఫ్యాక్టరీ వారే కాలనీలో ఉచితంగా ఇచ్చే క్వార్టర్సులో కాపురం ఉంటున్నాడు. అందువలన డబ్బు విషయాల్లో కాస్త వెసులుబాటే అనుకోవాలి.

వసుంధర అతనికి తగిన ఇల్లాలు. వచ్చే జీతాన్నీ ఉన్న అవసరాల్నీ సమానంగా ఉండేలా బడ్జెట్ వేసుకుని తక్కువలోనే సంసారాన్ని పట్టాలమీదనుండి జారిపోకుండా లాక్కొస్తున్నది.

వారికి ఒక్కడే కొడుకు. ఐదేళ్ళ వయసున్న ఆ పిల్లవాడిని ఈ సంవత్సరమే కాన్వెంటులో చేర్పించారు. మధ్యతరగతి వారికి ప్రభుత్వ స్కూళ్ళు ఎలాగూ పనికిరావు గనుక, ఇంగ్లీషు మీడియం చదువులమీది మోజుకొద్దీ స్థాయిగలిగిన కాన్వెంటులోనే జీరోక్లాసులో చేర్పించారు.

సున్నాలు చుట్టడం ఎలాగో తెలియకున్నా రెండువేల రూపాయలు డొనేషన్‌గా మరికొంత ఫీజురూపంలో ఖర్చయ్యాయి. ఇవికాక యూనిఫాం, నెలసరి రిక్షా ఖర్చు, ఇతర ఖర్చులు సరేసరి! ఇన్ని ఖర్చులయినా భరించి ఉన్న ఒక్కడినీ ఉన్నతంగా చదివించి, తనలా క్లర్కు జీతగాడిగా కాక ఓ పెద్ద జీతగాడిగానయినా చేయాలన్న ఆశ వారికి ఉంది.

రవి జారిపోతున్న లాగును లాక్కుంటూ వంటింటి గుమ్మంవద్దకు వచ్చి "ఏం చేస్తున్నావే అమ్మా?" అన్నాడు లోపలకు తొంగిచూస్తూ.

వసుంధర రవిని తీసుకెళ్ళి బాత్‌రూంలో విడిచిపెట్టింది. స్నానం చేయించి, టిఫిన్ కాఫీ తినిపించింది. కాన్వెంటు టైంకావడంతో త్వర త్వరగా డ్రస్ చేసి తల దువ్వింది.

బయట సైకిల్ గంట కొట్టడంతో రవి కిటికీ గుండా బయటకు తొంగిచూశాడు. "రిక్షా

వచ్చిందే అమ్మా!'' అన్నాడు సంతోషంగా.

వాడి సంతోషం చూసి ఆమె మురిసిపో యింది. వాడు చదివేది ఏమీలేకున్నా రిక్షా ఎక్కి స్కూలుకు వెళ్ళడానికి మాత్రం హుషారుగా సిద్ధపడతాడు. బుగ్గమీద ముద్దు పెట్టుకుంటూ ''డాక్టరు కావాలాబాబూ!'' అంది.

''అవుతానే అమ్మా! తప్పకుండా అవుతాగా! అప్పుడు రోజూ నీకు ఇంజక్షన్‌లు చేస్తాగా!'' అన్నాడు తలూపుతూ.

''మా నాయనే'' అంటూ మురిసిపోతూ వాడు అప్పుడే డాక్టరు అయిపోయినట్లూ తనకు ఇంజక్షన్‌లు చేస్తున్నట్లూ ఊహించుకుంది.

రవిని ఎత్తుకుని గుమ్మం దగ్గరకు వచ్చింది వసుంధర. ఈలోగా మరో నలుగురు పిల్లలు రిక్షావద్ద చేరారు. ఒకడు రిక్షా సీటుపైకి ఎక్కి గంట వాయిస్తున్నాడు. మిగిలిన పిల్లలు, రావలసిన వారి ఇళ్లవైపు చూస్తూ నిలుచున్నారు. రవిని చూసి ఒకడు హేయ్ రారా అంటూ చెయ్యి ఊపాడు.

రిక్షా అబ్బాయిగుమ్మంవద్దకు వచ్చాడు.

''జాగ్రత్త బాబూ! ఉదయం పూట ట్రాఫిక్ రద్దీగా ఉంటుంది. ఏమరుపాటు లేకుండా నడుపు'' అంది అతడివైపు చూచి.

ప్రతిరోజూ ప్రతి ఒక్కరూ అతడికి చేసే హెచ్చరికే అది! అలవాటుగా చిరునవ్వుతో తల ఊపి, రవి సంచి తీసుకుని వేలు పట్టుకుని రిక్షా దగ్గరకు తీసుకెళ్ళాడు. పిల్లలందర్నీ రిక్షాలో సరిగా కూర్చుండబెట్టుకొని రిక్షాను రోడ్డుమీదకు నడిపించాడు. చెయ్యి ఊపుతున్న కొడుకువైపు చూస్తూ తనూ చెయ్యి ఊపుతూ కనిపించినంతవరకు చూసింది వసుంధర. తరువాత నిట్టూరుస్తూ లోపలకు వెళ్ళింది.

మళ్ళీ పన్నెండు గంటలకు భర్త వస్తాడు. ఆపాటికి భోజనాలు పూర్తికావాలి. వచ్చి భోజనంచేసిన వెంటనే పట్టుమని పది నిమిషాలు కూడా కూర్చోకుండా మళ్ళీ ఫ్యాక్టరీకి ప్రయాణం! తిరిగి సాయంత్రం ఐదుగంటల తర్వాతే తండ్రీ, కొడుకూ ఇంటికిరాక! అంతవరకూ ఆమె ఒంటరిగా కాలం గడపకతప్పదు. ఈ ఒంటరి జీవితంలో ఆమెకుతోడు పుస్తకాలే!

ఆమె స్వతహా కలుపుగోలు మనిషికాదు. గర్వంకాకున్నా ఒకరితో మాట్లాడాలంటే ఏదో బెరుకు, బిడియం! పైగా ఆడవాళ్లు నలుగురూ ఒకచోట పోగయితే వారిమధ్య వచ్చే చర్చలు ఇతరులమీద దుమ్మెత్తిపోయడానికీ, కాలం గడిచిపోవడానికి ఉపయోగపడతాయే గానీ, మరెందుకూ పనికిరావు! ఎదుటలేని వ్యక్తులమీద అభాండాలుమోపి, తాత్కాలిక సంతృప్తితో నిట్టూర్చడం మంచిదికాదని ఆమె నమ్మకం. అందువల్ల కూడా నలుగురితో కలిసి ఉండటం ఆమెకు ఇష్టంలేదు. ఎవరయినావచ్చి పలుకరించినా క్లుప్తంగా, అవసరం ఉన్నంతవరకే మాట్లాడటం ఆమెకు అలవాటయింది.

వంట పూర్తయిన తర్వాత బాత్‌రూంలో స్నానంచేయడానికి వెళ్ళింది వసుంధర.

మధ్యాహ్నం ప్రసాద్ వచ్చిన తరువాత ఇద్దరూ భోజనంచేశారు. అతడు వెళ్ళిన తరువాత తలుపులువేసి పడుకుంది. ఎప్పుడు నిద్రపట్టిందో లేచేసరికి నాలుగుగంటలయింది. లేచి త్వరత్వరగా ముఖం కడుక్కుని వంటింట్లోకి వెళ్ళింది. ఐదుగంటలకు తండ్రీకొడుకులు ఇద్దరూ అలసిపోయి వస్తారు. వచ్చేసరికి ఏదైనా ఫలహారం, కాఫీ తయారుచేసి పెట్టాలి.

ఈరోజు ఎక్కువసేపు నిద్రపోయానను కుంటూ ఫలహారం, కాఫీ తయారుచేసింది త్వరగా. పుస్తకం చేతికి తీసుకుని హాలులోని కిటికీవద్ద కూర్చొని, రోడ్డువెంట వచ్చిపోయే వారిని చూస్తున్నది. కిటికీగుండా చాలాదూరం దారి అటూఇటూ కనిపిస్తున్నది. రిక్షాలు వస్తుంటే అందులో రవిని తెచ్చే రిక్షా వస్తున్నదేమోనని పరికించి చూస్తున్నది.

రేపు రవి పుట్టినరోజు. సినిమాకు వెళ్ళడానికి ముందుగానే టిక్కెట్లు రిజర్వుచేసి ఉంచాడు ప్రసాద్! ఆడంబరాలంటే అతడికి గిట్టవు. రవి పుట్టినరోజు ఆడంబరంగా కాకుండా, క్లుప్తంగా ఇంట్లోవరకే చేసుకోవాలని అతని ఉద్దేశ్యం. ఆడంబరంవల్ల అనవసరమైన ఖర్చేకాకుండా ఏమాత్రం తేడాలు కనుపించినా అక్షింతలు వేయించుకోవాలి. ఇదేం లేకుండా ఆ పండుగ ఏదో ఇంటివరకే పరిమితమైతే

సుఖంగా గడిచిపోతుందనుకున్నారు భార్యాభర్తలిద్దరూ.

సాయంత్రం వస్తూ రవికి, తనకూ కొత్తబట్టలు తెస్తానని చెప్పివెళ్ళాడు ప్రసాద్. ఆ ఇద్దరి కొరకూ ఎదురుచూస్తూ ఏవేవో ఆలోచిస్తున్నది వసుంధర.

ఇంతలో ఆమె ఎదురుచూస్తున్న రిక్షా వచ్చింది. రిక్షాదిగి పిల్లలు బిలబిలమంటూ తమతమ ఇళ్ళలోకి పరుగులు తీశారు. కాని రవి కనిపించలేదు. రిక్షా వెనక్కు త్రిప్పుతున్న డ్రైవర్‌ను కేకవేసింది. ఆమె పిలుపువిని అతడు వచ్చాడు.

"మా రవి ఏడీ?" అంది అతనివైపు చూస్తూ.

"ఇంకా జీరోక్లాసు విడువలేదమ్మా! మిగిలిన పిల్లలకు పరీక్షలని అరగంటముందే విడిచారు. ఈపాటికి అదీ విడిచే ఉంటారు. ఇట్టే వెళ్లి మళ్ళీ తిరిగి వస్తానుగా!" అంటూ అతడు రిక్షా ఎక్కి వెళ్ళిపోయాడు.

ఆత్రుతగా గుమ్మంవద్దనే కూర్చుంది వసుంధర వీధిపొడవునా చూస్తూ!

ఐదున్నర అయింది. రిక్షారాలేదుగానీ వీధిమొగ తిరుగుతూ ప్రసాద్ సైకిల్‌మీద కనిపించాడు. ఒకవేళ ప్రసాద్ సైకిల్‌మీద పిల్లవాడిని తీసుకువస్తాడేమోనని ఎదురుచూస్తున్న వసుంధరకు ఆ సైకిల్‌మీద కూడా రవి కనుపించలేదు.

ఇంటిముందు సైకిల్‌దిగి స్టాండువేస్తున్న ప్రసాద్‌తో– "రవి ఇంకారాలేదండీ!" అంది ఆత్రుతగా.

ప్రసాద్ తలపైకెత్తి ఆమెవైపు చూసి "ఏం?" అన్నాడు.

"ఏమో? రిక్షావాణ్ణి ఒకసారివచ్చి కొందరు పిల్లల్ని విడిచి మళ్ళీవస్తానని వెళ్ళాడు, ఇంతవరకూ రాలేదు."

వేసిన స్టాండుతీసి సైకిల్ వెనుకకు త్రిప్పాడు ప్రసాద్. అంతలోనే రిక్షా వచ్చింది. రిక్షాలోని పిల్లలు క్రిందకుదిగి ఎవరిళ్ళకువాళ్ళు పరుగెత్తారు. అందులోకూడా రవి రాలేదు. ఎదురుచూస్తున్న వారి దగ్గరకు రిక్షా డ్రైవరు వచ్చాడు. "రవిబాబు కనిపించలేదండీ! నేను రెండోసారి రిక్షా తీసుకెళ్ళేసరికి పిల్లలందరూ వరండాలో నిలబడి ఉన్నారు. రవిబాబును ఎవరూ చూడలేదన్నారు. నేను అటూఇటూ కొంతసేపు వెదికాను, ఎక్కడా కనిపించలేదు. టీచర్లందరూ వెళ్ళిపోయారు. ఆయాను అడిగితే తాను కూడా చూడలేదని చెప్పింది. ఒకవేళ మీరు సైకిల్‌మీద ఇంటికి తెచ్చారేమో అనుకున్నాను" అన్నాడు.

ప్రసాద్ ఆందోళనగా అతడి ముఖంవైపు చూశాడు.

"ఐదేళ్ళ పిల్లవాడు ఎక్కడికి వెళ్లాడు? సరిగా చూశావా?" అన్నాడు అసహనంగా.

"చూశానండీ! కనిపించలేదు" అన్నాడు అతను.

ప్రసాద్ సైకిల్ ఎక్కి వేగంగా వెళ్ళాడు. వసుంధర కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వెళ్ళిపోతున్న రిక్షాని కేకేసి "మరోసారి వెళ్ళిచూసి తీసుకురా!" అంది. అతను తల ఊపి వెళ్ళిపోయాడు. ఆ రిక్షావాడు మళ్ళీ స్కూలుప్రాంతం వెళ్ళడనీ తాము చెప్పినా వలకడనీ ఆమెకు తెలుసు. అయినా ఆమె ఆదుర్దా ఆమెది! కారుతున్న కన్నీళ్ళను తుడుచుకుంటూ గడపనానుకుని కూర్చుంది రోడ్డువైపు చూస్తూ.

పక్కవాటాలోనున్న సునీత ఆమె దగ్గరగా వచ్చి వసుంధర వైపుచూస్తూ "పిల్లవాడు రాలేదటకదా, ఏమయింది?" అంది.

"నాకూ వివరాలు తెలియవండీ! రిక్షావాడు రెండుసార్లు వచ్చాడు, రెండుసార్లూ మా రవి రాలేదు. కనిపించలేదని అంటున్నాడు. ప్రతి రోజూ రిక్షా కొరకు ఎదురుచూస్తూ వరండాలోనే ఉండే పిల్లవాడు ఎక్కడికి వెళతాడు?" అంది.

"ఏమో! కాలం అటువంటిది. ఎవరినీ నమ్మలేం! మొన్న తెనాలి దగ్గర ఎవరో సినిమాచూసి వెళ్తుంటే ఒంటరిగా పట్టుకుని ఏదో భవనానికి బలి ఇచ్చారట. వాళ్ళ భవనాలు మూడు పువ్వులూ, ఆరుకాయలుగా నిలబడటానికి ఒక పిల్లవాడి ప్రాణం నిలువునా తీశారు" అంది సునీత.

వసుంధర కళ్ళనుండి జలజల నీళ్ళురాలాయి. ఈలోగా ఆ కాలనీలోని అమ్మలక్కలు అందరూ అక్కడకు వచ్చారు ఈవార్త తెలిసి!

"అంత భయమెందుకూ? ఐదేళ్ళ పిల్లవాణ్ని ఎవరు తీసుకెళ్ళి ఏంచేస్తారులే! పొరపాటున రోడ్డుమీదకు వెళ్ళి తప్పిపోయాడేమో అంది కనకం!"

"వేలు వేలు డబ్బులు లాగినప్పుడున్న తొందర పిల్లల్ని ఇంటికి సక్రమంగా చేర్చాలన్న ధ్యాస ఉండదు స్కూలువారికి. ఏది అడిగినా కనురుకోడమే! విసుగు, కోపాలు! అయినా పిల్లల్ని ఇంటికి చేర్చవలసిన బాధ్యత వారిదే కదా!" అంది ఒకామె.

వీరిమాటలు వినిపిస్తున్నాయేగానీ, వాటిని గురించి ఆలోచించడంలేదు వసుంధర! నోట మాటరాలేదుకానీ, దుఃఖం ఎక్కువయింది. ఒక్కొక్కరు ఒక్కోరకంగా చిలవలుపలవలుగా వర్ణిస్తూ ఉన్నారు. కొందరు నిజంగా జరిగీన విషయాలు చెబుతుంటే మరికొందరు తమ ఊహా ప్రపంచంలోనుండి జరుగవచ్చుననుకున్నవి జరిగినట్లే చెప్పుతున్నారు. ఆ ప్రాంతమంతా సందడిగా తయారయింది. ఇంకా కనిపించని తమపిల్లల కొరకు కొందరు తల్లులు కాలనీఅంతా తిరిగి ఈడ్చుకొని ఇంటికి తెస్తున్నారు. ఎవరికివారే "నమ్మలేం! ఎప్పుడేం జరిగినా జరగవచ్చు" అంటున్నారు.

ఆరున్నర కూడా దాటింది. చీకటిపడి లైట్లు వెలిగాయి. సినిమాలకు వెళ్ళే జనంతో రోడ్డంతా సందడిగా ఉంది.

రవిగానీ, రవికొరకు వెళ్ళిన ప్రసాద్‌గానీ రాలేదు. వసుంధర గుండెవేగం క్షణక్షణానికీ పెరుగుతున్నది. పైగా జనం మాట్లాడే మాటల వల్ల మరింత భీతి కలుగుతోంది. చుట్టూచేరిన వారి సానుభూతి వాక్యాలు ఆమెకు వినిపించినా అవి పట్టించుకోకుండా రోడ్డువైపే చూపునిలిపి చూస్తున్నది. ఇంతమంది పిల్లలు తిరిగివచ్చినా తన కొడుకే తిరిగిరాలేదేమన్న బాధ, ఏమైనా జరగరానిది జరిగిపోయిందేమోనన్న భయం, ఆందోళన ఆమె మనస్సు చుట్టూ చేరాయి.

ఫ్యాక్టరీనుండి ఇళ్ళకు వచ్చిన ఇరుగుపొరుగు మొగవారికీవిషయం తెలిసి అక్కడకు వచ్చారు. పరిస్థితి వసుంధర చెప్పలేకపోవడంతో పక్కవాళ్ళనడిగి తెలుసుకున్నారు. రవిని గుర్తుపట్టగల కొందరు సైకిళ్ళు వేసుకొని బజారుకు వెళ్ళారు. మరికొందరు స్కూలు వైపు వెళ్ళారు ప్రసాద్‌ను కలుసుకుందామని.

ప్రసాద్ స్కూలు వద్దకు వచ్చేసరికి అప్పుడే వాచ్‌మన్ స్కూలు గేటు వేస్తున్నాడు. ఇతనికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"రవి అనే పిల్లవాడు ఇల్లుచేరలేదు" అన్నాడు ప్రసాద్.

"ఏమోనండి? పిల్లలందరూ వెళ్ళారు. హెడ్‌మిస్ట్రెస్‌గారు కూడా ఇప్పుడే వెళ్ళారు" అన్నాడు అతడు.

"హెడ్‌మిస్ట్రెస్‌గారి ఇల్లెక్కడ?"

"ఇక్కడ పనిచేసే టీచర్లకూ, హెడ్‌మిస్ట్రెస్ గారికీ అందరికీ స్కూలు వెనుకవైపునే క్వార్టర్సున్నాయి"

ప్రధానోపాధ్యాయిని ఇంటివద్దకు వెళ్ళాడు. ప్రసాద్‌తో అంతకుముందే పరిచయం ఉండటంవల్ల "రండి" అంటూ ఆహ్వానించింది ఆమె.

"మా పిల్లవాడు ఇంతవరకూ ఇంటికిరాలేదండీ!" అన్నాడు కూర్చుంటూ.

ఆమె ఆశ్చర్యంగా "అదేమిటి?" అంది. తిరిగి "మీ పిల్లవాడికి రిక్షా సర్వీస్ ఉందా? రిక్షావాణ్ణి విచారించారా?"

"మీ స్కూలునుండే రిక్షా సర్వీసు ఉందండీ? మా క్వార్టర్సుకు రెండుసార్లు రిక్షా వచ్చింది. కానీ పిల్లవాడు మాత్రం రాలేదు."

పనిమనిషి చేత ఆయాను పిలిపించిందామె.

"ఏమిటి? రవి అనే అబ్బాయి ఇల్లుచేరలేదట!" అని అడిగింది ఆయా రాగానే.

ఆమె కూడా ఆశ్చర్యంగా నోరు తెరిచింది. "నాకు తెలియదమ్మగారూ!" అంది.

ప్రధానోపాధ్యాయిని అనసూయ ముఖం వివర్ణమైంది. ఆందోళనగా ఆయావైపు చూసి, "ఎలీనా టీచరుగారిని పిలుచుకురా!" అంది ఆదుర్దాగా.

మరో ఐదు నిముషాలలో ఎలీనా వచ్చింది.

"మీ జీరోక్లాస్ రవి ఇంతవరకూ ఇంటికి చేరలేదట! క్లాసులో ఎంతవరకు ఉన్నాడో మీకు జ్ఞాపకం ఉందా?"

"క్లాసులో నాలుగున్నర వరకూ ఉన్నాడండీ! మరో అరగంటలో స్కూలువదిలిపెడతారనగా పాస్‌కనివెళ్ళాడు" అంది ఎలీనా!

"ఆ తర్వాత క్లాసులోనికి రాలేదా?"

"సరిగ్గా జ్ఞాపకంలేదండీ, వచ్చే ఉండవచ్చు"

"అదేమిటి? మీసెక్షన్‌లోని పిల్లవాడు ఉన్నాడా? లేడా? చూసుకునేబాధ్యత మీకు లేదా? పాస్‌కని వెళ్ళినవాడు వచ్చాడో లేదో చూచుకోరా?" అనసూయ గద్దించింది ఎలీనాని.

ఎలీనా తలవంచుకుంది. తప్పుతనదే అనుకొంది. అయినా ఇవన్నీ ఎవరు చూస్తున్నారు గనుక? తాను దొరికింది గనుక ఈమెగారు దబాయిస్తున్నారు. అసలు ఈమెగారు మాత్రం ఖచ్చితంగా స్కూలులో ఉండి ఏడుస్తున్నదా? అనుకుంది. అనసూయ కుర్చీలోంచి లేచింది. "ప్రసాద్‌గారూ! స్కూలులోచూసి వద్దాం పదండి" అంది. ఆమెతోపాటు ఆయాటీచర్ కూడా బయలుదేరారు. వాచ్‌మన్ అప్పుడే తనపూరిపాకలో నర్దుకుంటున్నాడు: వీరిని చూసివచ్చాడు.

"తలుపుతియ్యి"

అనసూయ ఆదేశంతో తలుపు తెరిచాడు. అందరూ స్కూలు ఆవరణలోనికి ప్రవేశించారు. ప్రతి క్లాసు గదినీ, బాత్‌రూంలు, లెట్రిన్స్, ఇతర స్టోర్‌గదులను కూడా తెరిపించి అంతా వెతికారు. ఆఖరికి చెమటలు కారుతున్న ముఖాలతో వరండాలలో నిలబడ్డారు. అందరి ముఖాలు దిగులుగా ఉన్నాయి.

"ఏమైనట్లు? తనలోతనే ప్రశ్నించుకుంది అనసూయ. రిక్షావాడిని పిలిపించి మాట్లాడండి" అన్నాడు ప్రసాద్. వాచ్‌మన్‌ను పంపి రిక్షావాడిని పిలిపించింది.

"రవి అనే కుర్రవాడిని రిక్షాలో ప్రతిరోజూ తీసుకుని వచ్చేది నువ్వేకదా!" అంది అతని వైపు సూటిగా చూస్తూ.

"అవునమ్మగారూ!" అన్నాడు చేతులు కట్టుకుని.

"ఈరోజు సాయంత్రం అతడిని నువ్వుతీసుకెళ్ళలేదా!"

లేదండీ! మొదటిసారి వెళ్ళేటప్పటికి ఇంకా జీరోక్లాను విడవలేదు. రెండవసారి వెళ్ళేటప్పటికి ఆ పిల్లవాడు ఎక్కడా నాకు కనిపించలేదు. అప్పుడప్పుడు ఆ అబ్బాయిని వాళ్ల నాన్న సైకిల్‌మీద తీసుకెళ్తుంటాడు. గనుక ఈ రోజుకూడా తీసుకెళ్ళాడేమోననుకున్నాను. ఇంటి దగ్గర విచారిస్తే రాలేదని తెలిసింది" అన్నాడు.

"మీరు అప్పుడప్పుడూ సైకిల్‌మీద తీసుకెళ్తున్నారా? ఇక్కడ ఎవరికైనా చెప్పి తీసుకెళ్ళేవారా?" అంది ప్రసాద్‌వైపు తిరిగి.

"క్లాసు టీచర్‌గారికి చెప్పే తీసుకెళ్ళేవాడినండీ! అదయినా ఏ నాలుగయిదుసార్లు సినిమాకు వెళ్ళాలనుకున్నప్పుడు అలా వచ్చితీసుకెళ్ళేవాడిని" అన్నాడు ప్రసాద్.

అనసూయ ఎలీనావైపు తిరిగి కళ్ళతోనే అడిగింది. ఎలీనా తలఊపి "ఔను నన్ను అడిగి తీసుకెళ్ళేవారు" అంది.

వీరి విచారణ ఒకవైపు సాగుతుంటే మరోవైపు ప్రసాద్ గుండెలు క్షణక్షణానికీ వేగం అందుకుంటున్నాయి. వారిమాటల వలన చివరకు అర్థమవుతున్నది ఒక్కటే! రవి స్కూలులో లేడు. బయట ఎక్కడికి వెళ్లాడో ఎవరికీ తెలియదు, చూసిన వాళ్ళు ఒక్కరూలేరు.

అతని బాధను చూస్తున్న ప్రధానోపాధ్యాయిని "భయపడకండి ప్రసాద్‌గారూ! పోలీసు రిపోర్టు ఇవ్వండి. బహుశ ఇతర పిల్లలవెంట ఏటైనా వెళ్ళాడేమో చూద్దాం" అంది అనునయిస్తున్న ధోరణిలో!

"అంత చిన్నపిల్లవాడు ఎప్పుడూ ఎవరివెంటా వెళ్ళనివాడు, ఈ రోజుమాత్రం ఎందుకు వెళ్తాడండీ! ఇదంతా చూస్తుంటే నాకు భయమేస్తున్నది. ఎంతో క్రమశిక్షణ గల స్కూలు అన్న ఉద్దేశంతో పిల్లవాడిని చేర్చాను. మీ స్కూలు రిక్షాయే ఏర్పాటుచేశాను. ఏంలాభం? మాపిల్లవాడికి ఏదో అయింది వాళ్లను జాగ్రత్తగా చూసేబాధ్యత మీకులేదా?" అన్నాడు ఆవేశంగా!

అతని బాధ ఆమెకు తెలుసు. ఆ పరిస్థితిలో కూడా అతడు హద్దుమీరకుండా సంస్కారవంతంగా బాధను దిగమ్రింగుకుంటూ మాట్లాడుతున్నాడు. లేకుంటే బజారులో నిలబడి పదిమందిని పిలిచి అల్లరిలేపితే తమ స్కూలులో ఇకముందు పిల్లల్ని చేర్చడమటుంచి ఉన్నపిల్లల్ని కూడా మాన్పిస్తారు. తమ బాధ్యత ఎక్కడోతప్పిపోయింది. లేనిపక్షంలో పిల్లవాడు స్కూలులో అడుగుపెట్టినప్పటి నుండి తిరిగి ఇంటికి చేరేవరకూ బాధ్యత తమదే.

ప్రసాద్ పోలీసు స్టేషన్‌కు వెళ్లేటప్పటికి ఏడుగంటలయింది. పోలీసులు చాలామంది ఉన్నారు కాని ఆఫీసర్లు ఎవరూలేరు. రైటర్ రాసుకుంటూ కూర్చున్నాడు. ఇతన్ని చూసి తలెత్తాడు ఏమిటన్నట్లు.



నిలబడి వివరాలు చెప్పాడు. "అయితే స్కూలు మేనేజ్‌మెంట్‌ను విచారించాల్సిందండీ! వారిద్వారా అయితే సులభంగా తెలుస్తుంది" అన్నాడు. అంతవరకూ ఓపికగా విన్న రైటర్ ఇకవినలేనని చెప్తున్నట్లు.

"అంతాఅయింది. ఇక అక్కడ సాధ్యం కాదని తెలిసే ఇక్కడకు వచ్చానండీ!" అన్నా

డు ప్రసాద్.

రైటర్ వినుకున్నాడు. తీసి ఉన్నటేబుల్ సొరుగు దఢాలున లోపలకు త్రోసి, ఆవులించి మెటికలు విరిచి, చేతులు వెనక్కివిరుస్తూ "ఒక పనిచేయండి పిల్లవాడు తప్పిపోయిన ట్లు, దొరికితే అప్పగించమని మైక్‌లో టౌనంతా ప్రచారం చేయించండి. ఎవరికయినా దొరికితే వెంటనే తెచ్చి అప్పగిస్తారు."

ప్రసాద్ అనహనంగా అతడివైపు చూశాడు. ఏనుగు చస్తుంటే నక్క లొట్టలు వేస్తున్నట్లుంది వీరికథ! వెతికి పెట్టమని వారికి రిపోర్టు ఇవ్వ డానికి వస్తే, మీరే వెతుక్కోమనే ధోరణిలో ఉన్నాడాయన. ఇంతమాత్రానికి ఈ పోలీసు లు, స్టేషన్‌లు ఎందుకూ? అనుకున్నాడు.

"రిపోర్టు రాసిస్తాను. దయచేసి మీ ప్రయ త్నం మీరుచేయండి. మా ప్రయత్నాలన్నీ మేము చేస్తూనే ఉంటాము" అన్నాడు ప్రాధే యపడుతూ.

కాగితం తీసి ముందుపడేశాడు రైటర్ నకి లిస్తూ. రాసిచ్చాడు ప్రసాద్.

"రాసిచ్చావుగా ... ఇక వెళ్ళు" అన్నాడు కొరకొరచూస్తూ.

"తొందరగా ప్రయత్నం చేయాలి సార్! అసలే చిన్నపిల్లవాడు. బెంబేలెత్తిపోతాడు. వాడి తల్లి కూడా ఇంటివద్ద ఏడుస్తూ కూర్చొని ఉంది"

"నిజమేనయ్యా! మా ఏడుపూ అదేమరి! అయితేమాత్రం మీ ఒక్క కేసే కాదుగదా! ఈరోజు ఉదయం నుండి ఒక హత్య కేసు, రెండు దోపిడీ కేసులు, మూడు పిక్‌పాకెట్ కేసులు, నాలుగు తన్నుకున్న కేసులు, ఇంకా చిన్నాచితకా ఇరవై రిపోర్టులు. ఇన్నిచోట్లకు తిరగడానికి మేమేం దేవదూతలం కాదుగదా! పది చేతులూ, ఇరవై కాళ్ళు లేవుగదా. అయినా అన్ని కేసులూ చూస్తాం. మీ కేసు గురించీ వెతుకుతాం"

ఆ ఉపన్యాసం వినేటప్పటికి ప్రసాద్ గుండె లు మరింత జారాయి. ఇతడి పద్ధతిచూస్తే మరో నెలరోజుల తర్వాత నింపాదిగా కేసుపై చర్య తీసుకుంటామన్నట్లుంది. అయినా వారితో గట్టిగా మాట్లాడితే మరింతగా రెచ్చిపో తారు. లేదా తననే బొక్కలో తోసి కేసు పెట్టగల రని అతనికి తెలుసు.

బయటకు వచ్చాడు. బయట నిలబడి చుట్ట పీలుస్తున్న సెంట్రీ కానిస్టేబుల్ ఇతన్ని చూసి "ఏమిటండీ కేసు?" అన్నాడు దగ్గరగా వచ్చి.

ప్రసాద్ వివరంగా చెప్పాడు. "రైటర్‌గారికి దక్షిణ సమర్పించారా?" అన్నాడు నవ్వి.

ప్రసాద్ తల ఊపాడు లేదన్నట్లు.

"ముడుపు సమర్పించకుంటే ఆయన పల కడండీ! అది ముందు పడేయండి. మీ కేసు వెంటనే కదుల్తుంది"

"పిల్లవాడు దొరుకుతాడంటారా?"

"దొరికేదీ లేనిదీ ముందు ఫైలు కదిలితే కదా! ఆ ఫైల్ కదలాలంటే దక్షిణ కావాలి. ఆతర్వాత మీ అదృష్టం"

జేబులో చెయ్యిపెట్టితీసి చూశాడు. "ఇరవై రూపాయలున్నాయి. ఎంత తీసుకుంటా డంటారు? ఎక్కువ అయితే ఇంటికి వెళ్ళిరా వాలి"

"ఉన్నది ఇవ్వండి, ఎంతయినా తీసు కుంటాడు"

తిరిగి లోపలకు వెళ్ళాడు ప్రసాద్. ఈ దక్షిణ రైటర్ ఒక్కడికే కాదు అప్పుడు డ్యూ టీలో ఉన్న పోలీసులందరికీ వాటాలుంటాయి. అందువల్లనే వచ్చినవారిని ఊదరకొట్టీ, బెది రించీ దక్షిణ సమర్పించేలా చేస్తారు.

ఇరవై రూపాయలు రైటర్ టేబుల్‌మీద పెట్టాడు మాట్లాడకుండా. రైటర్ కూడా మాట్లా డకుండానే ప్యాంటు జేబులోకి పోనిచ్చాడు ఆ డబ్బు. ఆతర్వాత ప్రశాంతంగా తలెత్తి చూసి, "వెంటనే కానిస్టేబుళ్లను పంపి విచారిస్తాను. మీరేం భయపడకండి, తక్షణ చర్యలు తీసు కుంటాం" అన్నాడు అభయమిస్తూ.

సైకిలెక్కి ఇంటికి వచ్చేసరికి గడపవాను కునే కూర్చుంది వసుంధర. కొందరు జనం ఇంకా అక్కడే ఉన్నారు. హడావిడిగా అతడివ ద్దకు వచ్చి "ఏమయిందండీ ... బాబు ఏడీ?" అంది వసుంధర ఏడుస్తూ.

జనం అందరూ అతన్ని చుట్టుముట్టారు. అంతవరకూ జరిగింది అందరికీ చెప్పాడు

ప్రసాద్. అంతా విని ఆశ్చర్యపడ్డారు జనం.

"మేము కూడా సైకిళ్ళమీద బజార్లన్నీ తిరిగి వచ్చాం ప్రసాద్‌గారూ. ఎక్కడా కనిపించ లేదు" అన్నాడు ఒక ఉద్యోగి.

"మీ కొరకు స్కూలు దగ్గరికి వచ్చాం. మీరు కనిపించలేదు. వెనక్కి వచ్చాం" అన్నారు మరికొందరు.

"అంత చిన్న పిల్లవాడు ఎక్కడికి వెళ్తాడు?" అన్నారు కొందరు.

"ప్రతిరోజూ రిక్షా గ్రౌండ్‌లోనికి వస్తూనే రిక్షా దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చేవాడట. ఒక్క రోజు కూడా ఆలస్యం చేయడంగానీ, ఎవరితోనైనా మాట్లాడుతూ స్కూలు బయటకు వెళ్ళిపోవడంగానీ చేయలేదట అటువంటివాడు ఏమవుతాడు?" అన్నాడు ప్రసాద్ ముక్కుచీదుకుంటూ తనలో తానే.

అప్పుడే అక్కడకు వచ్చాడు సహోద్యోగి నాగరాజు. "అంతా విన్నాను ప్రసాద్! ఇదేదో కుట్రగా ఉంది" అన్నాడు తల ఊపుతూ. "లేకుంటే ఐదు సంవత్సరాల పిల్లాడిని ఎవరు తీసుకుని వెళ్తారు; తీసుకెళ్ళి ఏం చేస్తారు?"

ఎవరికి తోచినరీతిలో వాళ్ళు మళ్ళీ మాట్లాడుకోవటం మొదలుపెట్టారు. వసుంధర లోపల మంచంలో పడుకొని వెక్కివెక్కి ఏడుస్తున్నది. ఆమెను ఓదారుస్తూ కొందరు అక్కడ చేరారు.

"బ్రదర్ ప్రసాద్... పోలీసులవల్ల ఏమీకాదు. రేపు వాళ్ల పైఅధికారి స్టేషన్‌కు వచ్చేదాకా మనం ఎంత డబ్బిచ్చినా వాళ్ళు స్టేషన్‌నుండి కదలరు. ఇన్‌స్పెక్టరు నాకు తెలుసు. వెళ్ళి కలిసి మాట్లాడదాంపద. ఆయన కదిల్తే అందరినీ పరుగెపెట్టి విచారిస్తారు" అన్నాడు నాగరాజు.

అలాగయితే మంచిదని అందరూ బలపరచారు. ప్రసాద్, నాగరాజు సైకిళ్లెక్కారు. వసుంధరకు తోడుగా నాగరాజు భార్య, కూతురూ ఉంటామన్నారు.

ఇద్దరూ పోలీసు క్వార్టర్స్ చేరేసరికి ఇన్‌స్పెక్టర్ భోజనం చేస్తున్నాడని బయటఉన్న కానిస్టేబుల్ చెప్పాడు. అతడు భోజనంచేసి బయటకు వచ్చేవరకూ వరండాలో ఓపికగా ఎదురు చూశారు. ఆయన వస్తూనే లేచి నమస్కారం చేశారు.

"ఏమిటండీ నాగరాజుగారూ! ఇప్పుడు బయల్దేరారేమిటి?" అన్నాడు ముందుకొచ్చిన పొట్టతో నిటారుగా నిలబడి.

జరిగిందంతా నాగరాజు వివరించి చెప్పాడు. "ఆయన భార్య విలపిస్తున్నది సార్! పెద్దపిల్లవాడయితే ఎక్కడయినా స్నేహితులతో గడుపుతాడని ఆలోచించవచ్చు. చంటిపిల్లవాడు; భయంతో ఎక్కడయినా పడిపోయాడో లేక ఎవరయినా తీసుకెళ్ళారో తెలియక దిగులుతో ఆమె మంచమెక్కింది"

ఇన్‌స్పెక్టర్ పూర్తిగా విని ఊపిరి బరువుగా పీల్చి వదిలాడు. "సరే ... స్టేషన్‌కు పదండి, నేను వస్తాను" అంటూ లోపలకు వెళ్ళాడు. ఇద్దరూ సైకిళ్లమీద స్టేషన్‌కు వచ్చేసరికి మోటార్ సైకిల్ మీద ఇన్‌స్పెక్టర్ వచ్చాడు.

యస్.ఐని చూసి పోలీసులు నిలబడి శాల్యూట్ చేశారు. అంతా సర్దుకుని ఇంటికి వెళ్ళడానికి సిద్ధపడ్డ రైటర్ కూడా విసుగ్గా శాల్యూట్ చేశాడు. ఈ సమయంలో అధికారి స్టేషన్‌కు వస్తే ఇక ఎవరికీ ఇంటికి పోవడానికీ, నిద్రపోవడానికీ అవకాశముండదని వారికి తెలుసు. లోలోపల తిట్టుకుంటూ నిలబడ్డారు.

గదిలోకి వెళ్ళి రైటర్‌ను కేకేశాడు ఇన్‌స్పెక్టరు. వస్తూనే రిపోర్టు కాగితం పట్రమ్మన్నాడు. రిపోర్టంతా పరికించి చూసి రిక్షావాణ్ణి, గేటు ప్యూనును, ఆయాను, టీచర్‌ను తక్షణం పిలిపించమన్నాడు.

పోలీసులు సైకిళ్లెక్కి మోపెడ్లలాగా నడుపుతూ పావుగంటలో వారిని తీసుకొచ్చారు.

రిక్షావాణ్ణి యస్.ఐ ముందు హాజరుపరచారు. ఎదురుగా నిలబడ్డ అతడిని కింది నుండి పైదాకా, ఎముకలతోసహా లెక్కవేస్తూ పరీక్షగా చూశాడు ఆఫీసరు. పాత కేడీలిస్టులో తగలకపోతాడా, తిరిగి లోపలకు తోయకపోతానా అనుకుంటూ, అటువంటి అవకాశం ఏమీ కన్పించకపోవడంతో "ఏ వూర్రా నీది?" అంటూ గర్జించాడు.

రిక్షావాడు భయపడ్డాడు. పోలీసుస్టేషన్‌కు వస్తే బాదివేస్తారని అతను విన్నాడు, ఇక్కడికి

ఎందుకు వచ్చాన్రా భగవంతుడా అనుకుంటూ "సార్! మాది దగ్గరలోని పల్లె సార్! బతుకుదామని ఇక్కడికి వచ్చాను" అన్నాడు.

"మిగతావాళ్లు చావడానికి ఇక్కడికి వచ్చారనుకున్నావ్రా? రిక్షా నీ స్వంతమేనా?" మరోసారి గర్జించాడు.

"స్కూలువాళ్ళది సార్! నెల జీతంమీద అక్కడ పనిచేస్తున్నాను"

"నెలకు ఎంత ఇస్తారు?"

"మూడువందలు ఇస్తారు సార్!"

తల పంకించాడు. "సరే ... రవి అనే అబ్బాయిని ఈరోజు ఇంటికి చేర్చలేదట, ఏమిటీ?"

"ఒకసారి ట్రిప్పులో క్లాసు నడుస్తుండటం మూలంగా ఎక్కలేదు సార్! రెండో ట్రిప్పుకు వెళ్ళేటప్పటికి ఆ అబ్బాయి స్కూలులో లేడు సార్! అంతా వెతికాను, ఎక్కడా కనిపించలేదు" అన్నాడు వణుకుతూ.

"పిల్లవాడు కనిపించకపోతే విచారించేది లేదా?"

"ఒక్కోసారి తల్లిదండ్రులు వచ్చి పిల్లల్ని తీసుకెళ్తారుసార్! అందువల్ల వెళ్ళిపోయాడనుకున్నాను".

"ఆ విషయం స్కూలులో కనుక్కున్నావా?"

"లేదు సార్!"

గేటు కీపర్‌ను లోపలకు పిలిచాడు. "ఎవరెవరు వెళ్ళారో, లేదో తెలుసుకోవలసిన పని నీకు లేదా?" అన్నాడు పరికించి చూస్తూ.

"నాకు ఆ బాధ్యత లేదుసార్! అందరూ వెళ్ళిన తరువాత గదులన్నీ వెతికి ఎవరూ లేరని నిర్ణయించుకున్న తరువాత తాళాలు వేసుకోవడం నా బాధ్యతసార్"

ఆయాను పిలిపించాడు.

"ఆ క్లాస్ బాధ్యత నీదేనా?"

"నాదే బాబుగారూ! పిల్లవాడు స్కూలు విడిచేవరకూ ఉన్నాడు. ఆతర్వాత టీచరుగారు వెళ్ళిపోవడంతో పుస్తకాలు సర్దడానికి లోనికి వెళ్ళాను. తిరిగి బయటకు వచ్చేసరికి కనిపించలేదు. వెళ్ళిపోయాడనుకున్నాను"

టీచర్‌ను పిలిపించాడు.

"పిల్లవాడు ఎంతవరకు క్లాసులో ఉన్నాడు?" అన్నాడు.

ప్రధానోపాధ్యాయురాలికి చెప్పినట్లే తొణక్కుండా చెప్పింది.

ఇన్‌స్పెక్టర్ లేచి రైటర్‌ను కేకేశాడు. వసారాలో కబుర్లలో పడ్డ రైటర్ ఆదరాబాదరాగా టోపీ తలమీద సర్దుకుని "సార్" అంటూ వచ్చి నిలిచాడు.

"మనవాళ్ళందర్నీ స్కూలు దగ్గరకు బయలుదేరమను. నువ్వు కూడా రా" అంటూ టోపీ తలకు తగిలించాడు. పిల్లవాడిని మాయంచేయడానికి వీళ్లందరికీ, లేదా వీరిలో ఏ ఒక్కరికయినా అవకాశం ఉంటుందని యస్.ఐ ఆలోచిస్తున్నాడు. వారిని కూడా అక్కడకు రమ్మని ఆజ్ఞాపించాడు. వారితోపాటు ప్రసాద్, నాగరాజు కూడా వెళ్ళారు.

స్కూలు దగ్గరకు ఎనిమిదిమంది పోలీసులు, యస్.ఐ వచ్చేసరికి చుట్టుపట్ల జనం ఒక్కొక్కరే రోడ్డుమీద గుమిగూడుతున్నారు ఏం జరిగిందోనని. అప్పుడే మొదటి ఆట సినిమా వదిలిపెట్టడంతో రోడ్డు వెంట వెళ్ళేవారిలో చాలామంది అక్కడ నిలబడటంతో జనసందోహం పెరిగిపోసాగింది. ప్రధానోపాధ్యాయిని పరుగెత్తుకుంటూ వచ్చింది.

లోపల గదులు, పెట్టెలు, బీరువాలు చెత్త కుప్పలతోసహా సర్వం కెలికి, తిప్పిచూశాడు యస్.ఐ. డాబాపైన వాటర్ టాంక్ వద్దకు వెళ్ళి నీళ్ళు తిప్పిచూశాడు. అంతదూరం వెళ్లడని అనుమానం ఉన్నా ఏదీ విడిచిపెట్టకూడదన్న పోలీసుతత్వంతో వెతికాడు.

అనుమానించదగ్గది ఏదీ కనిపించలేదు. బయట నిలబడ్డ పోలీసుల్ని జనం అడుగుతున్నారు ఏమిటంటూ? వాళ్ళు చెప్పకుండా వినుక్కుంటున్నారు. వినుక్కుంటున్నవారిని చూసి జనం కూడా వినుక్కుంటూ తిట్టుకుంటున్నారు.

క్రమక్రమంగా రోడ్డంతా జనంతో నిండిపోయింది. పిల్లవాడు ఒకడు స్కూలులో తప్పిపోయాడని తెలియడంతో జనంలో గుసగుసలు ఆరంభమయ్యాయి. పిల్లవాడిని సక్రమంగా ఇల్లు చేర్చనందుకు, మిగిలిన పేరెంట్స్ తమ

విద్యాలయాన్ని బాయ్‌కాట్ చేస్తారేమోనని ప్రధానోపాధ్యాయిని కలవరపడుతున్నది. తమ నెత్తికి ఎక్కడ చుట్టుకుంటుందోనని పనిమనుషులు భయపడుతున్నారు.

గేట్ కీపర్ కొడుకు అప్పుడే సినిమాకు వెళ్ళివచ్చాడు. ఆ వాతావరణాన్ని చూసి లోపలకు వెళ్ళి తల్లిని అడిగాడు ఏమిటని. ఆమె క్లుప్తంగా చెప్పడంతో ఆశ్చర్యగా విని "ఆ పిల్లవాడు కారులో వెళ్ళడం నేను చూశానే!" అన్నాడు, అలా అంటూనే వాడు వెంటనే తండ్రి దగ్గరకు పరుగెత్తి ఆ విషయం చెప్పాడు.

గేట్‌కీపర్ వాడి నోరు మూయించేలోగానే ఎవరో ఆ మాట వినడంతో అందరికీ తెలిసిపోయింది. ఇన్‌స్పెక్టరు వాడిని తీసుకురమ్మన్నాడు. వరండాలో కూర్చున్న యస్.ఐ వద్దకు చొక్కాపట్టి తీసుకువచ్చాడు కానిస్టేబుల్.

"సాయంత్రం ఆ పిల్లవాడు ఎక్కడున్నాడో చూశావా?" అన్నాడు అనునయంగా.

"చూశానుసార్ ... ఐదుగంటలలకు ముందే క్లాసులోంచి ఆవరణలోకి వచ్చాడు. అక్కడి నుండి గేటు దగ్గరకు వచ్చాడు. బయట కారుంది. కారు తలుపువద్ద నిలబడ్డ మనిషి ఆ పిల్లవాడిని పేరుపెట్టి కేకేశాడు. పిల్లవాడు పరుగెత్తాడు. అతను తలుపు తీసి లోపలకు ఎక్కించాడు కుర్రాడిని. అతడు కూడా ఎక్కిన తరువాత కారు వెళ్ళిపోయింది" అన్నాడు గుక్క తిప్పుకోకుండా.

పదేళ్ళ పిల్లవాడు అబద్ధం చెబుతున్నాడని భావించలేదు ఇన్‌స్పెక్టర్.

"కారులో ఎందరున్నారో చూశావా?"

"బయట నిలబడ్డవ్యక్తిగాక ఆ కారులో డ్రైవర్ మాత్రమే ఉన్నాడుసార్"

"కారు ఏ రంగుదీ?"

"తెలుపు రంగుది"

"కారు నంబరు చూశావా?"

"చూడలేదు ... నాకా అలవాటు లేదు సార్"

"వాళ్ళను చూస్తే గుర్తుపట్టగలవా?"

"బయట నిలబడ్డవ్యక్తిని గుర్తుపట్టగలను సార్!"

ఊపిరిపీల్చి వదిలాడు యస్.ఐ.

"ఇదేదో పన్నాగంలా ఉంది నాగరాజుగారూ ... తల్లిదండ్రులకు తెలియకుండా కారులో వచ్చి తీసుకెళ్ళే బంధువులు ఎవరు? మీ బంధువుల్లో ఎవరికైనా కారుందా ప్రసాద్‌గారూ!" అన్నాడు తల తడుముకుంటూ.

"ఎవరూ లేరుసార్!" అన్నాడు ప్రసాద్. అతడి నాలుక తడి ఆరిపోతున్నది.

నాగరాజు కూడా ఔనంటూ తల ఊపాడు. పోలీసులు సైకిళ్ళెక్కి రోడ్డువెంట సాగుతూనే జనం ఎవరి తోవన వాళ్ళు వెళ్లసాగారు. తమ మీదకు రాకుండా తప్పిపోయినందుకు స్కూలు సిబ్బంది సంతసించారు. లోపలకు వచ్చిన గేట్‌కీపర్ నారాయణ కొడుకువైపు గుర్రుగా చూసి "నీకెందుకురా పిచ్చివెధవా! రేపు పోలీసుస్టేషన్‌లు, కోర్టుల చుట్టూ మనల్ని గాడిదల్లా తిప్పుతారు" అన్నాడు తుపుక్కున ఉమ్మేస్తూ.

కొడుకు మాట్లాడలేదు. ఇంకేమైనా నోరెత్తి మాట్లాడితే తండ్రి తన్నుతాడని అనుభవమే. అయినా చూసింది చెప్పాలనుకున్నాడు, చెప్పాడు. "అందులో తండ్రి తనను కోపగించుకోవలసిన అవసరమేముంది" అనుకున్నాడు.

గేటుకీపర్ నారాయణ బయటకు వచ్చి మళ్ళీ ఒకసారి గేటు తాళంసరిచూసుకుని, లోపలకు వెళ్ళి పడుకున్నాడు ఆలోచిస్తూ.



ఉదయం ఏడుగంటల ప్రాంతంలో తలుపుతట్టుతుంటే లేచి తలుపు తీశాడు ప్రసాద్. ఎదురుగా కానిస్టేబుల్ కనిపించాడు. "లోప

లకు రండి'' అన్నాడు పక్కకు తొలుగుతూ.

"మిమ్మల్ని అర్జంటుగా స్టేషన్‌కు రమ్మన్నారు అయ్యగారు'' అన్నాడు కానిస్టేబుల్.

"ముఖం కడుక్కొని వస్తాను, కూర్చోండి'' అంటూ కుర్చీవేశాడు. కానిస్టేబుల్ కూర్చుంటూ "మీతోపాటు మీ భార్యను కూడా తీసుకురమ్మన్నారు'' అన్నాడు.

ప్రసాద్ తల ఊపి లోపలకు వెళ్ళాడు. పడకగదిలో ఉన్న వసుంధర అతనివైపు ప్రశ్నార్థకంగా చూసింది. "కానిస్టేబుల్ వచ్చాడు, యస్.ఐ గారు మన ఇద్దరినీ స్టేషన్‌కు రమ్మన్నారట. లే ... ముఖం కడుక్కో''

ఆమె లేచింది. రాత్రంతా నిద్రలేకపోవడం, తిండిలేకపోవడం, ఏడ్పులు, ఓదార్పులతో కాలం గడపడంవల్ల కళ్ళు ఎర్రబడి నీరసంగా ఉంది శరీరం. తల దువ్వుకుని చీర మార్చుకుని పళ్లు తోముకుని తయారయింది. స్నానం చేయాలన్న ఆలోచనగానీ, ఉద్దేశంగానీ ఆమెకు లేదు. బయటకు వెళ్ళేటప్పుడు ఎంతో అలంకరించుకునిగానీ వెళ్ళని ఆమె, దిగాలుపడిన ముఖంతో సరిగా తల దువ్వుకోకుండానే బయలుదేరింది. యస్.ఐ ఎందుకు పిలుస్తున్నాడో? ఏమైనా ఆచూకీ తెలిసిందేమో లేక అబ్బాయినే పట్టుకుని తెచ్చారేమో అన్న ఆశ, కుతూహలం, అనుమానాలు ఆమెకు వచ్చాయి. దేనికీ జవాబివ్వడం లేదు కానిస్టేబుల్. "అయ్యగారు రమ్మన్నారు; ఎందుకో నాకు తెలియదు'' అని మాత్రమే చెబుతున్నాడు.

ఇద్దరూ బయటకు వచ్చారు. ప్రసాద్ తలుపు తాళం వేశాడు.

ఎదురింట్లో ఉన్న నాగరాజు అప్పుడే లేచి బయటకు వచ్చి కానిస్టేబుల్‌తోపాటు ప్రయాణమయినవారిని చూసి "ఎక్కడకి ప్రసాద్?'' అన్నాడు.

యస్.ఐ రమ్మన్న సంగతి చెప్పాడు ప్రసాద్.

"అయితే నేనూ వస్తాను ఉండు'' అంటూ లోపలకు వెళ్ళి చొక్కా తొడుక్కుని, ప్యాంటు మార్చుకుని, చన్నీళ్ళతో ముఖం తుడుచుకుని బయటకు వచ్చాడు.

అందరూ రిక్షాల్లో స్టేషన్ చేరేసరికి ఇన్‌స్పెక్టరు ప్రయాణ సన్నాహంలో ఉన్నాడు. వీరిని చూసి వ్యాను దగ్గరకు వచ్చాడు. పదిమంది పోలీసులు తుపాకులు వీపుకు తగిలించుకునీ, లాఠీలు చేతపట్టుకునీ వ్యాను ఎక్కారు. అంత మందిని ఒక్కసారిగా తుపాకులతోసహా చూసిన వసుంధర గుండె జల్లుమంది. "వీళ్ళందరూ కలిసి తమను ఎక్కడకు తీసుకువెడతారు? రవి మాయంకావడానికీ వీరి పటాటోపానికీ సంబంధం ఏమిటి?'' అనుకుంది. ప్రసాద్, నాగరాజులు కూడా ఏదో జరగకూడనిదే జరిగిందని అనుకున్నారు. లేకుంటే అంత పోలీసు బందోబస్తుతో ప్రయాణం కావలసిన అవసరమేమిటి?

ఏమి జరిగిందో వారికి ఎవరూ చెప్పడంలేదు.

నాగరాజు ఇన్‌స్పెక్టరు దగ్గరకు వచ్చి "ఇదంతా ఏమిటిసార్'' అన్నాడు ఆదుర్దాగా. యస్.ఐ నాగరాజు వైపు కిందకూ మీదకూ చూశాడు.

"సారీ మిస్టర్ నాగరాజూ! మేము ఊహించింది కరెక్టే అయితే చాలా ఘోరమే జరిగిపోయింది. కానీపిల్లవాణ్ణి ఇంకా గుర్తించలేదెవరూ? ప్రసాద్ గుర్తుపట్టగలడేమోనని తీసుకెళ్ళుతున్నాం. మిగిలిన వివరాలు అక్కడే తెలుస్తాయి.''

ప్రసాద్ కళ్ళవెంట నీళ్ళు కారాయి.

"ఊరుకో ప్రసాద్! ఏమిటోచూద్దాం! మనకు మంచి జరుగుతుందనే ఆశిద్దాం'' అన్నాడు నాగరాజు భుజంమీద చెయ్యివేసి.

పోలీసు వ్యాను టౌను విడిచి ఎనిమిది కిలోమీటర్ల దూరంలోనున్న పొట్టిపాడు చేరింది. ఆ గ్రామం చాలా చిన్నది. రెండువందల ఇళ్ళు కూడా లేవు. అంతా పేద, మధ్యతరగతి వర్గాలు, గ్రామానికి పడమటివైపు పెద్ద చెరువు, చెరువుకు ఆనుకుని దక్షిణంవైపు చిన్న గుడి, దగ్గరలోనే మరో విశాలమైన సత్రం ఉంది. చెరువునిండా నీళ్ళున్నాయి.

వ్యాను గుడివద్దకు వచ్చేసరికి జనం చాలా మంది అక్కడ గుమికూడి ఉన్నారు. అందరి ముఖాలు విచారంగా ఉన్నాయి. వ్యాను దిగిన యస్.ఐ దగ్గరకు వడివడిగా వచ్చాడు ఓ గ్రామస్తుడు. "మీకొరకే ఎదురుచూస్తున్నాం

సార్'' అన్నాడు ఆదుర్దాగా.

''లోపలకు ఎవరినీ పోనివ్వలేదు కదా!''

''లేదు సార్ ... ఆ ప్రాంతంలోనికి ఎవరినీ పోనివ్వకుండా దూరంగా నిలిపాము. అయినా జనం తొందరపడుతున్నారు. కొందరు పెద్దలు ఆ దారుణాన్నిచూసి వణికిపోతున్నారు'' అన్నాడు ముందుకు నడుస్తూ.

పోలీసులు వ్యానుదిగి జనాన్ని దూరంగా చెదరగొట్టారు. భయపడిన జనం ఒకరినొకరు నెట్టుకుంటూ దూరంగా వెళ్ళి నిలబడ్డారు.

ఇన్‌స్పెక్టరుతోపాటు నాగరాజు, ప్రసాద్, వసుంధర ముందుకు నడిచారు. అక్కడి జనాన్నిచూసి ఏదో జరిగిందని మనస్సులో అనుకుంటూనే అందరూ ముందుకు నడిచారు. వసుంధర వణుకుతూ తడబడుతూ నడిచింది.

గుడిముందు ప్రహరీగేటు బయట పెద్దగా ముగ్గువేయబడిఉంది. నీరు చిక్కగా చల్లడంవల్ల ఇంకా తడి ఆరలేదు. గ్రామస్తుడు ముందుకు నడిచాడు. ప్రహరీగేటు తెరచి లోపలకు అడుగుపెట్టి ఒకపక్కకు ఒదిగి నిలబడ్డాడు. అతనే గ్రామ పెద్ద కూడా.

అతడివెంట లోపలకు వెళ్ళిన మొదటివ్యక్తి యస్.ఐ. షాక్‌తిన్నట్లు గేటుదగ్గరకు వెనక్కు రెండడుగులు వేశాడు. అతడి గుండె అతివేగంగా కొట్టుకోవడం ఆరంభించింది. గేటులో నిలబడి, అతడి వెనుకనుండి లోపలకు తొంగి చూసిన నాగరాజు, ప్రసాదులకు చలి వణకు ఆరంభమయింది. భయంతో పండ్లు కరచుకున్నాయి. వసుంధర గేటు బయటేఉన్న కారణాన లోపలకు చూపందలేదు. కాని ఆ ముగ్గురి ముఖాలలో కన్పిస్తున్న భీతిచూసి ఆమె కూడా భయంతో వణకుతున్నది.

ఇన్‌స్పెక్టరు తేరుకొని నాగరాజుతో ''మీరందరూ బయటకు వెళ్ళండి, తర్వాత పిలిపిస్తాను'' అన్నాడు.

నాగరాజు తలవంచుకుని ప్రసాద్‌నూ, వసుంధరను బయటకు తీసుకొనివచ్చి నిలబడ్డాడు. అయినా అతడి కాళ్ళు వణకుతున్నాయి. వసుంధర చీరకొంగు నోటిలో పెట్టుకుని ఏడ్పు ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నది.

యస్.ఐ. హెడ్‌కానిస్టేబుల్ని కేకేశాడు. అతనితోపాటు నాగరాజు కూడా లోపలకు వెళదామనుకున్నాడుకాని, కాళ్ళవణుకు తగ్గలేదు.

ప్రహరీమధ్యలో గర్భగుడి తలుపు ఎదురుగా పెద్ద ముగ్గువేశారు.ముగ్గుమధ్య దాదాపు ఇరవైకిలోల అన్నం రాశిగా పోశారు. అన్నమంతా రక్తంతో తడిసిఉంది. అన్నరాశికి ముందు బాలుడి తల, మోచెయ్యివరకు ఒక చెయ్యి, మోకాలివరకూ ఒక కాలు నరికేసి ఉన్నాయి. కాలు నోటిలో పెట్టబడిఉంది. తల, ముఖం రక్తం తుడిచి శుభ్రంగా ఉంది. జుట్టు రక్తంతో తడిసి అట్టలాగా తయారయింది. ఆ ప్రాంతమంతా వర్షపు చినుకుల్లాగా రక్తపుమరకలు పడి, ఎండి ఎండకు నిగనిగ మెరుస్తున్నాయి.

గర్భగుడిలోపల పిల్లవాడి మొండెం బోర్లా పెట్టి ఉంది. మొండెం ఎదురుగా మూడు మొనలు, రెండు రాళ్ళు, పసుపు, ఎర్రని కుంకుమ పూయబడిఉన్నాయి. అగరువత్తులు కాలిన నుసి, ఆముదం దీపం వెలిగించిన వాసన జరిగిన ఘోరాన్ని వివరిస్తున్నాయి. మొండెంనుండి కారిన రక్తం చెల్లాచెదరుగా పారి గడ్డకట్టిఉంది. మొండెం పక్క పెద్ద కత్తి, చిన్న రుద్రాక్షమాల, రక్తంతో తడిసిన ఒక చేతిరుమాలు పడిఉన్నాయి.

''ఎవరీ అబ్బాయి?'' అనుకున్నాడు యస్.ఐ. ఆందోళనగా. అదంతా చూస్తుంటే జానపద కథల్లో చదివిన భయంకర సంఘటనలు గుర్తుకువస్తున్నాయి అతడికి. చిన్నప్పుడు అమ్మమ్మ చెప్పిన నరమాంసభక్షకులైన రాక్షసుల కథలు జ్ఞప్తికివచ్చాయి. పైకి గంభీరంగాఉన్నా మనస్సులో అనేక భయాలు దడపుట్టిస్తున్నాయి.

నాగరాజును పిలిపించాడు. నాగరాజు లోనికి వస్తూనే గజగజా వణుకుతున్నాడు.

''గుర్తుపట్టగలరా?'' అన్నాడు యస్.ఐ.

నోటమాటరాని నాగరాజు తలవూపాడు గుర్తుపట్టలేనట్లు.

ఒకవైపు అతడికి రవి కావచ్చునని అనుమానమేఉన్నా పోలీసులద్వారానే ఆ విషయం నిర్ధారణ చేసుకోవాలనుకుంటున్నాడు.

ఇన్‌స్పెక్టర్ తలదగ్గరకువచ్చి వొంగి నుదుటిమీద చూపిస్తూ "నుదురు మీద పెద్దపుట్టుమచ్చ ముక్కుపైగా ఉంది– చూశారా." అన్నాడు నాగరాజుతో.

అతడు తలవూపాడు.

ఇన్‌స్పెక్టర్ లేచినిలబడి "నిన్న ప్రసాద్‌గారు ఇచ్చిన రిపోర్టులో తన కొడుకు నుదిటిపైన పెద్ద పుట్టుమచ్చ ఉన్నట్లు రాశాడు. ఇంకా మనకు అనుమానం అవసరంలేదనుకుంటాను. అయినా వాళ్ళుకూడా చూసి గుర్తిస్తే అందరికీ మంచిదిగదా"

నాగరాజు కళ్లనుండి జలజల నీళ్ళురాలాయి. "వాళ్ళకు ఒక్కడే బిడ్డ, ఈ సంఘటన చూసి ఆమె బతుకుతుందా సార్?" అన్నాడు కన్నీళ్ళతో.

"ఏం చేద్దామండీ! ఈ విధంగా జరుగుతుందని మనం అనుకోలేదు. అనుకోనిది జరిగిపోయింది" అన్నాడు ఓదార్పుగా.

"నా జన్మలో ఇటువంటి సంఘటన చూళ్ళేదుసార్. నరబలి చేస్తుంటారని విన్నానుకాని, మరీ ఇంత దారుణంగా పసిపిల్లవాడిని ఎత్తుకుపోయి నరుకుతారని అనుకోలేదు" అన్నాడు గ్రామపెద్ద ఉద్వేగంగా.

"ఈ వార్త వారికి చెప్పకపోవడమే మంచిదేమో" అన్నాడు నాగరాజు.

"మా రూల్స్‌కి విరుద్ధమవుతుందండీ. చట్టప్రకారం వారు గుర్తించాలి. వారికి చూపించి, గుర్తించిన తరువాత పోస్ట్‌మార్టం జరిపించి, శవాన్ని వారికి అప్పగించడం మా బాధ్యత" అంటూ హెడ్‌ను పిలిచి " ఆ భార్యాభర్తల్ని ఇక్కడికి తీసుకురండి" అన్నాడు.

"ఇది మా డ్యూటీ తప్పదుగదా!" అన్నాడు యస్.ఐ. నాగరాజువైపు తిరిగి. "సార్ ... కనీసం ఆమెకైనా చూపించకండి. ఆమెచూసి తట్టుకోవడం కష్టంసార్!"

ఇన్‌స్పెక్టరు పలుకలేదు. పక్కకు తిరిగి కనుకొలకుల్లో నిలిచిన నీరు వ్రేలితో తుడుచుకున్నాడు.

ప్రసాద్, వసుంధర లోపలకు వస్తూనే ఇన్‌స్పెక్టర్ వారికి ఎదురుగా నిలబడి, ప్రసాద్‌ను ముందుకు రమ్మని "ఈ తల ఎవరిదో చెప్పగలరా?" అడిగాడు చూస్తూ.

తల ముందుకువచ్చి ప్రసాద్ చూసి నిలువుగుడ్లతో నిశ్చేష్టుడై నోట మాటరాక నిలబడ్డాడు. అతని శరీరం వణికిపోతున్నది. నోరు పెకలించి "రవీ" అంటూ కేకేసి కిందపడిపోయాడు. అతనితోపాటు చూసిన వసుంధర మొండెంలేని ఆ తలను సరిగా చూడకుండానే కిందపడిపోయింది. బయటఉన్న నలుగురు ఆడవాళ్లను పిలిపించి, వారి సాయంతో ఆమెను వ్యాను వద్దకు చేర్చారు. ప్రసాద్‌ను కూడా వ్యానులో చేర్చి హాస్పిటల్‌కు పంపించాడు. అక్కడి రక్తపు అన్నం, కాలిన అగరవత్తుల నుసి, గుడ్డలు, ఖడ్గం, ఆముదపుదీపం, మరికొన్ని వస్తువులు స్వాధీనం చేసుకున్నట్లు డైరీలో రాసుకున్నాడు. వ్యాను హాస్పిటల్ నుండి తిరిగివస్తూనే తల,మొండెం వ్యానులో చేర్చి హాస్పిటల్‌కు తీసుకెళ్ళి పోస్టుమార్టం కొరకు అప్పగించమని హెడ్డుకు ఆదేశించాడు.

ఇన్‌స్పెక్టరుతోపాటు నలుగురు కానిస్టేబుల్స్, గ్రామపెద్ద, నాగరాజు మరికొందరు గ్రామస్థులు ఎదురుగా ఉన్న సత్రంలో చేరారు.

అక్కడ ముందుగా చూసిన వ్యక్తిని పిలిపించాడు.

"ఏఊరు నీది?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ పైనుండి కిందిదాకా అతన్ని చూస్తూ.

"ఈ ఊరే సార్!"

ఇన్‌స్పెక్టరు గ్రామపెద్ద వైపు చూస్తూనే ఆయన తల ఊపాడు నిజమేనని.

"ఎప్పుడు చూశావో వివరంగా చెప్పు"

"ఉదయం చీకటి విచ్చేముందు గొడ్లకు నీళ్ళుపట్టటంకోసం బిందె తీసుకుని చెరువుకు వచ్చాను. ఎవరోగానీ కొందరు ఈ గుడిముందు కనిపించారు. అక్కడ ఆ సమయంలో ఎందుకున్నారో తెలియక బిందెతో నీళ్ళు తీసుకెళ్లాను. రెండవసారి వచ్చేసరికి బాగా తెల్లారింది. గుడిబయట ముగ్గువేసినట్లు అగుపించింది. అంతకుముందే మనుషులు కనిపించడం, అక్కడ ఎన్నడూ లేనిది ముగ్గు కనిపించడంతో ఏమిటో చూద్దామన్న ఆసక్తితో అటు వెళ్లాను. బయట ముగ్గులు చూసి లోపలకు చూశాను. గుండె పగిలినంత పనయింది. వణుకుతూ

గ్రామపెద్దవద్దకు వెళ్లి చెప్పాను ''

''వెంటనే అతన్నీ మరికొందరినీ తీసుకొని వచ్చి పరిస్థితి చూసి మీకొరకు గ్రామ వెట్టిని పంపాను. మీరు వచ్చేవరకూ ఎవరినీ లోపలకు పంపకుండా, వస్తున్న జనాన్ని దూరంగానే ఆపుచేశాను. చుట్టుపట్ల గ్రామస్థులు కూడా ఈ విషయం తెలిసివస్తున్నారు'' అన్నాడు గ్రామ పెద్ద.

ఇన్‌స్పెక్టరు తల ఊపాడు. జనం ఒక్కరొక్క రే ఇళ్లకు జారుకుంటున్నారు. గ్రామపెద్ద ఇంటినుండి కాఫీ వచ్చింది. ఇన్‌స్పెక్టరు తాగ డానికి ఇష్టపడలేదు. ఆయన వద్దనడంతో మిగిలినవారు కూడా తాగలేదు. ఆ పరిస్థితి చూస్తేనే భయానకంగా ఉంది.

''ఈపని ఎవరైనా చేసి ఉండవచ్చు, ఇది 'బలి' అని ఒప్పుకోక తప్పదు. ఐదేండ్ల బాలుని ఈ మారుమూల గ్రామంలో బలిపెట్ట వలసిన అవసరం ఎవరికి వచ్చిందో తెలును కుంటేగానీ ఈ బలివెనుక ఉన్న వ్యక్తులు బయటపడరు. మీ ఊరిలో ఈ సంఘటన జరిగిందంటే మీ గ్రామస్తులే చేయడానికి ఎక్కువ అవకాశం ఉంది. దూరప్రాంతంవాళ్ళు ఇక్కడకు రావలసిన అవసరం ఏమిటి? ఇటు వంటి గుళ్ళు ప్రతిగ్రామంలోనూ ఉన్నాయి గదా! ఎవరి గ్రామంలోవారు జరుపుకోవచ్చునే'' అన్నాడు యస్.ఐ. తన ముందున్న వారిని చూస్తూ. ఆయన మాటలకు ఆ గ్రామస్తులు కలవరపడ్డారు. అతడు ఇదంతా తమమీదకే తెస్తాడేమోనని వారి భయం. పోలీసులు అను మానించాలేగానీ కుక్కను నక్కగా నక్కను కుక్కగా ఒప్పించడానికి వెనుదీయరు. వాళ్ళు ఆ గ్రామంమీదనే అనుమానపడితే, ఆ గ్రామం నెత్తిన కేసు తోసి గ్రామాన్నంతా ఈకకు ఈక, తోకకుతోక పెరికి, పీడించి, హింసించి చేతు లు దులుపుకుంటారు.

''ఎలా చెప్పగలం సార్! తమ తప్పును కప్పిపుచ్చుకోడానికి దూరప్రాంతంవాళ్ళే వచ్చి ఇక్కడ చేసిఉండవచ్చుగదా! ఈ గ్రామస్తులు తమగ్రామంలోనే ఈ తప్పుడుపని చేసి తమ కాళ్ళు నరుక్కోరుకదా! అందువల్ల ఈ చేసిన వ్యక్తులు ఎవరయినా ఈ గ్రామంవాళ్ళు మాత్రం కాదని మా ఉద్దేశం''

గ్రామపెద్ద మాటలకు తల ఊపాడు యస్.ఐ.

''ఈ ఊరిలో ఇటువంటి మాంత్రిక విద్యలు చేసేవాళ్ళు ఎవరయినా ఉన్నారా?''

''ఆ ... రామయ్య అనే వ్యక్తిఉన్నాడు. అతడు ఏవో చేతబడులు, భూతాల్ని వదలగొట్ట డంలాంటివి చేసి బతుకుతెరువు చూసు కుంటున్నాడు. ఇటువంటి బలులు అతడు ఎన్నడూ ఇవ్వలేదు; ఇచ్చినట్లు మేము విననూ లేదు''

''అతన్ని పిలిపించండి'' అన్నాడు ఇన్‌స్పె క్టరు.

రామయ్య అక్కడకు వచ్చాడు. యస్.ఐ.కి దండాలుపెట్టి ఒక పక్కగా నిలబడ్డాడు విన యంగా. అతనివైపు పరీక్షగా చూశాడు ఇన్‌స్పె క్టరు. రామయ్యలో భయచిహ్నాలేవీ లేవు. ఏమీ ఎరగనట్లు యధాలాపంగా నిలబడి ఉన్నాడు. నొసట వెడల్పాటి విభూది బొట్లు, మోచేతులవ రకూ చొక్కా, గూడకట్టు పంచె, భుజంపైన ఎర్రటికండువా, అతని వేషధారణలో కూడా ప్రత్యేకత ఏమీ లేదు.

''నీకు చేతబడుల సంగతి బాగా తెలుసా? ఎంతవరకు అనుభవం ఉంది?'' అడిగాడు ఎస్.ఐ.

''నాకు చేతబడుల గురించి ఏమీ తెలియ దు సార్! భూతాల్ని పిశాచాల్ని వదలగొట్టడం, వాటిభయం లేకుండా రక్షలు కట్టడం వరకే న్నాకు తెలును'' అన్నాడు రామయ్య తొణక కుండా.

''ఈరోజు జరిగిన బలి విషయం విన్నావా?''

రామయ్య తల ఊపాడు. ''నేను వచ్చిచూశా ను సార్ అన్నాడు.

''దానిమీద నీ అభిప్రాయం ఏమిటి?''

''ఎవరో, ఏదో సాధించేదానికి బలిఇచ్చారని పిస్తోంది. సాధారణంగా తమతమ సిద్ధులు సాధించేందుకు ఇటువంటివి జరుపుతూ ఉంటారు.''

''ఐదేండ్ల పిల్లవాడు బలిమేకగా ఎందుకు పనికివస్తాడు?''

"చెప్పలేం! వారు సాధించేకార్యానికి తగిన బలిపశువు గురించి గణాంకాలు తయారుచేస్తారు. ఒక్కోసమయలో అప్పుడు పుట్టినబిడ్డే అవసరం కావచ్చుకూడా. ఏమో చెప్పలేం"

"ఏకార్యానికి ఎలాంటి బలిపశువు కావాలో చెప్పగలవా?"

ఒక నిముషం పలుకలేదు రామయ్య. ఆలోచిస్తూ ఉండిపోయాడు. "అదికూడా చెప్పడం కష్టమేసార్! ఎందుకంటే అందులో నాకు ప్రావీణ్యత లేదు. ఆసక్తికూడా లేదు."

"పోనీ, ఈ బలులు జరపడంద్వారా వారి వారి కార్యాలు నెరవేరుతాయని నమ్మకం ఉందా? లేక అలా అపోహతో చేయడమేనా?

"ఆయావ్యక్తులు ఏదో సాధించడానికి సిద్ధపడి, అవినెరవేరగలవన్న నమ్మకంతోనే ఇటువంటి పనికి తెగిస్తారు. ఇది ఎంతో కష్టనష్టాలతో కూడుకున్నపని. అందువల్ల తమాషాకోసం ఎవరూచేయరు."

"ఇది చేయగలవాళ్ళు, చేయాల్సిన అవసరం గలవాళ్ళు ఈ ప్రాంతంలో ఎవరయినా ఉన్నారేమో నీకు తెలుసా?"

"నాకు తెలియదు" అంటూ పెదవి విరిచాడు రామయ్య. అతడి కళ్ళల్లోనికి సూటిగా చూశాడు ఇన్స్పెక్టర్. రామయ్య కళ్ళు కొద్దిగా చలించినట్లు అనిపించింది అతనికి! "వీడికే ఆ అవసరం ఎందుకుండకూడదు? పైగా నన్ను చూచి భయపడుతున్నాడు. వీడూ మంత్రగాడే! తానే ఇంకా సిద్ధులు ఏవో సాధించాలని చేసిఉండవచ్చు గదా" అనుకున్నాడు.

అతడిని విడిచిపోవడానికి మనస్కరించలేదు. ఎవడో ఒకడిని లోపలకు తోస్తేనే కేసు నిజానిజాలు ఎలాఉన్నా పరిశోధన ఎంతో కొంత జరిగిందన్న తృప్తి మిగుల్తుంది. పైఅధికారుల దృష్టిలో పనిచేస్తున్నట్లు కనిపించి సర్టిఫికెట్లు సంపాదించుకోనూవచ్చు. ఆలోచనలు ఆపి అడిగాడు ఎస్సై.

"అసలు ఈ మంత్రతంత్రాలమీద నీ నమ్మకం ఎంతవరకు?"

"నాకు నమ్మకం ఉందిసార్" అన్నాడు తొణక్కుండా.

"అయితే నువ్వే ఎందుకు చేసి ఉండకూడదు??" అన్నాడు గాండ్రిస్తూ ఆ దెబ్బతో రామయ్య వణికాడు. కాలికి వేస్తే మెడకు, మెడకువేస్తే కాలికివేయసమర్థులైన ఈ పోలీసు ఆఫీసర్లతో ఏంమాట్లాడినా తన మెడకే చుట్టబోతున్నాడని అర్థంచేసుకున్నాడు.

"ఇది నీ పనే, ఏవో సిద్ధులకొరకు నువ్వే ఈ పనిచేసిఉంటావు చెప్పు" అంటూ లాఠీచేతికి తీసుకున్నాడు.

"సార్! నాకేం తెలియదుసార్ నన్ను నమ్మండిసార్" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"ఒరేయ్ బోషడికే! నాకు పంగనామాలు పెడదామనుకున్నావా? పద... నీ తోలుఒలిచి నీనోట నిజం చెప్పిస్తా" అంటూ హెడ్డును కేకవేశాడు. హెడ్ కానిస్టేబుల్ రామయ్య చొక్కా కాలర్ గట్టిగా పట్టుకున్నాడు. మరో కానిస్టేబుల్ రామయ్య చేతులకు బేడీలు తగిలించాడు. గ్రామపెద్ద అభ్యంతరం చెప్పాడు.

"అతడు చేసినట్లు రుజువేమిటి సార్! అన్యాయంగా అతన్ని ఇరికిస్తున్నారు."

కొరకొరచూశాడు అతడివైపు యస్.ఐ. "వాడేచేశాడు. వాడు చెప్పేమాటల్నిబట్టి వాడికి తప్ప ఇక్కడ మరొకరికి అవసరం లేదు" అన్నాడు. ఈలోగా ఈ విషయం తెలిసి రామయ్య భార్యా, పిల్లలు, బంధువులూ లబలబకొట్టుకుంటూ, రాగాలు తీస్తూ అక్కడకువచ్చారు. గ్రామస్తులు నోరువెళ్ళబెట్టారు. వారిలో రెండు వర్గాలుగా తయారయ్యారు. రామయ్య మంచివాడని కొందరంటే, ఏమో, ఏపుట్టలో ఏపాముందో ఎవరుచూశారు? అన్నారు కొందరు.

ఏదిఏమైనా ఆ గ్రామస్తులు బహు శాంతస్వభావులు. పోలీసులంటే ఆమడదూరం జరిగే భయస్థులు. పోలీసు వలలో పడ్డ రామయ్యను విడిపించడం తమ తరంకాదని ఎవరూ నోరెత్తలేదు.

పోలీసువ్యాను వచ్చి సత్రం ముందు ఆగింది. ఉదయమే శుభ్రంగా కడిగారేమో తళతళామెరుస్తున్నది. ఇన్స్పెక్టరు లేచి నిలబడి టోపీచేతికి తీసుకున్నాడు. "వాణ్ని లోపలకు తోయండ్రా" అని పురమాయించి ముందు సీటులో కూర్చున్నాడు.

పోలీసులు రామయ్యను లోపలకు

ఎక్కించారు. అతడి భార్యాపిల్లల రోదనలు శృతిమించుతూ ఉండగా గ్రామపెద్ద చేతులు నలుపుకుంటూ యస్.ఐ. ముందుకువచ్చాడు.

"సార్! రామయ్య చాలామంచివాడు సార్! అతడు ఈ పనిచేసి ఉండడుసార్!" అన్నాడు వినయంగా.

"చూద్దాం! విచారించి వాడుగాకుంటే విడిచిపెడతాంగా!" అంటూ భరోసా జారీచేసి వ్యానును పోనివ్వమన్నాడు ఎస్సయ్.

దుమ్ములేపుకుంటూ వెళ్తున్న పోలీసు వ్యానువైపు జనంచూస్తూ నిలబడ్డారు. వ్యాన్ కనుమరగవుతూనే గుండెలనిండా ఊపిరిపీల్చి వదిలారు. ఆ సమయంలో అందర్నీ నేరస్థులుగా ముద్రవేసి వ్యాను ఎక్కించినా తాము ఏమీచేయలేమని వారికి తెలుసు. అందుకే తమనలా విడిచి వెళ్ళినందుకు సంతసిస్తున్నారు.

గ్రామపెద్ద వెట్టిమనిషిని పిలిచి, "ఇక్కడంతా శుభ్రంచేయించు. ఇలాగే ఉంటే పిల్లలేకాదు, పెద్దలుకూడా ఈ ప్రాంతాల్లో తిరగలేరు" అన్నాడు.

"అన్నయ్యా! నాభర్తను అన్యాయంగా తీసుకుపోతున్నారే మీరంతా చూస్తూఉండగానే ఇంత అన్యాయమా? నాభర్త ఏమిచేయలేదని మీకు తెలియదా?" అంది రామయ్య భార్య గ్రామపెద్దతో.

"తెలుసు తల్లీ, తెలుసు తెలిసి ఏంచేస్తాం! వాళ్ళాపోలీసులు, వారిని ఎదిరించి కాదు కూడదన్నానే అనుకో! ఎస్సయ్ నన్నుకూడా వ్యానులో తోయమని పోలీసుల్ని పురమాయిస్తాడు. నన్నేకాదు, ఎవడుఏమన్నా జరిగేపని అదే. మరిఏంచేస్తాం విడిపించే ప్రయత్నం చేద్దాం" అన్నాడు తలవంచుకుని గ్రామంలోనికి దారితీస్తూ!

★ ★ ★

రామయ్యను పోలీసు లాకప్‌లో త్రోసి, వ్యానులో నేరుగా హాస్పిటల్‌కు వెళ్ళాడు యస్.ఐ. ప్రసాద్ పడకవద్ద ఆగాడు. అతడు తల చేతుల్లో పెట్టుకొని వలవలా ఏడుస్తున్నాడు. ఇన్‌స్పెక్టర్‌ను చూసి "నా జీవితం పాడయిపోయిందిసార్! మా ఆశలూ ఆనందాలూ ఇంతటితో పూర్తయ్యాయిసార్!" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ అతడి వీపు నిమిరాడు. "అధైర్యపడకండి ప్రసాద్‌గారూ! ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో, ఎవరు చేశారో తెలుసుకుంటాం. దోషుల్ని తప్పకుండా దండిస్తాం" అన్నాడు.

"వాడు ఎవడో ఉరికంబం ఎక్కితే మాత్రం నా కొడుకు బ్రతికి వస్తాడంటారా? వాడు ఏమయినా మాకు లాభమేమిటి? మా బ్రతుకులు శాశ్వతంగా చీకటే కదా!"

జవాబు ఏమని చెప్పగలడు ఎస్సయ్? పోలీసు పరిభాషలో సర్దిచెబితే ఊరడిల్లే పరిస్థితి కాదది. అక్కడినుండి స్త్రీల వార్డుకు వెళ్ళి వసుంధర బెడ్‌వద్దకు వచ్చాడు. సెలైన్ శరీరానికి ఎక్కిస్తున్నారు.

"ఎలా ఉంది డాక్టర్?" అన్నాడు.

"ఓవర్ షాక్! తేరుకోగలిగితే అదృష్టమే!" అన్నాడు డాక్టర్ పెదవి విరిచి.

నాగరాజు కనిపించాడు. వ్యానుదాక ఇద్దరూ కలిసి వచ్చారు.

"మా ప్రయత్నం మేం చేస్తాం నాగరాజుగారూ! ఇటువంటి సంఘటన నా పోలీసు జీవితంలో ఎన్నడూ చూడలేదు. నా మనస్సు కలిచివేసింది!" అంటూ చెయ్యిచాపాడు.

నాగరాజు చెయ్యికలుపుతూ "నేను ఇక్కడే ఉంటాను సార్! ఈ పరిస్థితిలో వారిని వదిలివేయడం మంచిదికాదు. వారి అవసరాలేమిటో చూసుకుంటాను" అన్నాడు.

తల ఊపాడు యస్.ఐ. పోలీసు వ్యాను ముందుకు సాగింది.

నాగరాజు లోపలకు వెళ్తుండగా వార్త తెలిసిన తోటి ఉద్యోగులు అక్కడికి వచ్చారు. ఎలా జరిగిందీ నాగరాజుద్వారా తెలుసుకుని విషాదంగా తలలు ఊపారు.

అందరూ కలిసి లోపలకు వెళ్ళారు. ప్రసాద్‌ను ఆ స్థితిలో ఎవరూ ఓదార్చలేకపోయారు.

"ఇది మానవ జాతికే కళంకమైన సంఘటన. మనిషిని మనిషి చంపడం ఘోరమైతే, ఈలాంటి చర్యలు మరెంత ఘోరమైనవో? కక్షతో చేసిందికాదు. అదీ ముక్కూ మొఖం

తెలియని పసిపిల్లాడిని ఏదో సాధించాలన్న ఆశతో చేయడం'' అన్నారు ఒకరు నిట్టూరుస్తూ.

''ఒకరిని పట్టుకున్నారట కదా! నిజమేనా నాగరాజూ''

నాగరాజు పెదవి విరిచాడు- ''అని యస్.ఐ చెప్పాడు. మరి మనం చూడలేదు గదా! అయినా అంతపని చేసినవాళ్ళు యస్.ఐ. ఎదురుగా వచ్చి నిలబడి పట్టుకొమ్మని కూర్చుంటారా?''

క్వార్టర్సునుండి చాలామంది ఆడవాళ్ళు పిల్లలూ ఆందోళనతో అక్కడకు వచ్చారు. ప్రసాద్‌నూ, వసుంధరనూ చూసి, చలించిన హృదయాలతో మ్రాన్పడిపోయారు.

★ ★ ★

నరశింహారావు సిటీ బస్సు దిగి సమితి ఆఫీసువద్దకు వచ్చేటప్పటికి యు.డి.సి. గోవిందం బయటే కనిపించాడు.

''ఏమిటోయ్ నరశింహా! ప్రొద్దున్నే తగలడ్డావ్?'' అన్నాడు వెక్కిరింతగా.

''మేము ఎప్పుడు తగలడినా, మీరు మాత్రం వేళకు తగలడతారుగా! సరేగానీ, ఏం చేస్తున్నావ్ ఇప్పుడు? కాఫీ త్రాగి వద్దామా?''

''పద, మేం చేసేది గోళ్ళనుండి మట్టి లాగడమే!'' అంటూ నరశింహారావు భుజంమీద చెయ్యివేసి, ఎదురుగా ఉన్న కాఫీ స్టాల్ వద్దకు వచ్చాడు. సమయానికి నరశింహారావు రావడంతో కాఫీ ఖర్చు ఒక్క రూపాయి తగ్గినందుకు సంతోషించాడు గోవిందం! ఇద్దరూ హొటల్లో కూర్చుని ఫలహారానికి ఆర్డిరిచ్చారు.

''నీ బిల్లు తొందర్లోనే తెముల్తుందిలేవోయ్! సమితి అధ్యక్షుని సంతకం కూడా అయింది'' అన్నాడు గోవిందం నరశింహారావు భుజంతట్టి.

నరశింహారావు మౌనం మెలిత్రిప్పాడు. ''బాబా దయ ఉన్నంత వరకూ ఎందరు దగుల్బాజీలు అడ్డుపడ్డా ఆగదురాబాయ్! మేమే దేవుళ్ళమని మీ వాళ్ళు విఱ్ఱవీగుతున్నారు'' అన్నాడునవ్వుతూ.

గోవిందంకూడా పకపకనవ్వాడు. ''బాబాగారు శ్రీరామనవమి ఘనంగా జరపడానికి అన్ని ఏర్పాట్లూ చేయిస్తున్నారట గదా! ఈ ఉత్సవాలకు నేనుకూడా వస్తాను'' నా ఖర్చుకూడా నువ్వే భరించాలన్న భావంతో అన్నాడు.

''తప్పకుండారా! జీవితంలో మళ్ళీమళ్ళీ చూడడానికి కూడా అవకాశం లేనంతటి వైభవోపేతంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. భక్తులు కన్నుల పండుగగా తిలకించి, తరించడానికి అన్ని ఏర్పాట్లు జరుగుతున్నాయి. నువ్వు నమ్మవుగానీ గోవిందం! ఒకసారి ఆ వైభవోపేతమైన ఉత్సవాన్ని కళ్ళారా చూస్తేచాలు, ఎన్ని పాపాలు చేసి ఉన్నా ఒక్క దెబ్బతో అవన్నీ అంతరిస్తాయి'' అన్నాడు నరశింహారావు తన్మయత్వంలో పడుతూ.

''నేనేం నాస్తికుడ్ని కాదు లేవోయ్! నాకు కూడా దేవుడంటే నమ్మకం వుంది. అసలు ఇంతవరకూ నేను ఈ బాబాను చూడనే లేదు. ఒకసారి అయినా చూడాలన్న ఆశవుంది. తప్పకుండా వస్తాను''

తల ఊపాడు నరశింహారావు. చొక్కా కాలర్ చేతితో నలుపుతూ క్యాష్ టేబుల్ ముందు కూర్చున్న ఆసామినే చూస్తున్నాడు. ఆసామి ముఖానికి విబూది రేఖలూ, కుంకుమ బొట్లు ఉన్నాయి.

''బిల్లు చేతికి వచ్చిందంటే పదివేల రూపాయలు హుండీలో వేస్తానని ఒప్పుకున్నాను. బిల్లు వస్తూనే చెల్లించాలి సుమా''

''తొందరగానే వస్తుంది! అంతా అయిందిగా!'' అంటూ కాఫీ త్రాగడంలో మునిగాడు గోవిందం.

అప్పుడే రోడ్డు మీదకు వచ్చిన గంగారాం వీరిద్దరినీ చూసి ''బాబా భక్తులు ఎక్కడికి దయచేశారు'' అన్నాడు నవ్వుతూ.

నరశింహారావు చెయ్యిపైకెత్తి ఆడిస్తూ, ''అయ్యా ! అధో సన్నానుల జాబితాలో రేపు నీపేరే ప్రముఖంగా ఉంటుంది. దేవతల్ని తూలనాడుతూ బ్రతికే పాపపు నాస్తికులందరూ వచ్చేజన్మలో ఏ చీమగానోపుట్టి, పుణ్యపురుషుల కాళ్ళ క్రింద నలిగిచచ్చి, పాపవిముక్తి పొందాల్సి ఉంటుంది'' అన్నాడు.

''నేనేం దేవుడ్ని తిట్టడంలేదయ్యా! ఆయన

ఉన్నాడో లేదో ఎవరికీ తెలియదు. నేను తిడుతున్నది దేవుళ్ళం మేమేనని విర్రవీగే బాబాలనే! వాళ్ళూ మనలాంటి మానవులేకదా!''

నరశింహారావు రెండుచెవులూ మూసుకుని ''సరే సరే... నీలాంటి వాడితో ఇటువంటివి చర్చించడం మంచిదికాదుగానీ, వచ్చే శ్రీరామనవమికి మా బాబామఠంవద్దకు రా! జన్మలో ఒక్కసారయినా తరించిపోదువుగానీ'' అన్నాడు.

''తరించడం సంగతి తర్వాత! ఆ వాతావరణం చూడాలి గనుక తప్పకుండావస్తాను. వపన్నంగానీ పెడుతున్నావా ఆరోజు?''

''పిండాకూడు పెట్టాల్సిందే! నీలాంటి నాస్తిక దద్దమ్మలను ఆరోజు చెట్టుకుకట్టి, తోలు వలిచేయాల్సిందే! అందుకే రమ్మంటున్నాను''

ముగ్గురూ నవ్వుకున్నారు. సమితి అధ్యక్షుడు అటుగారావడంతో మిగిలిన ఇద్దరూ జారుకున్నారు. నరశింహారావు నమస్కారంచేసి నిల్చున్నాడు.

''ఎప్పుడు వచ్చావయ్యా! నీకొరకే ఎదురుచూస్తున్నాను. బిల్లు పూర్తయింది; సంతకాలుకూడా అయ్యాయి. చెక్కుతీసుకోగూడదూ?'' అన్నాడు ఆయన.

నరశింహారావు చేతులునలుపుకుంటూ ''అందుకొరకే వచ్చానండీ! ఖర్చులు విపరీతంగా పెట్టాల్సివచ్చింది. రేపు బాబాగారికి పదివేలు సమర్పిస్తానని విన్నవించుకున్నాను. చేతిలో పైసాలేదు. చెక్కుతీసుకుంటాను ఈరోజు''

''బి.డి.ఓ. వచ్చిన తరువాత తీసుకో'' అంటూ లోపలకు వెళ్ళాడు.

బి.డి.ఓ. వచ్చేవరకూ వేచిఉండి చెక్కు సంపాదించుకున్నాడు. యాభైవేల రూపాయల చెక్కు చేతికి తీసుకుని, మహదానందంతో మెడలో లాకెట్‌లోఉన్న బాబాను కళ్ళకద్దుకున్నాడు. మనిషి రావడంతో అతనివైపు చూశాడు.

''ప్రశిడెంటుగారు రమ్మంటున్నారయ్యా!'' వినుక్కుంటూ లోపలకు వెళ్ళాడు.

''చెక్కు తీసుకున్నావా నరశింహారావు?''

తలఊపాడు నరశింహారావు.

''మరి నా వాటా ఏమిటి? నాకూ డబ్బుతో అవసరముందయ్యా!''

''డబ్బుతో అవసరంలేనిది ఎవరికండీ? చెక్కుమార్చుకున్న వెంటనే మీకివ్వవలసిన పదివేలూ, బాబాగారికివ్వవలసిన పదివేలూ ఇచ్చేస్తాను''

''బాబాకు నేనూ ఓ ఐదువేలిస్తానని విన్నవించుకున్నాను. ఐదు అటుఇచ్చి, ఐదు ఇటిచ్చివెళ్ళు''

నరశింహారావు తలూపి బయటకు వచ్చాడు.

సాయంత్రం ఆరుగంటలకు బాబామఠంవద్ద దిగాడు బస్సునుండి. పాలరాతితో కట్టబడిన మందిరం ట్యూబ్‌లైట్ల కాంతితో వెలిగిపోతోంది. మందిరం ముందుకువచ్చి లోపలున్న సీతారాముల్ని తలచుకుని నమస్కరించాడు. అక్కడినుండి మందిరానికి కొద్దిదూరంలోఉన్న ఆశ్రమంవద్దకు వచ్చాడు.

ఆసరి బాబా మెత్తని పరుపుమీద కూర్చుని తలగడమీద మోచెయ్యిఒడ్డి దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. శిష్యుడువచ్చి చెప్పినవెంటనే అతన్ని తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. నరశింహారావు చేతులుజోడించి వినయంగా ఆయన ముందుకువచ్చి సాష్టాంగపడ్డాడు. ఆయన పాదాలను తలతోతాకి తన్మయత్వంతో లేచి నిలబడ్డాడు.

కూర్చోమన్నట్లు చెయ్యి ఊపాడు బాబా!

పక్కనే పాలరాతిమీద కూర్చున్నాడు నరశింహారావు. చేతి రుమాలులోచుట్టిన పదిహేను వేల రూపాయలు ఆయనకు సమర్పించాడు. ఆ కట్టలవైపు చూసి, తిరిగి అతనివైపు చూశాడు బాబా కళ్ళెగరేసి.

''అందులో పదివేలు నేనివ్వదలచుకున్న పరిహారం స్వామీ! మిగిలిన ఐదువేలూ తమ దయతో సమితి అధ్యక్షుడైన తమ భక్తుడు తమకు నివేదించమని పంపాడు.''

పక్కనున్న శిష్యునికి ఆ మొత్తం అందించాడు బాబా!

''మంచిది'' తల ఆడించాడు బాబా. ''మంచిది దేవుని కరుణకు మీరందరూ

పాత్రులు కావలసినదిగా దీవిస్తున్నాను."

వినయంగా తలవంచాడు నరశింహారావు. "స్వామీ! మన మందిరం పరిసర ప్రాంతాలలో ఏర్పాటు చేయదలచిన ఉచిత వైద్యశాలకు కావలశిన సహాయసహకారాలు అందిస్తామని ఎందరో ముందుకు వస్తున్నారు."

"మంచిది, మంచిది" అన్నాడు స్వామీజీ చేతులు ఊపుతూ, అరమోడ్పు కన్నులతో. చిరునవ్వు నవ్వి పక్కనున్న భరిణలో ఉన్న విబూది తీసి అతనికి ఇచ్చాడు. భక్తి పారవశ్యంతో దాన్ని కళ్లకద్దుకుని, చేతులకు, పొట్టకు, ముఖానికి, కంఠానికి రాసుకున్నాడు.

పక్కనున్న శిష్యుడు సంజ్ఞ చేయడంతో లేచాడు నరశింహారావు. అతనికివ్వవలసిన సమయం గడిచిపోతే ఇక అక్కడ ఉండటానికి వీలులేదు. మరొకరికి ఆయన దర్శనం ఇవ్వవలసి ఉంటుంది. అక్కడి నియమం అది!

బయటకు వచ్చిన నరశింహారావు సెక్రటరీ గదిలోకి వెళ్లాడు. ఆయన కాగితాలు చూసుకుంటున్నాడు. "నమస్కారం స్వామీజీ!" అన్న రావును తలపైకెత్తి చిరునవ్వుతో 'కూర్చోండి' అన్నాడు.

"ఏర్పాట్లన్నీ చురుగ్గా సాగుతున్నాయి. మీ లాంటి భక్తకోటి ఉంటే ఎలాంటి పని అయినా చురుగ్గా సాగిపోతుంది. బాబాగారి దయవల్ల అన్నీ సవ్యంగా జరిగిపోతాయి."

సెక్రటరీ మాటలకు చిరునవ్వు నవ్వాడు రావు. ఆయనగారి దయవల్లనే మేము ఇంతటివాళ్లం కాగలిగాము. ఆయనే లేకపోతే నేనూ, నాలాంటివాళ్లందరూ ఈపాటికి ఏ అవతారం ఎత్తవలసి వచ్చేదో తమకు తెలుసు. ఆయన ఆశీర్వాదానికి సహకరించడం కనీస బాధ్యత గదా!

సెక్రటరీ నవ్వి తన పనిలో మునిగిపోయాడు. రావు బయటకు వచ్చి భక్తుల విడిది గృహాలవైపు చూశాడు. ఆ గృహాల వ్యవహారం చూసే భక్తుడు రావును చూసి పలకరింపుగా నవ్వాడు.

"ఎప్పుడు వచ్చారు తమరు?"

"రెండు గంటలయిందండీ! తమరు కుశలమేనా?"

"బాబాగారి దయ ఉన్నంతవరకూ అందరమూ కుశలమే!"

"మంచిదే! మంచిదే" అన్నాడు రావు. "ఈ రాత్రి ఇక్కడే ఉండి పోదలచుకున్నాను. రేపు ఉదయమే మా ఊరు వెళ్లాలి. ఒక రూం ఏర్పాటు చేయగలరా?"

"తప్పకుండా" అన్నాడు అతడు. తన రూంలో తీసుకునివెళ్లి గోడకు తగిలించిన తాళంచెవులగుత్తి తీసుకుని గదుల వరుస వెంటసాగారు. ఒక గదిముందు నిలిచి "ఈ రాత్రికి ఈ గదిలో విశ్రమించండి" అన్నాడు.

నరశింహారావు లోపలకు అడుగుపెడుతూ "మంచిది, నేను ఉదయమే వెళ్లవలసి ఉంటుంది. ప్రసాదం పంపే ఏర్పాట్లు చేస్తారు గదూ!"

ఆ వ్యక్తి బయటకు వచ్చాడు. అక్కడే ఉన్న రూంబాయ్‌ని పిలిచి "ఇప్పుడు వచ్చిన వ్యక్తికి కావల్సిన సహాయం అందించు. అతడు బాబా గారికి ముఖ్య శిష్యుడు" అని చెప్పాడు.

రూంబాయ్ తలవూపాడు. అతను రావు గదివైపు నడిచి తలుపు తట్టాడు. రావును చూస్తూనే ప్రసాదం పంపమన్నారా? అన్నాడు పైనుండి కిందకుచూస్తూ.

"ఆ! పంపించండి. కొంచెం సరిపోతుంది, మరింత భరించలేను" రావు మాట పూర్తికాకుండానే అతడు వెళ్లిపోయాడు.

తలుపువేసి వచ్చి పరుపుమీద వెల్లకిలా పడుకున్నాడు. పైన తిరుగుతున్న ఫ్యానువైపు చూస్తూ, భవిష్యత్తుని గురించి కలలుకంటూ కళ్లుమూసుకున్నాడు.

బాబా ప్రత్యేకంగా కట్టించిన శ్రీరామ మందిరం నిర్మాణం ఈ సంవత్సరమే పూర్తయింది. దాదాపు నాలుగు లక్షల రూపాయలు మందిరంకొరకే ఖర్చుచేయగా విడిదిగృహాలు, బాబా ప్రత్యేక మందిరం కొరకు మరో నాలుగు లక్షలు ఖర్చుచేశారు. సాంప్రదాయక పద్ధతిలో అధునాతన సౌకర్యాలతో నిర్మించిన ఆ మందిర సముదాయానికి ఎవరైనా ప్రముఖుడి చేత ప్రారంభోత్సవం చేయించాలని ఆయన ఆలోచించారు. మందిరానికి దాదాపు కిలోమీటరు దూరంలోఉన్న చిన్నగుట్టపై యాభై పద

కల హాస్పటల్‌కు కూడా ప్రభుత్వం అంగీకరించింది.

ప్రభుత్వ అధికారుల్లోనూ, వ్యాపారుల్లోనూ ఆయనకు చాలా పలుకుబడిఉంది. బాబాది ఏవూరో ఎవరికీ తెలియదు. అంతకుముందు ఏంచేసేవాడో కూడా తెలియదు. జనానికి తెలిసినంతవరకూ దాదాపు యాభై సంవత్సరాలు నిండిన వ్యక్తి బాబా! ప్రజల ఆధ్యాత్మిక జీవనానికి సహకారంగా పురోభివృద్ధిచేయడానికి నిశ్చయించుకుని మందిరాలు నిర్మించాడు. ఆ డబ్బు ఎక్కడనుండి, ఎలా వచ్చిందో ఎవరికీ తెలియదు. ఈ దేశంలో అవన్నీ అవసరంలేదు కూడా! ఎవరు ఏంచేసినా మతాన్ని అభిమానించే జనానికి మతోన్మాదం నేర్పగలిగితే పాతచరిత్రలన్నీ కరిగిపోయి, కొత్త అవతారంతో సాక్షాత్కరించి, జనాన్ని ఆకట్టుకోవచ్చు.



బషీర్‌బాబా జన్మతః ముస్లిం! హిందూ సాంస్కృతి ఆరాధించడానికి నిశ్చయించుకున్నాననీ, భారతదేశంలో పుట్టిన ఏ ముస్లిం కూడా తాను నిఖార్సయిన ముస్లింనని చెప్పలేడనీ, చాలామంది హిందూమతం నుంచి బలవంతంగా ముస్లింమతం లోనికి వెళ్ళినవారేనని ఆయన నమ్మకం. అంగువల్ల భారతదేశంలోని ముస్లింలకు కూడా మాతృమతం



హిందూమతమేనని ఆయన ఉద్బోధ! ఆ ఉద్బోధచేయడానికి కంకణం కట్టుకున్న ఆయన తాను ముస్లిం అయినా హిందూ ఆరాధనా మందిరాలు ఏర్పాటుచేసి, తాను భగవద్గీత మధ్య కాలక్షేపంచేస్తూ జీవితం సాగిస్తున్నాడు.

శ్రీరామనవమి రోజు ఉత్సవాల కొరకు మందిరంచుట్టువట్ల పది ఎకరాల పొలాలలో పందిళ్ళు వేయించారు. తాటాకు, వెదురు, కర్రలు, పురికొన కొరకు వేల రూపాయలు వెచ్చించారు. బాబా శిష్యులు నెలరోజులుగా అక్కడే మకాంవేసి పనులు సాగిస్తున్నారు. మందిరానికి కొట్టవచ్చినట్లు రంగులు వేయించారు. మైకులు, స్పీకర్లు ఏర్పాటుచేయించారు. భజన బృందాలకు ఆహ్వానాలు పంపించారు.

నరసింహారావు తన కంట్రాక్టు పనులు తాత్కాలికంగా విడిచి, బాబా పనులలో లీనమయ్యాడు. ఉత్సవానికి కావలసిన ఖర్చులకొరకై అన్ని ప్రాంతాలలో తిరుగుతూ చందాలు వసూలుసాగించాడు. బాబా ముఖ్య శిష్యులలో నమ్మదగ్గ శిష్యులలో ఒకడుగా నిర్ణయించబడ్డాడు.

ఉగాది రోజునుండి ఉత్సవం ప్రారంభమైంది. చుట్టువట్లనుంచి జనం వేలాది మంది ప్రతిరోజూ వచ్చి దైవదర్శనం, అలాగే బాబా దర్శనం చేసుకొని వెళ్తున్నారు.

చివరిరోజు ఉత్సవం అంచనాలను మించింది. లక్షమందికిపైగా జనం అక్కడ కలిశారు. అనేక ప్రాంతాలనుంచి టూరిస్ట్ బస్సులు, ప్రభుత్వ బస్సులు, కార్లు, ట్రాక్టర్లు, మోటార్ సైకిళ్లమీద జనం అక్కడకు చేరారు. చెరకుగడలు, కొబ్బరికాయలు కోకొల్లలుగా అమ్ముడయ్యాయి. దేవస్థానంచుట్టూ కొబ్బరిపీచు అరగజం ఎత్తు పేరుకుపోయింది. ఎక్కడ చూసినా రామసంకీర్తనలు, కోలాటాలు, భజన బృందాలు, గజ్జెలపాటలతో కోలాహలంగా ఉంది. మందిరంలో దేవుడు ఎలావున్నాడో చాలామందికి కనిపించలేదు. ఈ ఉత్సవాలే జనానికి సంతోషాన్ని కలిగించాయి.

సాయంత్రం నాలుగు గంటలకు ప్రముఖ నాయకుడు ఒకరు వైద్యశాలకు శంకుస్థాపన చేస్తున్నారని తెలిసి గుట్టచుట్టూ, గుట్టమీద జనంచేరారు. జనం కేరింతలమధ్య బాబా శిష్యుల కార్యక్రమాలు కన్పించడంలేదు.

గుట్టపైన ఇటుకలతో పేర్చిన గోడకు శంఖుస్థాపన రాయి అతికించి సిద్ధంచేశారు. సరిగ్గా నాలుగు గంటలకు అనుచరులతో నాయకుడు ఆ ప్రాంతానికి వచ్చాడు. ముఖంమీద చెరగని చిరునవ్వుతో వస్తున్న ఆయననుచూసి, అభిమానులు జిందాబాద్‌లు పలికారు.

శంకుస్థాపన తర్వాత చిన్నసైజు మీటింగ్ కూడా ఏర్పాటుచేశారు. ఆ మీటింగులో ఆయన ఉపన్యాసం ఇచ్చాడు.

"మహాజనులారా! ఈ రోజు సుదినం. ఇక్కడ నిర్మించతలపెట్టిన వైద్యశాల శంకుస్థాపనకు నన్ను ఆహ్వానించి, నాచేత చేయించినందుకు మీ అందరకూ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. భగవంతుని దయవల్ల బాబాగారి మహత్తులవల్ల శక్తివల్ల ఈ వైద్యశాల త్వరలోనే నిర్మించబడి, ఈ ప్రాంత పేద ప్రజలను అపద్బాంధవునిలా ఆదుకోగలదన్న నమ్మకం నాకుంది. బాబాగారు తలచుకుంటే ఈ వైద్యశాలేనేమిటి? ఏదయినా సృష్టించగలరు. అంతటి మహత్తర శక్తులు కలిగిన బాబాగారు మీ ప్రాంతంలో మీ పురోభివృద్ధికి కృషిచేయదలచుకుని మీ ముందు నిలచినందుకు నాకెంతో సంతోషంగాఉంది. బాబాగారిద్వారా ఆ దేవుడు సదా మిమ్మల్ని కాపాడగలడని నా నమ్మకం"

ఆయన ఉపన్యాసం పూర్తికాకముందే జనం పలుచబడ్డారు. శంకుస్థాపనకు ముందే కొందరు వెళ్లారు. జనం ఏదో ఉత్సవం జరుగుతుంది చూద్దామనివచ్చారు. గంగాళంలో పాలు బదులు అందరూ నీళ్ళే తెచ్చిపోస్తే అన్నీ నీళ్ళే ఉన్నట్లు, ఏం జరుగుతుందో చూద్దామని వచ్చారుగనుక, అదో ఉత్సవంగా తయారయింది. ఎవరికి వాళ్ళు ఏముంది లెమ్మన్న నిరాశతో ఇంటివద్ద కూర్చుంటే అక్కడ ఉత్సవమూ, ఊరేగింపూ ఏదీ ఉండదు.

తన ఉపన్యాసం ముగియకముందే జనం లేచిపోవడంతో ఆయనకు మండుకొచ్చింది. నరసింహారావు అటు రావడంతోనే గుర్రుమన్నాడు.

"సరేలెండి ... ప్రజలుమాత్రం ఒకరే అన్నీ చెబుతుంటే ఎంతసేపని వింటారు? మీ మీ టింగు గనుక అంతసేపున్నారుగానీ మరొకరిది అయితేనా ఈపాటికి ఉత్సవం కూడా చూడ కుండా వెళ్ళిపోయేవారే" ఊదరగొట్టాడు నర సింహారావు.

"ఏర్పాట్లు ఇంత అధ్వాన్నంగా చేస్తారనుకో లేదయ్యా" అన్నాడు ఆయన. నరసింహా రావు పలకలేదు. ఆయనతో కలిసి బాబా మందిరం వద్దకు వచ్చాడు. బయటే నిలబడ్డ సెక్రటరీ "ఆయన విశ్రాంతిలో ఉన్నారు, ఇప్పుడు కలుసుకోడానికి వీలులేదు" అన్నా డు.

"ఆయనగారు ఇప్పుడు వెళ్ళిపోవాలి. బాబాగారితో మాట్లాడి వెళ్లకతప్పదు. బాబా గారి ఆజ్ఞమీదనేకదా ఆయన వచ్చింది" నర సింహారావు అనడంతో ఇద్దరి వైపూ చూసి సెక్రటరీ లోపలకు వెళ్లాడు. ఐదు నిమిషాల తర్వాత బయటకు వచ్చి రమ్మనట్లు తల విసిరాడు.

లోపల బాబాగారు ఊయలమీద అర్ధనిమీ లిత నేత్రాలతో పడుకొని ఉన్నారు. నలుగురు స్త్రీలు పెద్ద విసనకర్రతో విసురుతున్నారు. పైన ట్యూబ్‌లైట్లు, ఫ్యానులూ తిరుగుతూనే ఉన్నాయి. గదిమధ్య ఆముదపు దీపం పెద్దగా వెలుతున్నది. అగరువత్తుల వాసన గదంతా వ్యాపించింది.

వీరినిచూసి చేయి పైకెత్తారు బాబా కూర్చో మన్నట్లుగా. ఊగుతున్న ఉయ్యాల పక్కన, ఇద్దరూ పాలరాతి బండలమీద కూర్చున్నారు.

"ఏర్పాట్లు అమోఘంగా చేశారు. ఇటు వంటి ఉత్సవం ప్రపంచంలో ఎక్కడా జరిగి ఉండదు" అన్నారు ప్రముఖులుంగారు. బాబా ముఖం గంభీరంగా అయింది.

"బాబాగార్ని పొగిడితే ఒప్పుకోరండీ. మహా కోపం వస్తుంది" అన్నాడు నరశింహారావు.

"హాస్పిటల్ నిర్మాణం ఎప్పట్లో పూర్తిచేద్దామ నుకుంటున్నారు?" అన్నాడు బాబా వైపు చూ స్తూ.

బాబా కళ్ళు మూసి తెరచి "ఓం" అంటూ లేచికూర్చున్నారు. రెండు చేతులు ముక్కుద గ్గర పెట్టుకొని గాలివాలును పరిశీలించాడు. తర్వాత వారిద్దరి వైపుచూస్తూ ఆరు నెలల్లో తయారుకాగలదని నా అంతరాత్మ చెప్తు న్నది. అంతకుముందే పూర్తికావల సిఉంటుంది" అన్నారు చిన్నగా.

"దాదాపు రెండు కోట్ల ఖర్చుతో కట్టదలచిన హాస్పిటల్ ఆరు నెలల్లో తయారుచేయడం మానవమాత్రులవలన సాధ్యంకాదు స్వామీజీ"

"అందుకేనయ్యా బాబాజీగారు దైవస్వరూ పులని చెబుతున్నది. స్వామీజీ తలంచుకుంటే ఆరునెలల్లో ఏంఖర్మ, ఆరు రోజుల్లో చేయగల రు. ఈమధ్య జరిగిన సంఘటన మీకు తెలుసా" అన్నాడు నరసింహారావు చిన్నగా.

ఆ ప్రముఖుడుచెవులు రిక్కించి వింటు న్నాడు. బాబాజీ ధ్యానంలో పడినట్లున్నారు. నరసింహారావు అతడి చెవిదగ్గరకు వంగి "బాబాగారు ఈమధ్య మద్రాను వెళ్తున్నారు కారులో! గూడూరు దగ్గరకు వెళ్లేసరికి కారులో పెట్రోలు అయిపోయింది. ఏంచెయ్యాలో తోచక డ్రైవర్ కిందకు దిగి నిలబడి దిక్కులు చూస్తున్నాడు. ఇంతలో బాబాగారు కారుదిగి టిన్నుతో.నీళ్ళు తీసుకురమ్మన్నారు. ఆ నీళ్లల్లో వేలుపెట్టి తిప్పగానే అది పెట్రోలుగా మారిపో యింది. ఆ పెట్రోలుతోనే మద్రాను వెళ్లారు. ఇంత అద్భుతంచేయగల ఆయన హాస్పిటల్ ఆరు రోజులలో నిర్మించడం గొప్ప విద్యకాదు"

ఆ వ్యక్తి నరసింహారావువైపు, బాబావైపు చాలాసార్లు ఆశ్చర్యంగా చూశాడు. నరసింహా రావు ముఖం భక్తిభావంతో వెలిగిపోతుంటే బాబాగారి ముఖం ప్రసన్నంగా వెలిగిపోతు న్నది.

బాబాగారిమీద ఆ ప్రముఖుడికి పూర్తి విశ్వాసం ఏర్పడింది. ఆయనవైపు భక్తి పూర్వ కంగా చూశాడు. ఇంతవరకూ పైకి ఎట్లా ప్రవర్తించినా, అంతర్గతంగా బాబాలంతా మోసకారులేమోననే సందేహం అతన్ని పీడి స్తున్నది. ఈ సంఘటన గురించి వినటంతో అది పటాపంచలయింది.

లేచి నిలబడి "సెలవు ఇప్పించండి బాబాజీ తిరిగి త్వరలో తమ దర్శనంచేసు కుంటాను" అన్నాడు చేతులు జోడించి.

దగ్గరకు రమ్మని సంజ్ఞచేశాడు బాబా. దగ్గరి

కి వస్తూనే తన రెండుచేతులూ గాలిలో తిప్పి ఒక చేత విబూది, మరోచేత కుంకుమ భరిణి రప్పించి అతడికి ఇచ్చారు. ''ప్రతిరోజు వీటిని వాడుము. నీ ఖర్మలన్నీ నశించి పునర్జన్మలో పాపంనుండి విముక్తి పొందగలవు'' అన్నాడు.

ఆ వ్యక్తి మరింత ఆశ్చర్యపోయాడు. ఒట్టి చేతులు గాలిలో తిప్పిన వెంటనే కుంకుమ, విబూది ఎలావచ్చాయో అతడికి అర్థంకాలేదు. బాబా శక్తిమీద అతడికి మరింత విశ్వాసం ఏర్పడింది. బాబాపాదాలవద్ద తల ఆనించి భక్తిభావంతో చేతులతో ఆయన కాళ్ళు తడిమాడు. తరువాత చేతులు జోడించి గుమ్మందాకా వెనక్కునడిచివెళ్ళాడు.

అతడువెళ్లిన తరువాత నరసింహార్రావు బాబావైపుచూసి ''ఉత్సవాలు నిర్విఘ్నంగా జరిగాయి బాబాజీ'' అన్నాడు సంతోషంగా!

సెక్రెటరీ లోపలకు వచ్చాడు. బాబా ఉయ్యాలలో తిరిగి పడుకున్నాడు. ''ఆయన అలిసిపోయాడు. మీరు తర్వాత ఎప్పుడైనా మాట్లాడవచ్చు. బయటకు వెళ్దాం రండి'' అన్నాడు.

ఇద్దరూ బయటకు వచ్చారు. జనం కోలాహలం మరింత ఉద్వేగంగా ఉంది. డప్పుమోతలతో శ్రీరామచంద్రుని సతీసమేతంగా ఊరేగింపు చేస్తున్నారు. జనం వీరంగం తొక్కుతున్నారు.

లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. యాభై గజాలకు ఒకటి చొప్పున ఏర్పాటుచేసిన స్పీకర్లు భక్తి పాటలను శ్రవణానందకరంగా విన్పిస్తున్నాయి. ఆ దృశ్యం చూస్తూ నరసింహారావు ''ఇంత గొప్పగా జరుగుతుందనుకోలేదు అవధూతగారూ! ఇది మహాద్భుతం'' అన్నాడు.

సెక్రటరీ అవధూత చిరునవ్వు నవ్వాడు. గుండు తడుముకున్నాడు చేతితో!

''బాబాగారిమీద ప్రజలకున్న భక్తికీ, ప్రేమకు, ఆరాధనకు ఇది నిదర్శనం! ఆయనగారి మహత్తులకు, శక్తి సామర్థ్యాలకూ ఇది ఉదాహరణ! ఆయనను నమ్మికొలిచే ఈ ప్రజలకు ఎప్పుడూ సుఖసంతోషాలు, ఆయురారోగ్యాలు కలుగుగాక.'' అన్నాడు చేయి పైకెత్తి దీవిస్తూ.

నరసింహారావు ఆయన దీవన విననూలేదు, చేయిపైకెత్తడం అంతకంటే చూడనూలేదు. ఇందులో ఎంత మిగులుతుంది? ఎంత తనకు దక్కుతుందో అంచనావేసుకుంటున్నాడు. 'ఈబాబా ఎక్కడ పోతే తనకేం? తాను బాబాను కొలిచేది డబ్బుకోసం గానీ, అతగాడి బూడిద మహత్తుల కొరకు మాత్రం గాదు, అనుకున్నాడు మనస్సులో. కేకలేస్తున్న జనంవైపు చూస్తూ అలాగే నిలబడ్డాడు.



సత్రం ఆవరణలో ముగ్గురు సాధువులు కూర్చుని ఉన్నారు. డిసెంబరు చలివణికిస్తున్నది. తమవద్దనున్న కంబళ్ళు శరీరంచుట్టూ కప్పుకున్నారు; అయినా చలి ఆగే సూచనలు కన్పించడంలేదు. ఒక సాధువులేచి సత్రం బయటకు వచ్చాడు. వంటకుగాను పోగుచేసి తెచ్చుకున్న ఎండుపుల్లలు తీసుకుని మళ్ళీ లోపలకు వచ్చాడు. అగ్గిపుల్లగీసి పుల్లలను అంటించాడు. మంట ఆరంభమయ్యేసరికి మిగిలిన ఇద్దరూ అక్కడకుచేరి శరీరానికి వేడెక్కించుకోసాగారు.

''డిసెంబరు చలికంటే జనవరి చలి మరీ భయంకరం!'' అన్నారు ఒకరు చలి కొంతతగ్గడంతో.

''ఏదీ తక్కువ కాదులే సదానంద్! రెండునెలల్లో ఒకదానికొకటి పోటీయే. ఈ రెండునెలలూ మనలాంటివారికి మరీ బాధాకరం అంటూ మరోసాధువు పక్కనున్న జోలెను చేతిలోకి తీసుకున్నాడు. అందులోనుండి చిలుంగొట్టం బయటకులాగి, చిన్నపొట్లం బయటకు తీశాడు. గొట్టం శుభ్రంచేసి, గంజాయి అందులో కూరాడు. కాలుతున్న పుల్లను దాని

మీదవేసి వెలిగించాడు. ఒక దమ్ములాగి, రెండవ వ్యక్తికిచ్చాడు. ముగ్గురిమధ్య గంజాయి గొట్టం చేతులు మారుతున్నది. మత్తుగా తలలు వేలదీస్తూ కాళ్ళు పారచాపి చలికాచుకుంటున్నారు.

"బాబాగారు రేపు దర్శనమిస్తారా?" అన్నాడు సదానంద్.

గురుముఖ్ నవ్వాడు వెకిలిగా! అతని నవ్వుకు అట్టలుకట్టిన వెంట్రుకలు అటుఇటు ఊగాయి. ముందుకువస్తున్న ఆ వెంట్రుకల్ని వెనుకకు త్రోశాడు. గారపట్టిన పండ్లను బయటకువచ్చేలా ఒక్కసారి తుపుక్కున ఉమ్మివేశాడు.

"ఎవడికోసం దర్శనమిస్తాడు? మననుండి ఆదాయం వచ్చేటప్పుడు, ఆ వచ్చే ఆదాయం వదులుకోడుగా!"

మూడోవ్యక్తి తలవూపాడు. "కష్టం మనది, పైనకూర్చుని తేరగా సంపాదించుకుని తినేది వీళ్ళు. నాసామిరంగా! మనకవకాశాలు లేవుగానీ, ఉంటే వీళ్ళతో మనకు సంబంధాలెందుకు? హాయిగా బ్రతుకక పోయామా?" అన్నాడు చేతులు మంటలవైపుకు చాస్తూ.

శరీరాల్లో కొంతవేడి ఎక్కింది. చలివణుకు తగ్గిపోయింది. కప్పుకున్న కంబళి కిందపడేసి లేచాడు నారాయణ. ఆవులించి, ఒక్కసారి చేతులు కాళ్ళు విదలించి "ఈ నెలలో నీ సంపాదన ఎంత?" అన్నాడు.

గురుముఖ్ తలవిదిలించాడు "ఏమీలేదు; అందుకే బాబాగారిని అప్పు అడుగుదామని వచ్చాను. ఈసారయినా మంచి పిట్టను సంపాదిస్తే గానీ, బాగుపడను" అన్నాడు తలఊపి.

"నాకూ ఏమీ ఆదాయం లేదు భాయ్! అయినా జనం కూడా తెలివిమీరి తిరుగుతున్నారు. ఎన్నివిధాల ప్రయత్నం చేసినా ఎవరూ అందడం లేదు. ఎలాగయినాసరే ఈసారి తప్పకుండా సంపాదిస్తాను" అన్నాడు సదానంద్. "నీ ఆదాయం ఏమైనా ఉందా?" అన్నాడు తిరిగి నారాయణతో.

నారాయణ పకపక నవ్వాడు. తలఊపి గొట్టం లాగడంలో నిమగ్నమయ్యాడు. తర్వాత గురుముఖ్‌కు అందించాడు. "మంచి ఆదాయమేననుకో! ఐదొందలు గిట్టుబాటయింది మొత్తంమీద! అయినా అతికష్టం భాయ్! ఏమాత్రం తెలివితక్కువగా ప్రవర్తించినా కటకటాలలోనికి వెళ్ళాల్సివస్తుంది"

మిగిలిన ఇద్దరూ ఆసక్తిగా అతనికి మరింత దగ్గరగా కూర్చున్నారు.

"ఎలా సంపాదించావు భాయ్! ఐదొందలంటే మాటలా? మంచి అవకాశమే దొరికింది" అన్నాడు గురుముఖ్.

"బలికి ఒక పిల్లవాడు కావాలన్నారు. బలిపశువును సంపాదించడానికి ప్రయత్నాలు ఆరంభించాను. స్కూలులో చదువుకుంటున్న ఓ పిల్లవాడికి చాక్‌లెట్ ఇచ్చి బయటకు లాగాను. అంతకుముందే మనవాళ్ళు సిద్ధంచేసిన కారులో వాడిని మనచోటుకి చేర్పించాను. నా ఐదొందలు నాకు ఇచ్చి తీసుకువెళ్ళారు".

"బలి ఇచ్చారా ఆ పిల్లాడిని?" అన్నాడు చీకటిలోకి చూస్తూ సదానంద్.

"ఎందుకివ్వరూ? ఇచ్చేఉంటారు? ఏం?" అన్నాడు నారాయణ.

"ఏమీలేదుగానీ, ఆ పిల్లవాడిని కన్న తల్లిదండ్రులు ఎంతకుమిలిపోతుంటారో కదా"! అన్నాడు సదానంద్ ఆలోచిస్తూ.

గురుముఖ్ పకపక నవ్వాడు. కాళ్ళుజాడించి చాపుకున్నాడు. చేతులు ముందుకు చాపి రెండూకలిపి వేడికోసం రుద్దుకున్నాడు. "మనకు వేళకు కూడులేక ఇలా చలిలో, వర్షంలో పడిచస్తుంటే మన తల్లిదండ్రులు స్వర్గంలోంచి చూస్తూ ఎలా ఏడుస్తుంటారో చూడుభాయ్! మన తల్లిదండ్రులకంటే ఎక్కువావాళ్ళు? అయినా నీతులు పలికే మనం ఈ వ్యాపారంలో పనిచేయలేం! అలా మాట్లాడవలసింది మనంకాదు"

"కష్టం చేసుకున్నా రోజుకు పది రూపాయలు వస్తాయి. ఈ రక్తపు కూడు తినాలంటేనే భయంగాఉంది భాయ్."

"నీఖర్మ నువ్వు అనుభవించి చావు" పది రూపాయల కష్టానికిపోతే మూడురోజులు జ్వరంతోపడి లేవవు. ఆ మూడు రోజులూ తిరిగి అడుక్కోవలసిందే! అయినా ఈ దేశంలో తిండిలేక అడుక్కునేవాడికి ఎవడూ కూడు పెట్టడుభాయ్. ఇదిగో చూడు, ఈ సాధూవేషం

వేస్తే, ధనవంతులు కూడా నమస్కారంపెట్టి పైసలు రాలుస్తారు. వేషానికి ఇచ్చే విలువను మనవాళ్ళు కష్టానికి ఇవ్వరయ్యా! అందువల్లనయినా మనకు ఈ వేషాలేగతి''

నారాయణ మాటల్లో సత్యం ఉందనిపించింది గురుముఖ్‌కు. చిలుం గొట్టం వేడితగ్గడంతో, బూడిద విదిలించి గొట్టాన్ని జోలెలోనికి తోశాడు. వారిముందున్న మంటతగ్గడంతో మరి రెండు పుల్లలు అగ్గిమీద వేశాడు.

''ఒకనాడు మనతోపాటే బతికాడు బాబా! ఈనాడు చూడు ఆ వైభవం దర్జా, డాంబికం! అబ్బో! మనం కలలోనైనా అనుకున్నామా? పోనీ అంటే ఆయనకూడా అనుకొని ఉండని సంఘటన ఇది! మనమూ రేపు ఆ స్థాయికి రావడానికే ఈ ప్రయత్నం. ఒక్కసారి ఆ స్థాయికి ఎదిగామా? ఇక జీవితమంతా పడతుల సేవా, పట్టెమంచపు పాన్పులేననుకో!''

''అంతే! అంతే!'' అన్నాడు సదానంద్ నారాయణ మాటలకు. నారాయణ తెలివితేటలు తమకు లేవని గురుముఖ్ ఒప్పుకుంటాడు. ఒకనాడు బాబాకూడా తమలాగే తిరిగాడు. అతడి తెలివితేటలతో ఈ రోజు ఉచ్ఛదశకు చేరాడు. రేపు నారాయణకూడా ఆ తెలివితేటలతో పైకిరావచ్చు. అప్పుడు ఈరోజు బాబాకు చేసే సేవ రేపు నారాయణకూ చేయవలసి రావచ్చు. ముందుగానే నారాయణను కాకాపట్టడంద్వారా మరికొంత ఆదాయం సంపాదించవచ్చు.

ఆ ముగ్గురూ యాభైసంవత్సరాలు పైబడినవారే. ముగ్గురూ కాషాయాంబరధారులే! ముగ్గురూ ఒకే జాతికి చెందినవారే. ఏదోవిధంగా పిల్లల్ని మాయచేసి తీసుకురావడం, కావల్సిన వారికి ఇచ్చి తమకు రావల్సింది తీసుకుని వెళ్లడం వారి పని. ఆ పిల్లల్ని వాళ్లు ఏంచేసినా వీరికి అభ్యంతరం లేదు. ఎందుకు తెమ్మంటున్నారో అడగరు. రేపు వాళ్లు ఏమయిందీ తెలిసినా అది వారి పూర్వజన్మ ఖర్మ అని వీళ్లు సరిపెట్టుకుంటారు.

ఉదయ కిరణాలు సత్రంలో ప్రవేశిస్తూనే ముగ్గురూ దుప్పట్లు తీసి మడతపెట్టి, ఎవరి జోలెల్లో వారి దుప్పట్లు తోసేశారు. బయటకువచ్చి వేపపుల్లలు తీసుకుని పళ్లురుద్దుకున్నారు. ముఖాలు కడిగి ఎవరి జోలె వాళ్లు తగిలించుకుని దగ్గరలోని కాకా హోటల్‌కు వచ్చారు. చలికి జనం ఇంకా పెద్దగా అటు రావడంలేదు. ఫలహారంచేసి, టీ సేవించేసరికి వారి శరీరాలకు వేడి వచ్చింది. బీడీలు అంటించుకుని రోడ్డుమీద నడకసాగించారు.

మందిరం ప్రాంతం వచ్చేసరికి ఇంకా వెంకటేశ్వర సుప్రభాతం వినిపిస్తూనే ఉంది. ఆ ప్రాంతాలలో భక్తితో వచ్చిన అతికొద్దిమందే ఉంటారుగనుక ఆ చలిలో ఎవరూ ఇంకా బయటకు రాలేదు. ముగ్గురూ విడిదిగృహం దగ్గరకు వచ్చి వరండాలో కూర్చున్నారు.

వీరిని చూసి కావలామనిషి దగ్గరగావచ్చి అనుమానంగా చూశాడు.

''భయపడకు, పగలు దొంగతనానికి ఎవరూ రారులే! మేం దొంగలంకాదు'' అన్నాడు నారాయణ. మిగిలిన ఇద్దరూ నవ్వి గడ్డాలు దువ్వుకున్నారు.

''ఎవరు కావాలి?'' అన్నాడు కావలామనిషి అనుమానంగానే చూస్తూ.

''ఈ వేషగాళ్లకు రంభలెందుకయ్యా! బాబాగారి సేవకే వచ్చాం!''

కావలా అతను తల ఊపి అక్కడినుండి ఆఫీసువైపు వెళ్లాడు.

''అవధూత ఇంకా లేవలేదేమిటి?'' అన్నాడు గురుముఖ్.

''వాడో కోతివెధవ! మనల్ని అడ్డుపెట్టుకుని వాడు బాగుపడుతున్నాడు. ఎప్పుడో లేచి, పూజలు చేస్తూ ఇంట్లో వేడివేడిగా తినిపడుంటాడు. అయినా నాకు తెలియక అడుగుతాను. ఈ చదువుకున్నవాళ్లు ఎందుకిట్లా తయారయ్యారంటావ్?'' అన్నాడు సదానంద్ కోపం జేవురించిన ముఖంతో తుపుక్కున ఉమ్మివేస్తూ.

''భయ్యా! ఈ దేశంలో జరిగే ప్రతి ఘోరంవెనుకా ఎవడో ఒకడు చదువుకున్నవాడే ఉంటాడు. వాళ్లకున్న మూఢభక్తి నక్కవినయమూ, కుక్కమొరుగుడూ అమాయక జనానికి ఎన్నడూ ఉండదుగదా?''

ఇంతలో అటే వస్తున్న అవధూతను చూసి, ముఖభంగిమలు మార్చి లేచి నిల్చున్నారు.

ముగ్గుర్నీ పరిశీలనగా చూసి నవ్వి "ఎప్పు డొచ్చారు?" అన్నాడు అవధూత.

"వచ్చింది రాత్రికే! అయితే ఏం? టౌను సత్రంలో చలికి చచ్చి, తిరిగి బతికి ఇలా వచ్చేశాం ఇక్కడకు" అన్నాడు నారాయణ అభినయిస్తూ.

"రాత్రికే ఇక్కడకు రాకపోయారా? సుఖంగా ఉండేవాళ్లుకదా!"

"రావాలనుకున్నాం! రాత్రిపూట వల్లెప్రాంతాలలో తిరగడం అనుమానాలకు తావిస్తుందని రాలేదు."

"సరే! సరే! తర్వాత ఆఫీసులో కలవండి" అంటూ ముందుకు సాగాడు అవధూత. వెనుక నుండి కాండ్రించి ఉమ్మివేశాడు నారాయణ కోపంగా.

మరో గంటతర్వాత ముగ్గురూ ఆఫీసుకు వెళ్లేసరికి అపాటికే వచ్చిన అవధూత కుర్చీలో కూర్చున్నాడు. ముగ్గురూ ఎదురుగా కూర్చున్నారు.

"ఏమిటి సమాచారం?"

"ఏముంది? డబ్బులు చాలడంలేదు. వాటి కోసం వచ్చాము. పైగా పనిలేదు ఈమధ్య! ఏదయినా పనికూడా చూసుకుందామని కూడా వచ్చాము."

"నారాయణా! నీ సమాచారమేమిటి?"

"మొన్న తెచ్చిన పిల్లవాడి డబ్బు ఇంకా చేరలేదు, దానికొరకు వచ్చాను."

" ఆ డబ్బు నీ స్నేహితుడు అప్పుడే తీసుకెళ్లాడుగదా! నీకు అందలేదా?"

అనుమానంగా చూశాడు నారాయణ అవధూతవైపు. ఆ డబ్బు వీడు కాజేయడానికి ఎత్తువేస్తున్నాడా? అనుకున్నాడు. ఆ విధంగా వీడు చేయాలేగానీ ఎత్తుకెళ్లి కాళీమాతకు బలి పెట్టనూ! అనుకున్నాడు.

"నాకు చేరలేదు. అయినా నా డబ్బు నాకు ఇవ్వక మరొకరికి ఇస్తే ఎట్లా? ఇట్లాఅయితే వ్యాపారాలేం సాగుతాయి?" తీక్షణంగా అన్నాడు.

అవధూత దగ్గరకు వచ్చేవారిలో నారాయణ అంటేనే అతనికి ఎక్కువ భయం. భయంకరమైన కోపిష్టి! కొట్టడానికి కూడా వెనుదీయడు. చెప్పిన పని కూడా తప్పకుండా చేయగల సామర్థ్యంగల మనిషి!

"సరే! సరే! వాడెక్కడికి వెళ్తాడు?" అన్నాడు అవధూత.

"మీతో పనుండి పిలిపించాను గురుముఖ్" అన్నాడు అతడివైపు తిరిగి.

"చెప్పండి, బాబాగారి సేవలో గురుముఖ్ ఎప్పుడూ ముందుంటాడు"

"మంచిదే! ఒక వ్యక్తికి పదిమంది పిల్లలు కావాలి. అందరూ ఐదూ, పది సంవత్సరాల లోపు పిల్లలు, ఈ నెల చివరిలోగా అవసరమని కబురుపెట్టాడు. మీరు ఇద్దరూ అందుకోసం శ్రమించాలి"

"శ్రమించడానికి మాకు అభ్యంతరం లేదు గానీ, రేటు గిట్టుబాటు కాకుండా ఇస్తున్నారు. మేం దొరికామంటే ఉప్పులోకి కండ లేకుండా చంపేస్తారు. అయినా ప్రాణానికి తెగించి ఇంత పని చేస్తే మనిషికి ఐదొందలయితే ఎట్లా? కనీసం ఏడు వందలన్నా ఇవ్వాలి"

అవధూత నవ్వుకున్నాడు. "సరే! అలాగే చేద్దాం! ఇందులో మాకు మిగిలిచచ్చేదేముంది? మీ సేవ కొరకే మేమూ శ్రమపడుతున్నాం"

"ఆఁ నిజమేమరి! మా సేవకు మాత్రం కాదు, మా చావుకు మాత్రమే!" నారాయణ మాటలకు నవ్వాడు సదానంద్.

"నారాయణా నీవు మరో మంచిపని చేయాలి. అందులో ఈసారి మరింత ఎక్కువ ఆదాయం రావచ్చు. మరో బలిపశువు కావాలి"

నారాయణ కనుబొమలు ముడిచాడు. "నీ ధర నాకు గిట్టుబాటు కాదు. మరొకరికి అమ్ముకున్నా వెయ్యి రూపాయలు ఇస్తారు" తీక్షణంగా అన్నాడు.

"రేటు పెంచమని బాబాగారు ఆదేశించారు. ఏడు వందల వరకూ ఈసారి నీకు వస్తుంది" అవధూత మాటలకు నారాయణ మెత్తబడి నాలుక చప్పరించి తల ఊపాడు. తన జీవితమంతా సంపాదించినా ఏడు వందల రూపాయలు వెనకేయటం సాధ్యం కాదు. ఇది రెండుమూడు రోజుల్లో సంపాదించవచ్చు.

గురుముఖ్, సదానంద్ బీడీలు వెలిగించారు. ఒక దమ్ములాగి "మరి మాకు కొంత డబ్బు ఇప్పించండి అవధూతగారూ. తొందరలోనే మీకు పిల్లలను అప్పగించగలం" అన్నారు ఇద్దరూ.

టేబుల్ సొరుగు లాగి ఇరవై పది రూపాయల కాగితాలు లెక్కపెట్టి తీశాడు. చెరి పది కాగితాలూ అందించి "ఎంత తొందరలో మీరు పని పూర్తిచేస్తే అంత తొందరలో మీకు మరో మంచి అవకాశం ఇప్పిస్తాను. బాబాగార్కి మీరంటే ఎంతో ప్రీతి. మీమీద ఆయనకు అపారమైన అభిమానం ఉంది" అన్నాడు అవధూత.

ఇద్దరూ సంతోషంతో ఉబ్బిపోయారు. ఈసారి మనిషికి ఏడొందలయినా రాబట్టుకోవచ్చు. నీతిగా డబ్బు రాబట్టడం ఈ దేశంలోనే ఎవరికీ సాధ్యం కాదని నిర్ణయించుకున్న వ్యక్తులు వాళ్ళు. తాము చేసేది అవినీతి అని వాళ్ళు ఒప్పుకోరు. ఏదోఒకవిధంగా మనిషి సంపాదించాలి. తాము సంపాదించే పద్ధతి ఇదేనని వారి ఉద్దేశం. నీతిగా బ్రతకడమంటే అసలు సంపాదించడం చేతగానివాడు మాట్లాడే మాట.

ఇద్దరూ జోలెలు సర్దుకుంటూ "బాబాగారితో ఒకసారి మాట్లాడాలి, అవకాశం ఇస్తారా?" అన్నారు.

"అవధూత అడ్డంగా తలవూపాడు.

"ఇప్పుడు ఆయన దీర్ఘ మౌనముద్రలో ఉంటారు. ఆయనను ఇప్పుడు లేపడమంటే నెత్తిన కొరివి పెట్టుకోవడమే"

'మౌనముద్రా, వాడి తలకాయా?' అనుకున్నాడు గురుముఖ్. 'ఓయ్ అవధూతా! వాడిని గురించి మాకే టోపీ వేస్తున్నావా? అరుగో అమాయకజనం! వారి నెత్తిన టోపీ పెట్టు, పెట్టించుకుంటారు. వాడు ఈపాటికి యవ్వనపు పొంగులోని ఆడపిల్లల కౌగిట్లో పడుకొని వుంటాడని మాకు తెలియదా?' అనుకున్నాడు గానీ పైకి ఆ మాట అనలేదు. అంటే వచ్చే అవకాశం దూరమవుతుందని అతడి భయం. రేపు తామూ ఆ స్థాయికి చేరుకోవచ్చు. తామైనా రేపు చేసే పని ఇంతేకదా?

ఇద్దరూ ఆఫీసునుండి బయటకు సాగారు. వాళ్ళు వెళ్లినతరువాత నారాయణ వైపు చూస్తూ "రెండు రోజుల్లో మంచి బలిపశువుని తేవాలి. ఆ తర్వాత నీతో ప్రత్యేకంగా బాబాగారు మాట్లాడతారట! మంచి అవకాశం ఉంటుంది నీకు" అన్నాడు అవధూత.

ప్రత్యేకంగా బాబాగారు మాట్లాడటమంటే పంట పండుతుందని ఆశపడుతున్నాడు నారాయణ. ఏదోవిధంగా సరాసరి బాబాతోనే సంబంధం పెట్టుకుంటే తాను బాగుపడతాడు. అవధూత అడ్డం ఉన్నంతవరకూ తనకు న్యాయంగా అందవలసింది అందదు.

"తప్పకుండా రెండు రోజుల్లోనే ఏర్పాటుచేస్తాను. ఈ టౌనులోనే ప్రయత్నం చేసిసాధిస్తాను. మిగిలినవారిని నాకు సహాయంగా ఉండమను"

"తప్పకుండా ఉంటారు. నీకు ఎప్పుడు అవసరమైనా, ఎక్కడికయినా మన సంఘసేవకులు సిద్ధంగా వస్తారు" అన్నాడు అవధూత. పది రూపాయల నోట్లు ఇరవై తీసి అతడి చేతికి అందించాడు. డబ్బు మడిచి చేతిగుడ్డలో చుట్టాడు. ఆ చుట్టను జోలెలోపలకు తోశాడు. జోలె సవరించుకుని లేచి "రాం రాం" అన్నాడు. అవధూత కూడా లేచి 'రాంరాం' అన్నాడు చేతులు జోడించి.

నారాయణ అటువెళ్తూనే ఊపిరివదిలాడు అవధూత! బయటకువచ్చి తలుపుదగ్గరగా లాగాడు. బాబామందిరంవైపు సాగాడు. తలుపువద్దే సేవిక కన్పించి చిరునవ్వునవ్వింది "రండి బాబాగారు మీకొరకే ఎదురుచూస్తున్నారు"

లోపలకు వెళ్ళాడు అవధూత! బాబా కనుసైగతో అక్కడున్న నలుగురు సేవికలు లోపలకు వెళ్ళారు తలుపులు బిగించి!

"నారాయణ, గురుముఖ్, సదానంద్ వచ్చి వెళ్ళారు" వివరాలు చెప్పాడు. బాబా తలూపాడు. చిరునవ్వునవ్వి గడ్డం ఎడమచేత దువ్వుకున్నాడు. రెండు నిముషాలు ఆలోచించి, "నరశింహారావు ఇంకా రాలేదా?" అన్నాడు.

"ఈరోజు తప్పకుండా వస్తాడు. అతడికొరకు బలిపశువు కావాలన్నారు మీరు! నారాయణతో తర్వాత ఏర్పాటు చేయిద్దామనుకున్నాను"

"ఇంకా నిర్ణయంకాలేదు; వాడు ఆశకు

దిగినప్పుడేగదా అవసరం! వాడు ఇంకా నిర్ణయాలలోనే ఉన్నాడు. అయినా తప్పకుండా నిర్ణయించుకుంటాడు''

''ఏమిటి అతడి అవసరం?''

''వాళ్ల ఇంటిపెరట్లో నిక్షేపం ఉందట. దాన్ని సాధించాలంటే నరబలిపెట్టాలని, శిలాఫలకం రాయబడి ఉందట! నరబలి ఇవ్వాలంటే సంకోచిస్తున్నాడు. అంతే! వాడి మనోధైర్యంకొరకు హితబోధ చేస్తున్నాను. ఆ ధైర్యం దొరుకుతూనే ముహూర్తంవాడే అడుగుతాడు'' చిరునవ్వునవ్వాడు బాబా ప్రశాంతంగా.

అవధూత మాట్లాడలేదు. పాలరాతిమీద పరచిన పట్టుదుప్పట్లను పరిశీలిస్తూ బాబా స్థాయి తాను ఎప్పుడు అందుకోగలడో ఆలోచిస్తున్నాడు.

అతడి ఆలోచనలు గ్రహించినట్లు ''నాతర్వాత స్థానంనీదే అవధూత్! ప్రజలు వెర్రివెధవలు; వెంగళప్పలు; పరమమూర్ఖులు ; ఛాందసులు! వారిని ఆకట్టుకుంటే మనం ఎన్నిఘోరాలుచేసినా జనం నమ్మరు. జనం తలుచుకుంటే కుక్కను దేవుడుగా కొలుస్తారు. అయితే ఆ హితబోధ వారి మెదడుకు ఎక్కించడమే ముందు చేయవలసింది. అది ఎక్కిందా? ఇక ఎన్ని వ్యతిరేకాలు చెప్పినా నమ్మరు. వ్యతిరేకంగా చెప్పినవారిమీదనే దాడి చేస్తారు''

అవధూతకూ ఆవిషయం తెలుసు. అందుకే ఎంతో అక్రమంగా, పసిపిల్లల రక్తపుడబ్బుతో సంపాదించిన డబ్బుతో బాబా అక్కడ ఆ మందిరాలు నిర్మించాడనీ, ప్రజల దైవభక్తి కొరకుగాక, తనరక్షణకూ, ప్రజలలో తాను దైవాంశసంభూతుడుగా గుర్తుండడానికే ఆఏర్పాట్లు చేసుకున్నాడనీ, ప్రజల విశ్వాసం సంపాదించుకుంటే, తర్వాత తనమీద ఎన్ని అభాండాలు వచ్చినా ఏమీచేయవనీ బాబా ఈప్రయత్నాలూ, పెద్దలతో స్నేహాలూ, ఆహ్వానాలూ, ఉత్సవాలూ ఏర్పాటుచేశాడని అవధూతకు తెలుసు. బయటతిరిగే ఏనుగుకంటే, ముసుగులోఉండే ఎలుకకే ఎక్కువ గౌరవం అన్నట్లు బయటపడకుండా దాచిపెట్టుకున్నంతవరకూ, దైవాంశసంభూతుడుగా భావించి, చిలవలూపలవలూ అల్లి నిజంగానే దేవుడిగా చేసి జనం పూజిస్తారనికూడా తెలుసు. ఆ అలవాట్లు నేర్చుకొని, తనో ప్రవక్త కావాలనే అవధూత ఆలోచనలు! అందుకే ఇక్కడ బాబా శిష్యరికం చేస్తున్నాడు. బాబాకు తెలుసు. అవధూత ఏనాడైనా తనకు అడ్డం నిలబడి ముంచగలడని! అందుకే అతడిని తొలగించి, ఏమీతెలియని అజ్ఞాని నరశింహారావును తన ముఖ్య శిష్యుడిగా చేసుకోవాలని ఆలోచిస్తున్నాడు. అతడి ఆలోచన రూపుదాల్చడానికే నరశింహారావును రప్పిస్తున్నాడు.

మధ్యాహ్నం నరశింహారావు బాబాదగ్గరకు వచ్చాడు. బాబాముందు సాష్టాంగపడి ఆయన పాదధూళి నొసటపెట్టుకున్నారు. బాబా అతడిని ఆశీర్వదించాడు.

''నరశింహారావ్! నీతో పనిపడింది. స్వామి భక్తి చూపించడానికి ఇదేతరుణం! నీవుచూపే స్వామిభక్తిని బట్టి రేపు నీ అదృష్టజాతకం మారుతుంది''.

''చెప్పండి బాబాజీ! మీరేంచెప్పినా, ఈ సేవకుడు ఆజ్ఞపాలించే దానికి సిద్ధంగా ఉన్నాడు'' అన్నాడు చేతులుకట్టుకుని కూర్చుంటూ.

''నీయింట్లో ధనరాశులు నీవశం చేసుకోవాలన్న కోరిక ఉందా?''

''తప్పకుండా స్వామీ! ఎవరికిమాత్రం ఉండదు సంపదమీద వ్యామోహం?''

''నరబలి పెట్టడంద్వారానే అది సాధ్యమవుతుందని రాసిపెట్టి ఉందా?''

తలూపాడు నరశింహారావు. ''నిజమే! కానీ, మనిషిని అందుకొరకు చంపాలంటే నాకు మనసు ఒప్పడంలేదు బాబాజీ!''

అపుడు భగవద్గీతలోని శ్రీకృష్ణుని బోధనలు వినిపించడం ఆరంభించాడు బాబా! చంపేది నేను, చచ్చేదినేను. ఇందుకు ఎవరి బాధ్యతా ఏమీలేదు.

సాయంత్రందాకా ఆబోధనలు విన్నతరువాత 'నిజమే! అన్నింటికీ ఆదేవుడే కారకుడయితే నాప్రసక్తి ఏమిటి?' అనుకున్నాడు. అయినా ఇంకా అతడిమనస్సు పీకుతోంది. తాను సంపాదించేది పాపపుసొమ్మే! ఆపాపం పోగట్టుకోడానికే బాబా పంచ చేరాడు. ఇక్కడ మరింత పాపపుపద్ధతిలో డబ్బు సంపాదిస్తున్నాడు. అయినా మనిషిని బలిపెట్టడానికి సుము

ఖంగా లేదు. ఇప్పుడు దానికీ సిద్ధపడదలచుకున్నాడు.

"ఎలాచేద్దామో చెప్పండి స్వామీజీ! మీరు చెప్పినట్లు చేస్తాను"

"మంచిది, మంచిది!" అన్నాడు బాబా "నామాటమీద విలువ ఉంచినందుకు నీకు శుభం కలుగుతుంది. ఆ ఆస్తికొరకు నీవు ప్రయత్నంచేసేలోగా మరి కొన్నిపనులు చేయాలి"

"తప్పకుండా!" అన్నాడు బాబాచెప్పే ఆవనులకొరకు ఎదురుచూస్తూ.

★ ★ ★

నారాయణ చంకకు జోలె తగిలించుకొని మూడు రోజులు టౌను మొత్తం తిరిగాడు. తను సంపాదించదలచుకున్న బాలుడిని ఏ ప్రాంతంలో ఏ విధంగా పట్టాలో ఒక ప్లాను తయారుచేసుకున్నాడు. అంకమ్మగుడివద్ద ఉదయం నుండి మకాం వేశాడు.

ఆ బజారులో జనం పెద్దగా తిరుగరు. అసలే అది టౌనుకు కొంత ఎడంగా ఉంటుంది. దానికితోడు ఆ ఏరియాలో ఇళ్ళు కూడా అతి కొద్దిగా ఉన్నాయి. ఆ ఏరియా నుండి కాన్వెంటుకు, హైస్కూళ్లకు పిల్లలు వస్తుంటారు. వారిలో ఒకరిని కాజేయాలి.

నారాయణ ఒకప్పుడు బాగా వెలిగిన వ్యక్తి. ఏ ఏరియాలోనైనా ఇటువంటి రౌడీలకు ఎప్పుడూ గిరాకీగానే ఉంటుంది. ఒక వ్యక్తిని హత్య చేయగలవాడికీ, అనుపానులు సేకరించి అందించగలవాడికీ వేల మొత్తం మీద ఇస్తారు. ఆ విధంగానే అతడూ బ్రతుకుతున్నాడు. అతడి 'ఖర్మ'గాలి అనేకసార్లు దొరికి చావుదెబ్బలు తిన్నాడు. భార్యాబిడ్డల్ని తన్ని ఊరు నుండి పంపించారు జనం! వాళ్ళేమైపోయారో అతడికి తెలియదు. జీవితం మీద తాత్కాలికంగా విరక్తి కలుగడంతో సన్యాసం తీసుకుంటున్నట్లు తనకుతానే ప్రకటించుకుని, కాషాయగుడ్డలు తొడగడం ఆరంభించాడు. ఏ సీసాలో పోసినా సారాయి సారాయే అన్న సామెతలా ఏ గుడ్డలు తొడిగితే ఏం అతని సహజగుణం అతడిదే! ఎవరయినా తిండిపెట్టకపోతే బూతులు లంకించుకునేవాడు. అడుక్కోవడం కూడా నామోషీగా తోచింది. అదీగాక ఆ సంపాదన సారాయికి, గంజాయికీ చాలడంలేదు. తాను అడుక్కోవడమేగాక, తన లాంటి బిక్షగాళ్ళ దగ్గర కూడా గంజాయికి బిక్షమెత్తవలసివచ్చింది. ఇదీ లాభంలేదనుకుంటున్న తరుణంలో ఆపద్బాంధవుడిలా అవధూత కన్పించాడు. తనకు అతడు ఏ సహాయం చేయాలో, తాను అందుకు ప్రతిఫలం ఏమిస్తాడో విన్న తర్వాత నారాయణ గుండె ఆనందంతో కొట్టుకుంది. నెలకు ఐదు వందలకు పైగా రాబడి! అది కూడా అన్ని ఖర్చులూ భరించివచ్చే రాబడి! అవకాశం వస్తే విడిచిపెట్టడమెందుకు? కాకపోతే కొంత రిస్క్! అయాచితంగా డబ్బులు కావాలనుకున్నప్పుడు ఇదో పెద్దపనిగా అతడు ఆలోచించలేదు. దేశంలో పది రూపాయలకు పది హత్యలు చేయడానికైనా వెనుతీయని 'వీరులు' ఉండగా, ఐదు వందల కొరకు ఒకడిని పట్టుకోవడంలో తప్పులేదు. పైగా తన చేతుల్తో వాళ్ళని ఏమీచేయడంలేదుగదా! చాటున ఎవరో ఏదో చేసుకుంటే నాకేం!" అనుకున్నాడు. అంకమ్మగుడి వద్ద రెండు రోజులు కూర్చున్నాడు. ప్రతిరోజు క్రమం తప్పకుండా ఎవరెవరు వస్తున్నారు? ఎందరు కలిసివస్తున్నారు. వారిలో చలాకీ పిల్లలెవరు? మందబుద్ధులెవరు? అన్నది ఉజ్జాయింపుగా నిర్ణయించుకుంటున్నాడు. చలాకీ పిల్లలయితే వాళ్ళు పారిపోతే తాను వెంటబడి పట్టుకోవడం సాధ్యం కాదు. పెద్ద పిల్లలయితే తిరుగబడవచ్చు. అందువల్ల. మందబుద్ధులవైపు దృష్టిసారించాడు. ఓ నిర్ణయం తీసుకున్న తరువాత నరశింహారావు వద్దకు వచ్చాడు.

"ఎలా ఉంది నీ పరిస్థితి" అన్నాడు నరశింహారావు.

నారాయణ చెప్పాడు "నేను నిర్ణయించుకున్నాను. పోతే నాకు దగ్గరలో కారుండాలి. పిల్లవాడిని మోసుకెళ్ళలేనుకదా! మీరు సిద్ధంగా ఆ ప్రాంతాలలో ఉంటే నా పని నేను చేసి, పిల్లవాడిని మీ కారు వద్దకు తేగలుగుతాను"

నరశింహారావు తల ఊపాడు. డ్రైవర్‌ను పిలిచి కారు పంపించాడు.

నారాయణ కారుకంటే ముందే గుడివద్ద చేరి కూర్చున్నాడు. ఈ నాలుగు రోజులుగా

తాను ఏ బాలుడినైతే పలుకరిస్తున్నాడో ఆ బాలుడి కొరకు ఉదయం నుండే ఎదురు చూస్తున్నాడు.

ఉదయం ఎనిమిది గంటలయింది. మరో అర్ధగంటలో ఆ పిల్లవాడు రావాలి. నారాయణ ఆతృతగా ఊపిరిపీలుస్తూ వదులుతున్నాడు. రోడ్డుమీదకే దృష్టిసారించి చూస్తున్నాడు. అతడు రాకుంటే తన ప్రయత్నం వృధాకావడమటుంచి, నరశింహారావుకు కారు ఖర్చులు అనవసరంగా పెట్టించానన్న కోపం తెప్పించినట్లవుతుంది.

నారాయణ కండ్లు మిలమిల మెరిశాయి. నాజూగ్గా మీసాలు దువ్వుకున్నాడు. చంకకు జోలె తగిలించుకుని గుడి విడిచి నెమ్మదిగా రోడ్డుమీదకు వచ్చాడు. చొక్కా, లాగు మాసిన ఎనిమిది సంవత్సరాల పిల్లవాడు, ఊడిపోతున్న లాగును పైకిలాక్కుంటూ, మోయలేనన్ని పుస్తకాల సంచి వీపుకు తగిలించుకుని చిన్నగా నడుస్తున్నాడు.

దగ్గరగా వస్తూనే ''ఇంత ఆలస్యం అయిందేమిటి బాబూ?'' అన్నాడు నారాయణ చిన్నగా నవ్వి.

ఆ బాలుడు కూడా ఆయాసంతో నవ్వాడు. ''ఇంటి దగ్గర అన్నంలేదు మరి! ఏం చేస్తాం? తినకుండా వస్తే స్కూలు దగ్గరకు అన్నం తెచ్చేవాళ్ళు లేరు'' అన్నాడు నారాయణ గడ్డం వైపు చూస్తూ.

''మీ నాన్న లేడా ఏమిటి?''

''లేదు స్వామీ! మా నాన్న చనిపోయాడు. మా అమ్మ ఒక్కతే ఉంది. ఆమె కూడా ఉదయం పనులు చేయడానికి వెళ్ళి ఎవరింట్లోనైనా చద్దన్నం తెస్తుంది. అది తిని బయలుదేరేసరికి ఈ వేళ అయింది''.

తాను ఎన్నుకోవడం సరిగా సరిపోయిందనుకున్నాడు. పూటకు గతిలేని స్త్రీ తన కొడుకు కొరకు ఏంవెతుకగలదు? డబ్బులు ఇవ్వకుంటే పోలీసులు ఇటువంటి ఫిర్యాదుల్ని చెత్తబుట్టలో కూడా వేయరు. చింపి, ముక్కలు గాలికి వదిలేస్తారు. ఏ చర్యా తీసుకోరు. ఇది మంచి కేసు. ఇటువంటి కేసులు ఓ నాలుగు తగిలితే, రెండుసంవత్సరాలు తింటూ హాయిగా త్రాగి కాలక్షేపం చేయవచ్చుననుకున్నాడు.

అతడి ఆలోచనల్ని త్రోసివేస్తున్నట్లు ''మీరెక్కడికి?'' అన్నాడు ఆ బాలుడు. నారాయణ గడ్డం నిమురుకున్నాడు. పిల్లవాడి వీపుమీద చెయ్యి వేసి నిమిరాడు. ''నేనూ అటే వస్తున్నాను. పద, వెళ్దాం'' అంటూ అడుగులు వేశాడు. అతడితో పిల్లవాడు పరుగులాంటి నడక సాగించాడు. ఎవరో ఒకరు సైకిళ్ళమీద వస్తూ పోతున్నారు. కాలినడకన కూడా ఒకరిద్దరు దూరంగా వస్తూ కన్పించారు. ఆయిల్‌మిల్లు మరికొంతదూరంలో ఉందనగా కారు వారి దగ్గరగా వచ్చింది. నారాయణను చూచిన కారుడ్రైవరు తల బయటకు పెట్టి, ''ఏమిటి స్వామీజీ?'' అన్నాడు. నారాయణ చెయ్యి విసరడంతో కారు మరికొంత ముందకు వెళ్ళి వెనుకకు తిరిగి వారి దగ్గరగా వచ్చింది. కారునూ, డ్రైవరునూ, నారాయణను పిల్లవాడు ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

''పద... పోదాం నిన్ను కారులో నీ స్కూలువద్ద దిగబెట్టి నా దారిన నేను పోతాను'' అన్నాడు నారాయణ.

ఆ పిల్లవాడికి భయంవేసింది. కారులో ఎక్కి ప్రయాణం చేయడమంటే అతడికి ఆశ్చర్యమే! తనలాంటి వారికి కార్లు ఎన్నడూ దొరకవని తల్లి చెప్పింది. ఈ బాబాకు మాత్రం కారు ఎక్కడిది? ఒకవేళ బాబాగారు దేవుడా? కాబట్టే కారుమీద తిరగగలుగుతున్నాడా? లేకుంటే పిల్లల్ని ఎత్తుకపోతున్నారని తనతోటి పిల్లలు భయంభయంగా చెబుతుంటే విన్నాడు. అప్పుడు అబద్ధం అనుకున్నాడు. ఈ బాబా తనను ఎత్తుకపోవడానికి ప్రయత్నిస్తున్నాడా? ఏమైనాసరే కారు ఎక్కడానికే నిశ్చయించుకున్నాడు.

నారాయణ పిల్లవానిని కారు ఎక్కించి, తానూ ఎక్కి, డోర్ మూసుకున్నాడు. కారు స్కూలు దాటుతుండగా పిల్లవాడు చూచి ''ఇక్కడ ఆపు!'' అంటూ అరిచాడు. ఆ మాట విననట్లే డ్రైవరు కారుతో ముందుకు సాగాడు.

''బాబాజీ! కారు ఆపమనండి. స్కూలు దాటిపోతున్నది'' అన్నాడు ఆదుర్దాగా! నారాయణ పిల్లవాడి వీపు నిమిరాడు. ''ఈ స్కూలు చదువులెందుకు? మరో స్కూలులో చదువుదు

వుగానీ, కూర్చో!'' అన్నాడు.

పిల్లవాడు ఏడుస్తూ అటూఇటూ చూస్తున్నాడు గింజుకుంటూ.

కారు ఒక యింటి ప్రహరీ లోపలకు వెళ్ళి ఆగింది. గూర్కా గేటు తలుపు బిగించాడు. నారాయణ పిల్లవాడిని చెయ్యి పట్టుకుని కారు నుండి దింపాడు. పిల్లవాడు ఏడుస్తూ ''నేను ఇంటికి వెళ్లిపోతాను'' అంటూ గింజుకోవడం సాగించాడు. నారాయణ పిల్లవాడిని గదిమి లోపలకు లాక్కొచ్చాడు.

హాలులో అవధూత ఠీవిగా కూర్చుని ఉన్నాడు. నారాయణను చూచి నవ్వి ''మొత్తానికి సాధించావు!'' అన్నాడు. పిల్లవాడు ఏడుస్తూ అతడి ఎదురుగా నిలబడ్డాడు.

''నారాయణ తలచుకుంటే కాని వనే ముంది అవధూత్‌జీ! ఇదో బ్రహ్మవిద్యా ఏమిటి?'' అన్నాడు గడ్డం దువ్వుకుంటూ. కారు డ్రైవరు వెళ్లిపోయాడు.

''పిల్లాడిని లోపలకు తీసుకెళ్ళు!''.

తల ఊపి, నారాయణ పిల్లవాడి చెయ్యి పుచ్చుకుని బరబర లోపలకు లాక్కెళ్లాడు. మరో గదిలో తల దువ్వుకుంటూ కూర్చున్న ఒకావిడ వద్దకు తీసుకెళ్ళి ''అవధూతగారు నీకు అప్పగించమన్నారు'' అన్నాడు ఆమె యవ్వనపు పొంగులు చూస్తూ.

అతడి చూపు నుండి తప్పించుకుని, చీర చెంగు కప్పుకుంటూ ''ఎక్కడ దొరికాడు?'' అందామె.

''చెత్తబుట్టలో దొరికాడు; నీకెందుకా సొద! నీవని నువ్వు చెయ్యి!'' అన్నాడు కఠినంగా

ఆమె కిలకిల నవ్వింది. ''స్వాముల వారికి ఈరోజు కోపంగా ఉంది; కారణం తెలుసుకోవచ్చా?'' అంది.

ఆమె నవ్వు అతడి గుండెలో కోరిక లేపింది. నాలుకతో పెదాలు తడిచేసుకుని, గడ్డం దువ్వుకున్నాడు. ''అదికాదు భామా! మా పనుల్ని ప్రశ్నించకూడదని నీకు తెలుసుగా! అలా అడిగితే నాకు కోపం వస్తుందిమరి!'' అన్నాడు నెమ్మదిగా ఆమెవద్దకు జరుగుతూ.

''మీ సరసాలు తర్వాత చూద్దాం? ముందు పిల్లవాడిని లోపల విడిచి వస్తాను'' అంటూ చెయ్యి పట్టుకుని తీసుకెళ్ళింది.

''ఏం పేరు బాబూ?'' అంది వంగి పిల్లవాడి ముఖంలోనికి చూస్తూ.

''నాపేరు రమేష్?'' అన్నాడు కళ్లనీళ్ళు తుడుచుకుంటూ. ''మా అమ్మ దగ్గరకు వెళ్తాను. మా అమ్మ నాకొరకు ఏడుస్తుంటుంది'' అన్నాడు.

''తప్పకుండా మీఅమ్మ వద్దకు పంపుతాగా! నీకేం భయంలేదు. రేపు సాయంత్రం నిన్ను మీఅమ్మ దగ్గర నేను దిగవిడిచి వస్తాను.''

''అమ్మో! రేపు రాత్రిదాకా నేను ఇక్కడ ఉంటే మా అమ్మ అక్కడ నాకొరకు ఏడుస్తూ వెతుకుతూ ఉంటుంది మా అమ్మకు నేను ఒక్కడినే కొడుకును''.

''అయితే ఈరోజే నిన్ను తీసుకెళ్తాగా?'' అంది బుజ్జగిస్తూ వంటింటిలోకి తెచ్చింది. కాఫీ కలిపి గ్లాసు చేతికి ఇచ్చింది. గ్లాసువైపూ ఆమెవైపూ చూస్తున్నాడేగానీ త్రాగడం లేదు.

''ఏం? నా ముఖం చూస్తున్నావు? కాఫీ త్రాగు, నీకేం భయంలేదు, నేనున్నాగా?'' అంది. రమేష్ త్రాగలేదు, కళ్ళ వెంట నీళ్ళు కారడం లేదుగానీ, ముఖంలో భయం గూడుకట్టుకొని ఉంది. ఆ వాతావరణంలో అతడు ఎప్పుడూ తిరగ లేదు. అన్ని వసతులూ అధునాతనంగానే ఉన్నాయి. గోడలకు, క్రిందా పరచిన నిగనిగమెరుస్తున్న పాలరాళ్లవైపే చూస్తూ నిలుచున్నాడు.

''తర్వాత త్రాగుతావా?'' అంది. రమేష్ తలఊపాడు. గ్లాసు చేతి నుంచి లాక్కుని అల్మారాలో పెట్టి లేచింది. రమేష్ చెయ్యి పట్టుకుని, మరో గది దగ్గరకు నడిచింది.

ఆ గదిలో ఇద్దరు పిల్లలు, ఒక ముసలమ్మ కూర్చుని ఉన్నారు. ముసలమ్మ చుట్టూ ఇద్దరు పిల్లలు కూర్చుని ఏదో అడుగుతున్నారు. ముసలమ్మ సమాధానం చెబుతున్నది నవ్వుతూ. వారి దగ్గరకు వెళ్ళి ''మీకు మరో స్నేహితుడిని తెచ్చాన్రా పిల్లల్లారా!'' అంది భామ నవ్వుతూ. ముసలమ్మ వ్యాకులవదనంతో ఆ పిల్లవాడి వైపు చూసింది. ''వీడెక్కడ దొరికాడు, దురదృష్టవంతుడు'' అంది చిన్నగా.

''నువ్వు నోరు ముయ్యవే ముసలి ఒగ్గూ!

తేరగా వచ్చిన తిండి తినడానికి చేదుగా ఉందా ఏమిటి? ఎప్పుడూ కుక్కలా ఏదో ఒకదాన్ని చూసి మొరుగుతూ ఉంటావు?'' అంది కోపంగా.

''నేనేమన్నానమ్మా! అయినా ఈ పిల్లలు ఇక్కడ ఒంటరిగా ఉండలేక బాధపడుతున్నారని నా బాధ! వారినెందుకు తెచ్చారో అందుకు ఉపయోగిస్తే సరిపోతుందిగదా?'' అంది అనునయంగా.

''నీ బోడినలహాలు వినడానికి పైన ఎవరూ లేరులే! నోరు మూసుకుని పడి ఉండు. అతిగా నీల్గావంటే స్వాములవారు నీపని పూర్తిచేస్తారు''.

ముసలమ్మ మరి మాట్లాడలేదు. పిల్లవాడి చెయ్యి పట్టి ఒళ్లో కూర్చుండబెట్టుకుంది. పిల్లవాడి గడ్డం నిమిరి ''ఏం చదువుతున్నావ్ బాబూ?'' అంది.

''మూడు చదువుతున్నాను'' అన్నాడు రమేష్ మిగిలిన ఇద్దరి వైపూ చూస్తూ. వాళ్లెవరో అతడికి తెలియకపోవడంవల్ల, వాళ్ళు ఎందుకు వచ్చారోనని కుతూహలంగా చూస్తున్నాడు.

''మీ అమ్మానాన్నా ఉన్నారా?''

''మీ అమ్మానాన్నా ఉన్నారు'' అంది భామ వినవిసా అక్కడి నుండి బయటకు వస్తూ. ముసలమ్మను చూస్తుంటే అరికాలిమంట నెత్తికెక్కుతుంటుంది. ఆమె నీతులు వింటే, మరింత మండుకొస్తుంది. ఈ లోకంలో ప్రతి ఒక్కరూ తన అవసరం కొరకు, సుఖం కొరకు ఎవరికి నచ్చిన దారివాళ్ళు ఎన్నుకుంటున్నారు. అలాగే తనదారి తానూ ఎన్నుకుంది. ఈ శరీరం ఈరోజుంటుంది, రేపు నశిస్తుంది. ఆత్మ ఎప్పుడూ నశించదు. పాపపుణ్యాలు ఆత్మ చుట్టూ ప్రదక్షిణం చేయడం నిజమేనేమో? అయినా ఒక చిన్న పుణ్యం చేస్తే చాలు అంతవరకూ చేసిన పాపం పటాపంచలవుతుందని హిందూ వేదాలు ఘోషిస్తున్నాయి. పాపం చేసినట్లు పశ్చాత్తాపపడితే చాలు, వాడి పాపం నుండి విముక్తి పొంది పునర్జన్మ దొరుకుతుందని మతగ్రంథాలు ఉద్బోధిస్తున్నాయి. పాపం చేయనివాడు లేనేలేడు; కాబట్టి ప్రతివాడి పాపం క్షమించబడాలని ముస్లిం గ్రంథాలు బోధిస్తున్నాయి.

అంటే పాపంచేయనివాడు చివరకు దేవతలలో కూడా లేడని అర్థం. మరి దేవతలే ఆ విధంగా ఏడ్చి ఉంటే, ఇక మానవమాత్రుల విలువ ఎంత? అందులో తనలాంటి దిక్కూమొక్కూలేని ఆడదాని స్థాయిఎంత? ఎప్పుడో సుఖం కొరకు ఇప్పటినుండే పుణ్యం సంపాదించుకునేకంటే, చేతనైనంతవరకూ సుఖం, ఆనందం పొంది, చివరలో పశ్చాత్తాపపడితే పాపం పటాపంచలవుతుంది.

భామ ఆలోచిస్తూ హాలు ద్వారం దగ్గరకు వచ్చి తొంగిచూచింది. అవధూత కుషన్‌కుర్చీలో కూర్చుని గంజాయి లాగుతున్నాడు. నారాయణ తలవంచుకుని, చేతిలో గంజాయి ఆకువేసుకుని నలుస్తున్నాడు. చిన్నగా అడుగులువేస్తూ వారి దగ్గరగా వచ్చింది. అవధూత ఆమెవైపు చూశాడు అరమోడ్పు కండ్లతో ఏమిటన్నట్లు ఎగరేస్తూ!

''నారాయణస్వామీజీ మంచిపిల్లవాడిని సంపాదించారు'' అంది నవ్వి. అవధూత కుర్చీవెనుక నిలబడి నారాయణ కూడా నవ్వాడు. ఆమెది పొగడ్త కాదు, అవసరానికి వినియోగించుకోవడమని నారాయణకు తెలియదు. తమ అవసరాల కొరకు ఆమెను అక్కడ ఉంచానని అవధూత చెబుతుంటాడు. కాని భామ ఎవరి అవసరాలూ తీర్చినట్లు కనబడదు. అందరినీ బుజ్జగించి పంపుతూ ఉంటుంది. అవధూతను మాత్రమే సంతృప్తి పరచి, అతడిద్వారా వచ్చే ఆదాయాన్ని భద్రపరచుకుంటుంది. మిగిలినవారంతా పీలికలని ఆమెకు తెలుసు. నాలుగు డబ్బులు పడేస్తే కక్కుర్తిగా చుట్టూ తిరిగే వ్యక్తులు. అవధూత అలా కాదు. బాబా జుట్టు అతడి చేతిలో ఉంది. బాబా ఆస్తులు అతడి చేతిలో ఉన్నాయి. అందువల్లనే అవధూతను అంటకరుచుకుని తిరుగుతున్నది.

''నా డబ్బులు ఇప్పించండి; నేను వెళ్ళాలి'' అన్నాడు నారాయణ.

''ఎక్కడికి వెళ్తావు? ఉండవయ్యా, బయటకు వెళ్ళి చేసేదేమిటి?''

''ఎందుకులేవూ? చాలానే ఉన్నాయి.

డబ్బుచేతిలో ఉండాలికానీ, నాలాంటి వాడు చేయలేని పని ఏమిటయ్యా అవధూతగారూ! పేకాట ఆడవచ్చు, సారాయి త్రాగవచ్చు, వ్యభిచారపు కొంపలలో పడిపొర్లనూ వచ్చు, ఇంకా ఇంకా...''

''చాలులే నీ సొది'' అన్నాడు అవధూత. అతని కళ్ళు మూతలు పడుతున్నాయి. శరీరం మత్తులో తేలియాడుతోంది. భామకు తాళం చెవులు ఇచ్చి ''ఏడువందలు తెచ్చివ్వు!'' అన్నాడు. భామ తాళం చెవులు అందుకుని పైకెత్తి పట్టుకుని, విలాసంగా అటుఇటు ఊపి, బీరువాదగ్గరకు వెళ్ళింది. తాళంతీపి, తలుపు తెరచింది. నోట్లకట్టలు తళుక్కుమంటూ మెరిశాయి. ఆమె కళ్ళు జిగేలు మన్నాయి ఒక్కసారి. కళ్ళు టపటప కొట్టుకున్నాయి. అన్నీ వది రూపాయలనోట్లే! డెబ్బైనోట్లు లెక్కపెట్టి తీసి, తిరిగి తాళం వేసింది. మడతకూడా పడని సరికొత్త నోట్లవైపు చూసి సంతృప్తిగా ఊపిరిపీల్చి వదిలాడు నారాయణ. రెండువందలు అడ్వాన్సు ఇచ్చాడు, కానీ, అది, ఇందులో మినహాయించుకోలేదు. బహుశ మరచిపోయి ఉంటాడేమో? అనుకున్నాడు నారాయణ. లెక్కలలో ఇటువంటివి రాయరుగనుక తనకు ఇవ్వలేదని చెప్పవచ్చు. తనచేతికి డబ్బు వచ్చిన తర్వాత తిరిగి ఇచ్చేదేమిటి?

అవధూత అతడి ఆలోచనలు కనిపెట్టినట్లు నవ్వుకున్నాడు. అతడు కావాలనే రెండు వందలు ఎక్కువ ఇచ్చాడు. కుక్కకు మాంసం ముక్కవేస్తే అది ఎప్పుడో ఒకసారి తన విశ్వాసం చూపిస్తుంది. నారాయణ విషయం కూడా అంతే! లేకపోతే తెల్లకాగితాలకు విలువేమిటి?

నారాయణ నమస్కారం చేసి, భామవైపు చూసి చిరునవ్వు విసరి బయటకు సాగాడు. టీపాయ్ మీదున్న ఫోన్ చేతికి తీసుకున్నాడు అవధూత.

''ఎవరికి ఫోన్ చేస్తున్నారు?'' అంది భామ అతడివీపుపై వంగబడి. అవధూత పలుకలేదు. అవతలనుంచి కనెక్షన్ వస్తూనే బాబాకు అందించమని చెప్పాడు. బాబా పలికాడు ''ఏమిటి అవధూత విశేషాలు?''

''నారాయణ తన పని పూర్తిచేసి వస్తువు తెచ్చి ఇచ్చాడండి స్వామీజీ! అతడి డబ్బు అందుకొని వెళ్లిపోయాడు''

''మంచిది, మంచిది'' అన్నాడు బాబా. ''కష్టమర్ వచ్చాడా?''

''ఈరోజు సాయంత్రం వస్తాడు. అతడితో కూడా లావాదేవీలు పూర్తిచేయమంటారా? అప్పుపెట్టమంటారా? చూస్తే అతగాడు మొత్తం ఇచ్చేట్లు లేడు''

''అప్పుల వ్యాపారం కాదుగా మనది?''

''మీ ప్రియస్నేహితుడని అడుగుతున్నాను అంతే! అతడితో ఖచ్చితంగా వ్యవహరిస్తే మీరు బాధపడతారేమోనని ఆలోచిస్తున్నాను''

''ఇందులో బాధలూ, కష్టాలూ ఏమీ ఉండవు. ఎవడి మార్గం వాడిది. ఇందులో కూడా స్నేహాలు పనికిరావు. దొరికినంతవరకూ అందుకోవడమే పరమార్థం. మనకు రావలసింది పూర్తిగా అందిన తర్వాతే వస్తువు అప్పగించు. సాయంత్రం ఇక్కడికిరా! మాట్లాడాలి''

''వస్తాను స్వామీజీ! సాయంత్రం మరికొందరు మనవాళ్ళు రావలసి ఉంది. వారిని కూడా చూసుకుని వస్తాను. కొంత ఆలస్యమయితే కావచ్చునేమో?''

''సరే! నీకోసం ఆలస్యం భరిస్తాను'' అన్నాడు బాబా.

రిసీవర్ క్రేడిల్ మీద పెట్టి లేచినిలబడ్డాడు. కొద్దిగా తూలుతున్న అతడిని పొదివి పట్టుకుంది భామ. ''ఇంతగా ఆ గంజాయి త్రాగకుంటే ఏం?'' అంది మృదువుగా. అవధూత వెకిలిగా నవ్వాడు. ఆమె వీపునిమిరాడు. ''నువ్వు త్రాగేటప్పుడు కూడా ఇలాగే ఎక్కువగా త్రాగుతావు!'' అన్నాడు.

''లేదు, నేను పరిమితంగానే ఏదైనా త్రాగుతాను'' అంది గోముగా.

''నీకు తెలియదులే! నువ్వు ఎక్కించడం ఆరంభిస్తే ఇక క్రిందపడి పోయే వరకూ ఎక్కిస్తూనే ఉంటావు'' అంటూ లోపలకు నడిచాడు. బెడ్‌రూమ్‌లోకి నడిపించుకువచ్చి మంచంమీద విడిచింది. కళ్ళు మూసుకొని పడుకున్నాడు అవధూత! పడకగదికి నాలుగు వైపులా క్రిందనుండి పైదాకా సెక్సును రెచ్చగొ

స్టేచిత్రాలే! క్రిందపాలరాళ్ళు! మంచం న్యూడ్ స్ప్రింగ్! ప్రక్కన లెట్రిన్; అందులో బాత్‌రూం! పాలరాళ్ళపైన మెత్తటి తివాసీ! దానిపైన అంతకంటే మెత్తవి ఢక్కా మజ్లిన్‌గుడ్డ పరచబడి ఉంది. నెలకు పదివేల జీతం సంపాదించుకునే వ్యక్తి కూడా అటువంటి గదిలో రోజూ పడుకోవడం సాధ్యం కాదనుకుంది భామ! మరి అవధూతకు ఎక్కడినుండి ఇంత డబ్బు వస్తున్నది? జీతానికి బాబా దగ్గర పనిచేస్తున్నాడు. వచ్చే జీతం రెండు వేలు! ఈ భవనం అద్దె ఉచితం! అయితే మాత్రం, మిగిలిన అవసరాలకు ఈ రెండు వేలూ చాలవు.

బయట బెల్ మ్రోగడంతో లేచి హాలులోనికి వెళ్ళింది. బయట తలుపు వద్ద ఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతడు కాషాయాంబరధారి కాడు. గడ్డాలూ, మీసాలు లేవు. నున్నగా గీచిన గడ్డంతో, నీటుగా దుస్తులు వేసుకొని సుందరంగా కన్పిస్తున్నాడు. ఆమెను చూసి పలకరింపుగా నవ్వి "అవధూత గారున్నారా?" అన్నాడు. ఆమె అతడివైపే చూస్తూ తల ఊపింది "రండి, కూర్చోండి, ఆయన గారిని పిలుస్తాను" అంటూ లోపలకు వచ్చింది. ఆ సంభాషణ వింటున్నఅవధూతలేచి కూర్చున్నాడు ఆమె వచ్చేసరికే! హాలులో దృశ్యం అతనిగదిలోని అద్దంలో ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది. వచ్చిన వ్యక్తి ఇన్‌స్పెక్టర్ స్వరాజ్ అని సులభంగానే గుర్తించాడు.

భామ గది ముందుకు వచ్చేసరికి అతడు బయటకు వచ్చాడు. అవధూతను చూచి లేచి నిల్చున్నాడు స్వరాజ్. "నమస్తే స్వామీజీ!" అన్నాడు రెండుచేతులు జోడించి.

"రాంరాం కూర్చోండి" అన్నాడు తను కూర్చుంటూ.

అతడు కూర్చుంటూనే స్వరాజ్ కూడా కూర్చున్నాడు.

"ఏమిటి విశేషాలు చెప్పండి?" అన్నాడు అవధూత అతడివైపు చూస్తూ.

"మామూలే స్వామీజీ! మీ దగ్గరకు వచ్చేటప్పుడు మీ విశేషాలే ఉంటాయి, ప్రత్యేకం ఏమీ ఉండవుకదా." నవ్వాడు అవధూత.

"ఈరోజు మరొక పిల్లవాడు మాయమయ్యాడు. ఇంతకుముందే స్టేషన్‌కు రిపోర్టు అందిందట! కానిస్టేబుల్‌వచ్చి నాతో చెప్పాడు. నేను డ్యూటీలో లేను ఈరోజు"

ఊపిరిపీల్చి వదిలాడు అవధూత. తల ఊపి "నిజమే" అన్నాడు. "ఇంతకుముందే చేరాడు. మనవాడి ద్వారానే ఇక్కడికి చేర్చడం జరిగింది"

"మంచిదే! కానీ, పట్టణంలో బాగా అలజడిగా ఉంది. ఈ పట్టణంలో ఇది మూడవది. వివిధ ప్రాంతాలనుండి మాయమైన వారిలో ఏడవకేసు. చాలా జాగ్రత్తగా పరిశీలించమని పైనుండి ఆర్డర్స్ వచ్చాయి. ఏమాత్రం మీరు గానీ, పరివారంగానీ అనుమానంగా ప్రవర్తించినా చాలా అపాయం!" అన్నాడు స్వరాజ్.

అవధూత నవ్వాడు. "మీలాంటి సహచరులు ఉన్నంతవరకూ మాకు అపాయమేమీ ఉండదనుకోండి. పైనుండి పరిశోధించడానికి వచ్చినా, మీద్వారా రావలసిందేకదా! మీనుండి మాకు సహకారం ఎల్లప్పుడూ ఉంటుందని మా విశ్వాసం!"

"మా సహకారం ఉంటుందనుకోండి! ఒక్కోసారి మా స్టేషన్ పరిధిలో మాకు తెలువకుండానే గూఢచారీవర్గాలు దాడులు చేస్తుంటారు. అప్పుడు పట్టుబడే అవకాశాలుంటాయి. మీతోపాటు మేమూ దెబ్బతినవలసివస్తుంది"

"అంతవరకూ రాదులెండి" అన్నాడు అవధూత! జేబులోనుండి కాగితం, పెన్ను తీసి కాగితంమీద రాసి భామను పిలిచాడు. పడకగదిలో ఉన్న భామ, వారినీ వారి సంభాషణనూ ఆలకిస్తున్నది. అవధూత చీటీమీద వ్రాసిన 'పదివేల రూపాయలు తీసుకురా!' అన్న వాక్యంకూడా కన్పించడంతో లేచి ఆ గదిలోనే ఉన్న మరో బీరువానుండి పదిరూపాయల నోట్లకట్టలు పది చేతికి తీసుకుంది. చేతిరుమాలులో చుట్టి తెచ్చి అతడికి ఇచ్చింది. ఆ డబ్బును స్వరాజ్‌కు అందించాడు అవధూత.

"నేను డబ్బుకొరకు రాలేదు స్వామీజీ! మీ శిష్యుడిగా నాకు తెలిసిన ఈ విషయం తెల్పడం భావ్యంగా ఉంటుందని వచ్చాను. అవసరంలేదండీ! మా పెద్దపాప పెళ్ళి ఖాయమయింది. త్వరలోనే పెళ్ళి ఏర్పాట్లున్నాయి. ఆరోజు ఎలాగూ అవసరం గనుక, మీ

సహాయం తీసుకుంటాను''

"ఆరోజు సహాయం ఆరోజు ఉంటుంది లెండి, మా దగ్గరకు వచ్చిన తర్వాత వట్టిచేతులతో పంపించడం మంచిదికాదు, మాకూ బాధగా ఉంటుంది'' అన్నాడు అవధూత.

నోట్లకట్టలను చేతిలోకి తీసుకుని సంచీలేక పోవడంతో బ్యాగ్ తీసుకరమ్మన్నాడు భామను!

భామ తెచ్చిన బ్యాగ్‌లో నోట్లు వేసుకున్నాడు స్వరాజ్! చివరి నమస్కారం చెప్పి బయటకు వచ్చాడు. వచ్చినందుకు వట్టిచేతులతో రాకుండా, తగిన డబ్బు వచ్చినందుకు అతడికి సంతోషంగా ఉంది.

స్వరాజ్ స్కూటర్ గేటుదాటి వెళ్ళడం, హాలులోని అద్దంలో కన్పిస్తున్నది. అదిచూశాక లేచి లోపలకు వెళ్ళాడు అవధూత! అతడి వెంట భామకూడా వెళ్ళింది. బయటనున్న వ్యక్తి ప్రధాన ద్వారం మూసేశాడు. అవధూత మంచంమీదకు చేరుతూనే విసనకర్ర చేతికి తీసుకుని విసరడం ఆరంభించింది భామ.

ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుని మెత్తగా నిమురుతూ ఆలోచిస్తున్నాడు. అతడి స్పర్శ ఆమెకు వేడిని కలిగించడంలేదు. ఆ యింటిలో నాలుగుబీరువాలలో మూలుగుతున్న డబ్బును గురించే ఆలోచిస్తున్నది. చేతి కందినంత దొరకపుచ్చుకుని పారిపోతే, ఆ తర్వాత జీవితం హాయిగా గడుపుకోవచ్చు. ఈ కాషాయ వస్త్రాలమధ్య, పెరిగిన, మాసిపోయిన గడ్డాలమధ్య, అసహ్యపడుతూ గడిపే జీవితం నుండి విముక్తి పొందవచ్చు. కానీ, పారిపోవడం ఎలాగో ఆమెకు అర్థంకావడంలేదు. ప్రతిక్షణం కంటికి రెప్పలా కాపాడే వ్యక్తులు బయట ఉంటారు. ఇంటిలోని ఏ వ్యక్తినీ బయటకు పోనివ్వరు అవధూత ఆజ్ఞలేనిదే! ఆ ఉచ్చునుండి తప్పుకోవడమంటే శరీరాన్ని విడిచిపెట్టడమేనని భామకు తెలుసు. ఇంతకుముందు కూడా అక్కడినుండి పారిపోవడానికి ప్రయత్నించి, నిర్ధాక్షిణ్యంగా చంపబడినవారిని ఆమె చూసింది. ఆ విషయం తలచుకుంటేనే వణకుపుడుతుంది. ఏంచేయడానికి పాలుపోక కుక్కినపేనులా అణగివడి ఉంది.

సాయంత్రం మూడుగంటలకు అవధూత లేచాడు. స్నానం ముగించుకుని వచ్చి హాలులో కూర్చున్నాడు. బయట గుమ్మం తెరచాడు కాపలా వ్యక్తి. వరండాలో కూర్చున్న వ్యక్తిని లోపలకు పంపాడు.

"రాంరాం స్వామీజీ'' అన్నాడు ఆ వ్యక్తి.

"రాంరాం రండి భుజంగరావూజీ!'' అన్నాడు అవధూత.

భుజంగరావు వచ్చి కూర్చున్నాడు.

"ఉదయం వద్దామనుకున్నాను, రాలేకపోయాను. మాపని ఎంతవరకు వచ్చింది?'' అన్నాడు భుజంగరావు హాలుచుట్టూ వరకాయించి చూస్తూ.

తన ఆస్తి మొత్తం కలుపుకున్నా ఆహాలు ఖరీదుచేయదనుకున్నాడు.

"మేము సాధారణంగా మాట ఇవ్వం, ఇచ్చిన తర్వాత నెరవేర్చితీరుతాము. ఆ నైతిక, దైవిక శక్తులు మాకున్నాయని మీకు తెలుసు గదా!''

తల ఊపాడు భుజంగరావు.

"మీకు కావలసిన పిల్లవాడు ఎటువంటివాడో, రూపురేఖలు తెలుసుకున్నారా; లేక ఎవరో ఒకరు అయితే సరిపోతుందంటారా?'' అన్నాడు అవధూత అతన్ని చూస్తూ.

"లేదు స్వామీజీ! ఇక్కడకు దగ్గరలోని బాబాను గురించి మీరు వినే ఉంటారనుకుంటాను. భగవత్ స్వరూపుడు. ఆయన చెప్పింది జరిగి తీరుతుంది. ఆయనను కలిసి నా బాధలు విన్నవించుకున్నాను. దేవీయాగం చేసి, ఐదు, పదిసంవత్సరాల మధ్య నున్న పిల్లవాడిని బలి ఇవ్వమన్నారు. ఆ విధంగా చేస్తే నాకు పట్టిన శనివదుల్తుందనీ తిరిగి కోట్లు సంపాదించే కాంట్రాక్టులు వాటికవే నా దగ్గరకు వస్తాయనీ ఆయన చెప్పాడు. అందుకొరకే పిల్లవాడు కావాలని మిమ్ము అడిగాను. ఇదిగో ఆ పిల్లవాడి రూపురేఖలు!'' అంటూ కాగితం అతడి చేతికి అందించాడు.

కాగితం పరిశీలించాడు. ఉదయం రమేష్ గురించి బాబాకు ఇచ్చిన వివరాలే అందులో మక్కికి మక్కీ వ్రాయబడి ఉన్నాయి. తల పంకించి బాబాను గురించి తెలియని వాళ్ళెవరండీ, ఆయన అతీంద్రియ శక్తులను గుప్పిటలో ఉంచుకున్న దైవదూత'' అన్నాడు.

"మీరెప్పుడు ఆయనను కలిశారు?''

"ఈరోజు మధ్యాహ్నం కలసి అడిగాను, చెప్పారు. ఇంతకుముందే నా ఆలోచన మీకు చెప్పి ఉన్నాను కనుక, మీ దగ్గర ఎవరో ఒకరు దొరుకుతారని ఆశించాను. మరి బాబాగారు ఇచ్చిన వివరాలివి. ఇటువంటి పిల్లవాడు మాత్రమే కావాలి. ఎన్ని రోజులలో నాకు అప్ప గించగలరో తెలవిస్తారా?" అన్నాడు భుజంగ రావు.

"రేపు ఉదయం అదే గుర్తులుగల పిల్లవా డిని మీకు అప్పగించగలను. కాని, ఇంతకు ముందు మీకు చెప్పినట్లు లక్ష రూపాయలకు పరిమితం కాలేము. ఎందుకంటే ఎవరో ఒకర యితేనే ఆ ధరకు ఇస్తానని చెప్పాను. ఇప్పుడు అట్లాకాదు. ప్రత్యేకంగా ఏరి తీసుకురావా లంటే, అదీ రేపే అందించాలంటే, ఎన్నో వ్యయ ప్రయాసలు పడవలసి వస్తోంది. కాబ ట్టి లక్షన్నర ఇవ్వక తప్పదు"

డబ్బు ఎంతన్నది సమస్యకాదు భుజంగరా వుకు. బాబామీద అతడికి అపారమైన నమ్మక ముంది. నరబలి ఇవ్వడం ద్వారా, తన చుట్టూ చేరిన దుష్ట శక్తుల్ని తొలగించి, దేవీమాత అనుగ్రహిస్తుందని బాబాగారు చెప్పినప్పటి నుండీ, ఎప్పుడా దుష్టశక్తుల్ని తరిమేయాలా? అన్నయావలోనే ఉన్నాడు. అంతకుముందే పసిపిల్లల అమ్మకం అవధూత ద్వారా జరుగు తుందని అతని సహచరుల ద్వారా విని, అవధూతను కలిసి సంప్రదించాడు. బాబాకు శిష్యుడే అవధూత అన్న విషయం భుజంగరా వుకు తెలియదు. అవధూత ఇచ్చిన కొండగు ర్తులే బాబాతిరిగి తనకూ చెప్పాడని కూడా అతడికి తెలియదు. అందువల్ల అటువంటి గుర్తులుగల వాడిని సేకరించాలంటే కష్టమే నని అతడు ఆలోచించాడు.

లక్ష రూపాయలు వంద రూపాయల నోట్ల రూపంలో సమర్పించాడు భుజంగరావు.

"మిగిలిన యాభై రేపు ఉదయం పదిగంట లకు అందించి తీసుకెళ్ళండి తప్ప కుండా సేకరించి తెచ్చిపెడతాము!" అన్నాడు అవ ధూత.

భుజంగరావు తల పంకించి లేచి నిలబడ్డా డు. రాం రాం చెప్పి బయటికి వెళ్ళాడు. అతడి కారుగేటు దాటి వెళ్ళడం కన్పించింది. అవధూత అతను వెళ్ళిన తరువాత మరొకరిని లోపలికి పిలిపించాడు. అతడు కొత్తవ్యక్తిలా కన్పించడంతో భృకుడి ముడిచాడు. "రాం రాం స్వామీజీ" అన్నాడు అతడు చిరునవ్వు నవ్వి.

"రాంరాం! రండి కూర్చోండి, మీరెవరో తెలుసుకోవచ్చా!"

"మీ దగ్గరికి వచ్చినప్పుడు నా వివరాలు తెలుపక పోతే మాట్లాడలేము కదా స్వామిజీ!" అంటూ జేబు నుండి కాగితం తీసి అవధూ తకు అందించాడు. కాగితం మడత విప్పి చూశాడు. నరశింహారావు వ్రాయించిన పరి చయ పత్రం అతడు నమ్మదగ్గవాడేనని, అత డికి కావలసిన సహకారం అందించమని వ్రాశా డు. క్రింద నరశింహారావు సంతకం గుర్తు పట్టాడు.

"చెప్పండి నగేష్‌గారూ!" అన్నాడు అవ ధూత పరికించి చూస్తూ.

"నేను రైస్‌మిల్లు కడుతున్నానండీ! పూర్త యింది కూడా. కాని ఒక్కసారి గోడకూలి క్రింద పడి విపరీత నష్టం వచ్చింది. మరోసారి గాలికి పైన కప్పిన రేకులు ఎగిరి ఎటోపోయాయి. ఇన్ని నష్టాలకు భరించి ఆ మిల్లును నడపడా నికి యంత్రాలు తెస్తే, అవి ఇప్పుడు పనిచే యడం లేదు. ఈ విషయం గురించి నా స్నేహితుడు నరశింహారావుగారిని సంప్ర దించాను. ఆయన నన్ను బాబాగారి వద్దకు తీసుకెళ్ళారు. బాబాగారు అందుకు నరబలి పెట్టడమే తప్ప మరో మార్గం లేదన్నాడు. వివరాలు కూడా ఇచ్చాడు. నరబలికి కావల సిన మనిషిని ఏరుకునే ధైర్యం లేదు నాకు. నరశింహారావు మీ విషయం చెప్పి మీ దగ్గ రకు పంపాడు"

తల ఊపాడు అవధూత! "ఆ బాబాగారే మైనా నరబలికి కావలసిన మనిషి వివరాలి చ్చారా లేక ఎవరయినా సరిపోవచ్చన్నాడా?"

"వివరాలు ఇచ్చారు. ఎవరయినా సరే నంటే! దారినపోయే వాడిని తెచ్చి తలనరక్క పోయామా? ఇన్నిబాధలెందుకు? ఆయన కొ న్ని లక్షణాలు కలిగిన బాలుడే కావాలని వివరాలు చెప్పారు" అంటూ కాగితం అందించాడు. కాగితం పరిశీలించాడు అవ ధూత! తమ వద్దనున్న జయంత్‌కు సరిపోవా

ల్సిన గుర్తులవి. తలవంకించి, అతని కండ్ల లోనికి చూస్తూ ఎవరో ఒకరయితే మీకు సుల భంగా అందించేవాడిని. కానీ, మీరు చూపిన లక్షణాలు గలవాడుకావాలంటే మాత్రం ఎంతో కష్టపడి, వెతికి తీసుకరావాలి. మరి మా ఫీజు చాలా అవుతుంది. రైసుమిల్లు కొరకు మీరు అంత ఫీజు భరించగలరా?'' అన్నాడు అవ ధూత.

''భరించగలను'' అన్నాడు తలఊపిన నగేష్. ''రైస్ మిల్లంటే చిన్నదికాదండీ మాది! అతిపెద్ద రైసుమిల్లు. దాని యంత్రాలే యాభై లక్షలు పెట్టి విదేశాలనుండి దిగుమతి చే యించాము. మరో యాభై లక్షలు బిల్డింగ్ ఖర్చయింది. ఇంతడబ్బు ఖర్చుపెట్టినప్పుడు, ఇప్పుడు పెట్టబోయే ఖర్చుకు భయపడితే సాధ్యంకాదు. పని నెరవేర్చుకోవాలి ఎలాగ యినా!''

మరోసారి తల ఊపాడు అవధూత, ఊగు తున్న అతని తలవైపు చూస్తున్నాడు నగేష్. ఐదు నిముషాలు పెదవి మీద వ్రేలుఉంచి ఆలోచించిన తరువాత ''ఒకటిన్నర లక్ష ఫీజు అవుతుంది'' అన్నాడు అవధూత! ఈసారి తల ఊపడం నగేష్ వంతయింది.

బ్యాగ్ తెరిచాడు లక్ష రూపాయలు తీసి చేతికిచ్చి ''మిగిలింది ఎప్పుడు రమ్మంటే అప్పుడు వచ్చి ఇచ్చివెళ్తాను'' అన్నాడు. డబ్బు టీపాయ్ మీద పడేశాడు అవధూత నిర్లక్ష్యంగా!. ''యెల్లుండి ఇదే సమయానికి రండి, మీకు బలి పశువును అందిస్తాను'' అంటూ లేచాడు. నగేష్‌కూడా లేచి రాంరాం చెప్పి బయటకు కదిలాడు. అతడికారు కూడా పోతూనే డబ్బు మొత్తం తీసుకుని లోపలకు వచ్చాడు. పడకగదిలో మంచం మీద వెల్లకిలా పడుకుని వీరి కార్యకలాపాలు చూస్తున్న భామ అతడు రాకముందే లేచినిల్చుంది. గోడమీదు న్న రెండు ఫొటోలు తొలగించి గోడలో నున్న సొరుగును బయటకు లాగాడు. ఆ సొరుగులో డబ్బు పడేశాడు. సొరుగు మూసి యధాప్రకా రంగా ఫొటోలు తగిలించాడు.

''బీరువాలు ఖాళీగా ఉన్నాయి కదా స్వా మీజీ!'' అంది భామ చూస్తూ.

అవధూత పలుకలేదు, కాని చిరునవ్వు లీలగా కన్పించింది పెదవుల మీద. చేతికర్ర తీసుకున్నాడు. కాళ్ళకు చెప్పులు తొడిగి బయ టకు నడిచాడు. పోతున్న అతడిని దీర్ఘంగా చూస్తూ నిలబడింది పడక గదిలో!

అవధూతను చూచి బయటఉన్న వ్యక్తి గ్యారేజీ నుండి కారు బయటకు తెచ్చాడు. కారు తలుపు తెరచి పట్టుకున్నాడు. అవధూత అందులో చేరుతూనే తలుపువేసి స్టీరింగ్ ముందుకూర్చుని స్టార్ట్‌చేసి గేటు దాటించాడు గేటు కూడా మూతపడింది.

కారు మందిరం వద్దకు వచ్చేసరికి చీకటిప డుతున్నది. దిగి, బాబా మందిరం వద్దకు వచ్చాడు. బయట ఉన్న వ్యక్తి ''రాంరాం స్వామీజీ! మీ కొరకే బాబాగారు ఎదురుచూస్తు న్నారు'' అంది తలవంచి వినయంగా.

తల వంకించి లోపలకు వెళ్ళాడు. బషీర్ బాబా ఇద్దరు యువతుల మధ్య కూర్చుని వారందిస్తున్న ద్రాక్షరసం సేవిస్తూ ఉల్లాసంగా ఉన్నాడు. అవధూతను చూసి, ఇద్దరూ ప్ర క్కకు వెళ్ళి నిలబడ్డారు. బాబాగారు గ్రుడ్లు తిప్పి, కనురెప్పలు ఎగురవేసి ''ఏమిటి ఆల స్యం?'' అన్నాడు తీవ్రస్వరంతో!

''కస్టమర్సును పంపేటప్పటికి ఆలస్యమ యింది. బాబాజీ! క్షమించాలి. అంతకుమించి మరే కారణమూ లేదు''

బాబా సర్దుకుని కూర్చున్నాడు. స్త్రీలు మీద పడటం వల్ల నలిగిన గుడ్డల్ని సరిచేసుకున్నా డు ''నేను చెప్పిన ఇద్దరూ వచ్చారా?''

''వచ్చారు. వారితో కొంత మొత్తం కూడా తీసుకోవడం జరిగింది. వారికి అప్పగించవల సిన వారిని అప్పగించి మిగిలిన డబ్బు తీసు కుంటాను''

బాబా మాట్లాడలేదు. అర్ధ నిమీలిత నేత్రా లతో ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతడివైపే చూస్తూ కూర్చున్న అవధూత ''నారాయణ ఉదయం వచ్చాడు. అతడికి మరో రెండు వందలు ఎక్కువ ఇచ్చాను. ఈ రోజు మరి కొందరు రావచ్చు''

''మంచిది, మంచిది'' అన్నారు బాబాగా రు. నిన్ను పిలిపించడానికి కారణం, ఈ రోజు రాత్రి చాలా మొత్తంలో బంగారం ఇక్కడకు చేరబోతున్నది. ఆ బంగారం విదేశాల నుండి

ఇక్కడకు రహస్యంగా దిగుమతి చేశారు. కనీసం కొన్ని లక్షలలో ఉంటుంది. మనదగ్గర డబ్బు ఉందా?''

''కోటి రూపాయల వరకూ స్టాకు ఉంది; చాలకపోతే రెండురోజుల్లో మరోకోటి అందించ గలం!''

''మంచిది, మంచిది'' అన్నాడు బాబా! ''ఈ రోజు ఇక్కడనే ఆఫీసులో ఉండు, వాళ్ళు వస్తూనే నీ దగ్గరకే రావచ్చు''.

తల ఊపాడు అవధూత ఆలోచిస్తూ.

''వాళ్లు తెచ్చిన బంగారాన్ని బాగా పరీక్షించనిది అంగీకరించకు. ఎందుకంటే దొంగ బంగారం విపరీతంగా వృద్ధి చెందుతున్నది. వాళ్ళు మోసగాళ్లయితే మనం మునిగిపోతాం!'' అన్నాడు తిరిగిబాబా! నవ్వుకున్నాడు అవధూత.

'దొంగకు దొంగేతోడు' అన్నట్లుంది. దొంగను దొంగ నమ్మకుంటే ఎవరు నమ్ముతారు? ఒకరి నొకరు మోసపుచ్చుకుంటే కార్యకలాపాలు ఎలా జరుగుతాయి?

''సరే వెళ్ళు! నీ ఆఫీసులోనే ఉండు'' తలూపాడు వెళ్ళమన్నసంకేతం చూపిస్తూ బాబా. అర్థంచేసుకున్న అవధూత లేచి బయటకు వచ్చాడు. తన ఆఫీసుకు వెళ్ళి, కుర్చీలో చేరగిలబడ్డాడు. బంగారాన్ని ఏవిధంగా తనకు సంక్రమించే ఏర్పాటు చేసుకోవాలా అని అతడు ఆలోచిస్తున్నాడు. తలనొప్పిగా ఉండటంతో మందుబిళ్ల మ్రింగి కుర్చీలోనే తలవాల్చాడు. ఈ సమయంలో భామ ఉంటే, తల నొప్పికి తగిన మందురాసి, ఉపచారాలతో సేదతీర్చేది.



రాత్రి పదిగంటల ప్రాంతంలో కారుశబ్దానికి మెలకువ వచ్చింది అవధూతకు. అంతవరకూ కుర్చీలోనే కూర్చుండి నిద్రపోయాడు. గంజాయి త్రాగడానికి గొట్టంలేకపోవడంతో, ఆకుతో చేసుకుని త్రాగడానికి ఇష్టంలేకపోవడంతో, తలతిక్కరేగింది. అలాగే కన్నుమూశాడు. గదిబయట సేవకుడు నిలబడి అటుఇటు తిరుగుతున్నాడు. నలుగురు మనుషులు అక్కడకు రావడం, సేవకుడితో ఏదో మాట్లాడటం, తిరిగి లోపలకు రావడంచూసి లేచి నిలబడ్డాడు. నలుగురూ ప్యాంట్లు, షర్టులు ధరించి ఉన్నారు. అవధూతకు నమస్కారం చేశారు. ప్రత్యభివందనంచేసి కూర్చోమన్నాడు.

వారు తెచ్చిన పరిచయపత్రం అతనికి ఇచ్చారు. పరిచయపత్రం పరిశీలించి 'సాయంత్రం ఇక్కడకు చేరుతారనుకున్నాం' అన్నాడు అవధూత.

''సాయంత్రం చేరడానికే ప్రయత్నించాము. మధ్యదారిలో కారు ట్రబుల్ ఇవ్వడంతో రిపేరు చేసుకోవలసివచ్చింది. అందువల్లనే ఆలస్యమయింది స్వామీజీ'' అన్నాడు పొడుగాటివ్యక్తి. తన్నుతాను పరిచయం చేసుకుంటూ ''నాపేరు రఘునందన్'' అన్నాడు. అతడితో కరచాలనంచేశాడు. బహుశ అతడే వారికి లీడర్ అయిఉండవచ్చుననుకున్నాడు.

''బంగారం తెచ్చారా?''

''తెచ్చాం...కానీ, ఇక్కడకు తీసుకురాలేదు''

''ఎక్కడుంచారు?'' అన్నాడు కనుబొమలు ముడేసి ఆలోచిస్తూ.

''మరోకారులో దాన్ని ఉంచాము. ఆ కారు టౌనులోనే లాడ్జివద్ద ఉంది. ఇది బయటి ప్రాంతం! ఎట్లా ఉంటుందో పరిస్థితి అనుకుని అక్కడే విడిచివచ్చాము''

''మంచిదే!'' అన్నాడు లేస్తూ. ''నేను మళ్ళీ వస్తాను, ఉండండి'' అంటూ బయటకు వచ్చాడు. బాబా మందిరం వద్దకు వచ్చి తలుపుతట్టాడు. తలుపు తెరచిన సేవిక అవధూతను చూసి ప్రక్కకు తొలగింది ఊయలమీద పడుకున్న బాబా మత్తులో ఉన్నాడు. ఆ సమయంలో లోపలకు వచ్చిన అవధూతను చూచి, ''ఏమిటి?'' అన్నాడు తీక్షణంగా. అతడికోపం

తనకు లెక్కలేదన్నట్లు "వాళ్ళు వచ్చారు, బంగారం ఇక్కడకు తేలేదు; పట్టణంలోనే ఉంచారట. అక్కడకు వెళ్ళి తీసుకో మంటారా?" అన్నాడు అవధూత.

"అటువంటి విషయాలన్నీ నేను చె ప్పాలా?" అన్నాడు చూస్తూ బాబా! "ప్రతివిష యానికీ నామీద ఆధారపడటం మంచిది కా దు" అవధూత తలఊపి బయటకు వచ్చా డు. తనగదికివచ్చి "మిష్టర్ రఘూ! అయితే టౌనుకువెళ్ళి పరిష్కారం చేసుకుందామా?" అన్నాడు కూర్చుంటూ.

"పరిష్కారం ఇక్కడే కానివ్వండి, అక్కడ మార్పిడిచేసుకుందాం!" అన్నాడు రఘు. తల ఊపాడు అవధూత. నలుగురినీ పరకాయించి చూశాడు. ఒక మనిషి లోపలకువచ్చి అవధూ తకు చీటీ అందించాడు. దాన్నిచూచి, తెచ్చిన వ్యక్తివైపు చూసి "బయట ఉండు" అన్నాడు. రఘునందన్ వైపు తిరిగి "నాకు ఇతర పను లున్నాయి. దయచేసి మీరు తొందరగా నిర్ణయం చేయండి. ఎన్నికిలోలు మీదగ్గర ఉంది?" అన్నాడు పైన వెలుగుతున్న లైటు వైపు చూస్తూ.

"ఎనభై కిలోలుంది; మేము చెప్పింది వందకిలోలు! కాని అంత దొరకలేదు. మరోసారి తీసుకురావడానికి ప్రయత్నంచేస్తాం".

"ఏ ధర మీద అయితే ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు?"

"నాలుగు లక్షల రూపాయలని ఇంతకు ముందే నిర్ణయించినట్లు మాకు ఈ సరుకు అందించినవ్యక్తి చెప్పాడు. ఇందులో తిరిగి ధర ఏముంది? మీరు గతంలో నిర్ణయించుకు న్న రేటుకే తీసుకోండి".

అవధూత తల తడుముకున్నాడు. ఊపిరి పీల్చి వదిలాడు. తర్వాత తలఊపి "సరే! పదండి, వెళ్దాం! సరుకుచూచిన తర్వాత డబ్బు చెల్లిస్తాం" అంటూ లేచాడు. ఆయనతో పాటు నలుగురూ లేచి బయటకు వచ్చారు. వారు నలుగురూ కారులో ఎక్కినవెంటనే, అవ ధూతతోపాటు మరో నలుగురు ఆయన కారు ఎక్కారు.

హోటల్ ముందు రెండుకార్లూ ఆగాయి. ఆ సమయంలో తాను లోపలకు వెళ్ళడం అనుమానం కలిగిస్తుందని ఆలోచించాడు అవధూత! తనవేషంచూసి, అనుమానం తప్పక కలుగుతుంది. కారును తీసుకరమ్మని రఘునందన్‌తో చెప్పాడు. మూడుకార్లు అవ ధూత ఇంటికి వచ్చాయి.

కారును పోర్టికో లోనికి తీసుకెళ్లారు. అవధూ తతోపాటు మరి నలుగురు కారును చుట్టుము ట్టారు. అందులోని బంగారం దిమ్మెలను క్రిందకు దించారు. నరేంద్ర బంగారు దిమ్మెల పై గీతలుగీసి దాన్ని పరీక్షించాడు. అది అసలైన మేలిమి బంగారమేనని నిశ్చయించు కున్న తర్వాత అవధూతవైపు తిరిగి తలఊపా డు. అతడి సంజ్ఞ అర్థంచేసుకున్న అవధూత తనవెంటనున్న మనిషికి ఏదోచెప్పి, ఇంటిలోని కి పంపాడు. "ఏమిటి?" అన్నాడు రఘు నందన్ అవధూతవైపు చూసి.

అవధూత నవ్వాడు. "ఏమీలేదు. త్రాసుకో రకు పంపాను"

"మా దగ్గర త్రాసుకూడా ఉంది" అంటూ కారు డిక్కీలోని త్రాసు, తూకపురాళ్ళు బయట వేశారు. ఒక్కో అచ్చు ఐదుకిలోలు తూగింది. మొత్తం పదహారు అచ్చులు. అచ్చుల్ని ఇంటి లోపలకు చేరవేశారు. అందరూ హాలులోనికి వచ్చి కూర్చున్నారు. డ్రింక్స్ తెచ్చి అందరికీ అందించింది భామ! ఆమె అందాన్ని చూస్తూ, నలుగురు యువకులు డ్రింక్స్ త్రాగడంలో లీనమయ్యారు. తన దగ్గరున్న మనుషులను బయటకు పంపిన తరువాత రఘుతో అన్నా డు అవధూత "మీరు నాలుగు లక్షల రూపా యలు అడిగారు; నేను కిలోకు పదివేలు చొప్పున ఎక్కువ చెల్లిస్తాను. మొత్తం ఎనభైకిలో లకూ అదేరేటులో ఇస్తాను. అయితే నాకు మీరో సహాయం చేయాలి".

ఏమిటన్నట్లు రఘు అతడివైపు చూశాడు. పదివేల చొప్పున ఎనిమిది లక్షలు ఎక్కువ వస్తుంది. అంతడబ్బు ఎక్కువ ఇవ్వడానికి అతడు మూర్ఖుడూ, అమాయకుడు కాదు; మరి ఎందుకిస్తానంటున్నాడో వారికి అర్థంకావ డంలేదు.

"మాకు కొన్ని లావాదేవీలున్నాయి. అవి మీకు చెప్పినా అర్థంకావనుకోండి" మీరిచ్చే

ఎనభైకిలోలనూ నాకు అరవై కిలోలే ఇచ్చినట్లు మీరు ఆ తర్వాత ఎవరడిగినా చెప్పాల్సి ఉంటుంది. అంటే ఇరవైకిలోల బంగారం మాకు అమ్మినట్లుగాక మరెక్కడైనా అమ్మినట్లు మీరు సృష్టించుకోవాలి''.

రఘు అంగీకరించాడు. ''తప్పకుండా ఆ పనిచేస్తాము. ఆ ఇరవైకిలోల బంగారం మరో చోట అమ్మినట్లు మా నాయకుడికి చెప్పు కుంటాము''.

బీరువా తెరిచాడు. అన్నీ వదిరూపాయలనో ట్లు. ఒక్కోకట్ట లెక్కపెడుతూ విసరివేశాడు. మొత్తం డబ్బు ఇచ్చేటప్పటికి నాలుగు బీరువా లు ఖాళీఅయ్యాయి. పదినంచుల్లో నోట్లు కుక్కి కారులో పడేశారు. అవధూతకు కృతజ్ఞతలు చెప్పి, బయలుదేరేసరికి తెల్లారింది. అవ ధూత అలసటతో కుర్చీలో కూర్చున్నాడు. పైన ఫ్యాన్ తిరుగుతున్నది. అయినా శరీరమంతా చెమటపట్టింది. తాను ఇప్పుడు ఇరవైకిలోల బంగారానికి అధిపతి! ఇక ఈ కాషాయగుడ్డ లు, గడ్డంతో జీవితాన్ని నిస్సారంగా గడప డంకంటే, హాయిగా నవనాగరికుడిలా తిరిగి బ్రతుకుసాగించవచ్చు. డబ్బు చేతినిండా ఉంటే ఏ వెధవా సన్యసించడని అతడు ఆలోచించాడు. ఇప్పుడు సన్యసిస్తున్నవారు ఆపని చేసేదిముక్తికిగాక,భుక్తికొరకే అనిఅతడి ఉద్దేశం!

భామకూడా రాత్రంతా నిద్రపోలేదు. వీరినో ట్ల గొడవ, బంగారపుఅచ్చులు చూసి ఆమె నోరూరుతున్నది. ఇంత ధనరాశిమధ్య తాను ఉందేగానీ, ఇది తనదికాదు, తను స్వతంత్రు రాలూ కాదు. అలసటతో కూర్చున్న అవధూత దగ్గరగా వచ్చి ''పాలు తెమ్మంటారా స్వామీజీ'' అంది వినయంగా. అవధూత తల త్రిప్పిచూశా డు. తలఊపి ''పడకగదిలోనికిరా!'' అంటూ లేచి గదివైపు సాగాడు. భామ వంటింటివైపు కదలింది. పాలు అప్పుడే వచ్చినట్లున్నాయి. కాచి గ్లాసులో పోసుకుని, గదిదగ్గరకు వచ్చే సింది. పాలుత్రాగుతూ ఆమెవైపు చూశాడు. భామ ఇప్పుడు అతడికళ్ళకు వయ్యారిభామ లాగే ఉంది. ఇన్నిరోజులూ కన్పించని సౌంద ర్యం ఒక్కరోజే తెలిసినట్లు దగ్గరగా లాక్కున్నా డు. భామ కండ్లు మిలమిల మెరిశాయి. ''భామా! నీకు విముక్తి ప్రసాదిస్తాను. నాకు ఏమిస్తావు?'' అన్నాడు అవధూత. భామ కృత జ్ఞతతో అతన్నిచూసి ''నాది అనేది అంతా మీదే కదా? ఇంకేం ఇవ్వగలనూ, జీవితాంతం మీ పాదదాసిగా పడిఉంటాను'' అంది.

''ఇందులో నా స్వంతం అనేది చాలా ఆస్తి ఉంది. ఈ బాబాగాడి పీడవదలించుకుని ఇక్కడినుండి పారిపోదాం! ఎక్కడైనా హాయిగా బతుకుదాం'' అన్నాడు.

ఆమె అనుమానంగా అతడివైపు చూ సింది. ''బాబాగారు మహత్తుగలవారు! మన ల్ని వదలిపెడతారా? క్షణంలో పట్టుకుని నాశనం చేయగలరు కదా!''

వికటంగా నవ్వాడు అవధూత ''వాడో ము షివెధవ! మాలాంటివారినందరినీ చుట్టూ చే ర్చుకుని, మేము వాడిని గురించి పొగడి ఆకాశానికెత్తేస్తే మహానుభావుడూ, దైవ అవతా రంగా అభివృద్ధి చెందాడు. వాడి దగ్గర ఏ మహత్తులున్నాయ్? నాబొంద'' అన్నాడు.

ఆశ్చర్యంగా చూసింది భామ- ''అయితే ఇదంతా బోగస్ అన్నమాట. దేవునిపేరు చెప్పి మహత్తులు చూపిస్తున్నట్లు నటించి, జనాన్ని దోపిడీ చేయడమేనన్నమాట. మరి విబూది, కుంకుమ, వస్తువులు ఎలా గాలిలో సృష్టిస్తా డు?''

''మెస్మరిజం తెలిసిన ఎవడయినా అవి చేసి బజారులోనే అందరిముందూ చూపగలు గుతారు. దానికొరకు మంత్రాలు, మహత్తులు అవసరం లేదు. ఒక్కమాటలో చెప్పాలంటే కాషాయగుడ్డలే అవసరం లేదు. నిజమైన సన్యాసి ఏ గుడ్డలైనా కడతాడు లేదా నగ్నంగా నూ తిరుగుతాడు. ఈ వేషం జనాన్ని మోసంచేసి తమ పబ్బంగడుపుకోడానికి కొంద రికి ఉపయోగిస్తుంది. నాకూ అలాగే ఉపయో గించింది ఇంతవరకు. ఇక వీటితో నాకు అవసరం లేదు. మనిద్దరం హాయిగా ఎక్కడిక యినా వెళ్ళి బతుకుదాం''

అతని వాగ్దాటికి మురిసిపోయిన భామ అతని మెడ కౌగలించుకుని ''మీ ఇష్టప్రకారం నేను నడుస్తాను'' అంది. ముందు బయటప డితే తర్వాత పరిస్థితి ఆలోచించవచ్చని.

బయట గంటమోగడంతో అద్దంవైపు చూశా

డు అవధూత. భుజంగరావు వచ్చిఉన్నాడు. తల, గుడ్డలు సరిచేసుకుని హాలు మధ్యకు వచ్చాడు. "రాంరాం స్వామీజీ!" అన్నాడు భుజంగరావు.

"రాంరాం... రండి కూర్చోండి" అన్నాడు తాను కూర్చుంటూ.

"నా విషయం ఏంచేశారు?"

తల ఊపాడు అవధూత "మాట తప్పడం మాకు ఎన్నడూ లేదు. ఇంతకుముందే తెచ్చి సిద్ధంగా ఉంచాము" అంటూ లేచాడు "మీరు కూర్చోండి... క్షణంలో వస్తాను" అంటూ లోపలకు నడిచాడు. తిరిగివచ్చి కూర్చుని "మిగతా డబ్బు తెచ్చారా?" అన్నాడు. భుజంగరావు సూట్‌కేస్ నుండి వందరూపాయల కట్టలు ఐదు బయటకు లాగాడు. టీ పాయ్ మీద పెట్టాడు.

పిల్లవాడిని తీసుకొని వచ్చాడు ఒక వ్యక్తి. పిల్లవాడు ఏడుస్తున్నాడు. "మా అమ్మను చూపించండి, నేను వెళ్తాను" అన్నాడు ఏడుస్తూ.

"మీ అమ్మదగ్గరకేరా నాయనా! ఈయన వెంట వెళ్ళు! మీ అమ్మదగ్గరకు చేరుస్తాడు"

పిల్లవాడు భుజంగరావు వైపు చూశాడు నిజమా? అన్నట్లు.



భుజంగరావు పిల్లవాడివీపు నిమిరాడు. "నీకేం భయంలేదు బాబూ! మీ అమ్మదగ్గర నేను విడిచిపెడతాగా!" అన్నాడు బుజ్జగిస్తూ. పిల్లవాడిని తీసుకుని బయటకు వచ్చి కారు ఎక్కాడు.

వెళ్ళిపోతున్న కారును చూశాడు అవధూత. బరువుగా ఊపిరిపీల్చి వదిలాడు. మళ్ళీ గంట విన్పించేసరికి అద్దంలో చూశాడు. ప్రహరీగేటు దాటి నలుగురు సాధువులు వస్తున్నారు. నలుగురినీ గుర్తుపట్టాడు. వాళ్ళు లోపలకు వచ్చి "రాంరాం స్వామీజీ!" అన్నారు. అందరినీ వరుసగా కుర్చీలలో కూర్చోమన్నాడు.

"ఏమిటి విశేషాలు?" అన్నాడు వారివైపు చూస్తూ. తాము చేసినపని, సాధించిన పనులు వరుసగా చెప్పారు.

"మొత్తం ఎందరున్నారు మీ స్వాధీనంలో?" అన్నాడు అవధూత.

"ముప్పైమంది పిల్లలున్నారు స్వామీజీ! వీరిని తీసుకురావడానికి ఎన్నో ప్రయాసలు పడ్డాం. ఎన్ని బాధలు పడ్డామో మాకే తెలును. తమరు కనికరం చూపి తగిన బహుమతి ఇవ్వకుంటే ఇక ఈ పనులకు ఎన్నడూ వెళ్లం" అన్నాడు ఒకరు.

తల ఊపాడు అవధూత. "ఒక్కొక్కరికి ఏడువందల చొప్పున ఇప్పిస్తాను. మీ కష్టఫలాన్ని ఉచితంగా అనుభవించడం మాకు ఇష్టం లేదు" అన్నాడు.

నలుగురూ ఒకరిమొఖాలు ఒకరు చూసుకుని, ఆశ్చర్యంతో అవధూతవైపు చూశారు.

రెండు వందలకంటే ఇవ్వడనీ, మహా పెంచితే పాతిక రూపాయలు పెంచవచ్చనీ ఆశించినవారికి ఏడు వందలంటే విచిత్రంగా, తమాషాగా ఉంది. కాని స్వామీజీ అలా మాట్లాడే మనిషి కాదు గనుక, నిజమేనని నమ్మారు.

"దేవుడు మిమ్మల్ని కరుణించి ముక్తి ప్రసాదిస్తాడు" అన్నారు నలుగురూ.

అవధూత మాట్లాడలేదు. అందరూ గంజాయి దమ్ము లాగడంలో నిమగ్నమయ్యారు. అందులో లీనమయి తన్మయత్వం చెందుతున్నారు.

"మరి మేం వెళ్తాం. మాకు డబ్బు అవసరం కూడా" అన్నాడు ఒక వ్యక్తి.

"సరే!" అంటూ కాగితం మీద వారికి రావలసిన డబ్బు రాశాడు. భామ ఆ మొత్తం డబ్బులు తీసుకుని వచ్చి టేబుల్‌పై పెట్టింది.

వాళ్ళు మహదానందంతో నోట్లను జోలెల్లో దూర్చారు. లేచి "తిరిగివస్తాం స్వామీజీ! పిల్లలకొరకు వ్యాను పంపించండి" అన్నారు.

అవధూత కూడా లేచి నిలబడి "మీరు అక్కడకు చేరేసరికి వ్యాను వస్తుంది. వెళ్ళిపొండి" అన్నాడు తలపంకించి. నలుగురూ బయటకు వచ్చారు. ఫోన్‌చేశాడు అవధూత. వ్యాను తీసుకుని వెళ్ళి పిల్లల్ని తీసుకురమ్మని మరో గంటలో ముప్పైమంది పిల్లలతో వ్యాను లోపలికి వచ్చింది. పిల్లలను ఒక్కొక్కరినే తెచ్చి హాలులో నిలిపారు. బాగా డస్సిపోయి ఉన్నారు. బిక్కముఖాలతో ఏడ్చే సత్తువకూడా కోల్పోయి, తల వేలాడేసి నిలబడ్డారు. అందరినీ పరకాయించి చూశాడు అవధూత. ఒక్కొక్కరి శరీరం పరీక్షించి చూస్తూ, వారి పుట్టుమచ్చలు ఇతర అవయవాల గురించి ముగ్గురు పుస్తకంమీద రాస్తున్నారు. వారి పరీక్ష పూర్తవుతూనే ముగ్గురూ పుస్తకాలు అవధూతకు అందించి పిల్లలను లోపలికి తీసుకువెళ్ళారు. మందిరానికి ఫోన్‌చేశాడు అవధూత. బాబాకు పిల్లల సమాచారం గురించి వివరంగా చెప్పాడు. ఆ పిల్లలను ఏంచేయాలో నిర్ణయించవలసింది ఆయనే.

లోపలకు వచ్చాడు అవధూత. పిల్లలు ఏడుస్తూ పెడబొబ్బలు పెడుతున్నారు. తిండి తినడానికి కొందరు సిద్ధపడితే మరికొందరు తినకుండా మొరాయిస్తున్నారు. ఆ భవనమంతా సౌండ్‌ప్రూఫ్ చేసింది కావడంవల్ల లోపలిమాటలు బయటకు విన్పించే అవకాశమేలేదు. ఆ పిల్లల మీద జాలికలిగేవాళ్లు ఎవరూ అక్కడ లేరు. ఒక్క ముదుసలి తప్ప. ఆమెకూడా అక్కడ బానిసగా పడిఉంది గనుక, ఆమె జాలి ఆమెనే కాపాడేస్థితిలో లేదు. వీళ్లందరినీ తెచ్చి ఏంచేస్తున్నారో ఆమెకీ తెలియదు. అయినా ఏదో జరుగుతుందని ఆమె ఆలోచిస్తున్నది.

"ఏయ్ ముదుసలీ... పిల్లలను ఓదార్చ

కుండా నిలువుగుడ్లతో నిలబడ్డావేం'' అంది భామ అప్పుడే అక్కడకు వచ్చి. ఆమెవైపు చూసింది ముసలమ్మ. యవ్వనపు పొంగుల్లో మెరిసిపోతున్న ఆమెకు యవ్వనానికి తగిన దుస్తులుకూడా అమరడంతో రంభలాగే ఉందనుకుంది. చూడటానికి అంత అద్భుతంగా ఉన్నా ఆమె ఎందుకంతకరకుకసాయిగా పిల్లలయెడల ప్రవర్తిస్తుందో ముసలమ్మ ఊహించలేకపోతున్నది. ఆడదానికి భూతదయ, పిల్లల మీద ప్రేమ ఎక్కువఅంటుంటారు. ఈమెలో అవేమీ కన్పించడంలేదు.

"నీ ఆలోచనలు తర్వాత! ఇల్లువగిలేలా ఉన్న పిల్లగాళ్ల అరుపులు ఆపి, ఓదార్చు'' అంది భామ కరకుగా. పిల్లల దగ్గరకు వెళ్తున్న ముసలమ్మను అసహ్యంతో చూస్తూ గిరుక్కున వెనుకకు తిరిగి పడకగదిలోనికి వచ్చింది. ఆ సమయంలో తానూ అక్కడ ఒక బందీనేనని ఆమె ఆలోచించలేకపోతున్నది. తనకంటే తక్కువస్థాయిలో పడిఉన్న మరో బానిస మీద అధికారం చెలాయించడానికి తాపత్రయపడుతున్నది. మంచంలో పడి అటుఇటూ పొర్లుతూ ఆలోచిస్తున్నది.

గంట మోగడంతో విసుగ్గా లేచింది. 'రాత్రింబవళ్ళు ఇదే మోత! నాప్రాణం తీస్తున్నది' అనుకుంటూ లేచి అవధూత కొరకు లోపలకు పరుగెత్తింది.

* * *

బాబాను కలుసుకోవడానికి నరశింహారావు వచ్చాడు. ఆరోజు ఆఫీసులో అవధూత లేడు. టౌనులోనే ఉన్నాడు. బాబా మందిరం వద్దకు వెళ్లి గంట మోగించాడు. సేవిక వచ్చి అతన్ని చూసి "ఏమిటండీ?" అని అడిగింది.

"బాబాగారితో మాట్లాడాలి, నరశింహారావు వచ్చాడని చెప్పు''

ఆమె లోపలికి వెళ్ళి తిరిగివచ్చి "రండి" అంది. ఇద్దరూ లోపలకు వెళ్లేటప్పటికి బాబా ధ్యానంలో ఉన్నారు.

"నరశింహారావూ! కూర్చో!" అన్నారు. నరశింహారావు బాబాముందు సాష్టాంగ నమస్కారంచేసి లేచి కూర్చున్నాడు.

"నన్ను పిలిపించారట. నేను నిన్న కాంట్రాక్టుపనులమీద వెళ్లడంవల్ల రాలేకపోయాను. ఈరోజు కబురుతెలిసి తమ దర్శనం చేసు

కుందామని పరుగున బయలుదేరివచ్చాను'' అన్నాడు భక్తిపారవశ్యంతో చేతులు జోడించి.

''అవును... నిన్ను పిలిపించినమాట వాస్తవమే. నీకో సహాయం చేయదలచాను''

''చెప్పండి స్వామీ! నామీద తమరికి అంత దయకలిగిందంటే నేను అదృష్టవంతుడిని'' అన్నాడు.

''నీయింటి పెరటిలో నిధి ఉందన్న విషయం నీకు తెలుసుగదా?''

''తెలుసుస్వామీ! తమరే నాకు గతంలో సెలవిచ్చారు.''

''అబద్ధం పలుకుతున్నావు. అక్కడ శిలాఫలకం ఉందని నువ్వే మాకు చెప్పావు. దానికి మార్గంకూడా నువ్వే చెప్పావు''

''చిత్తం స్వామీ! తప్పుగా మాట్లాడాను, క్షమించండి''

''ఇప్పుడు క్షమాపణలతో పనిలేదు, ఆ నిధిని పొందడానికి నీకో అవకాశం కల్పించదలచుకున్నాను. ఇంతవరకూ మాకు నీవుచేసిన సహాయసహకారాల్ని దృష్టిలోపెట్టుకుని చెబుతున్నాను''

''చెప్పండి స్వామీ! వెంటనే ఆచరిస్తాను''

నరసింహారావుకు కొండ ఎక్కినంత సంతోషంగా ఉంది. ఆ నిధిని లాగడానికి ఎన్ని ప్రయత్నాలుచేసినా ఇంతవరకూ అతడికి సాధ్యం కాలేదు. చూస్తూ చూస్తూ ఎవడూ తన కొడుకును 'బలి' కొరకు అమ్మడు. బలిపశువు దొరకడం అసాధ్యం అని నిశ్చయించుకుని ఆ ప్రసక్తే మానుకున్నాడు. గతంలో బాబా తప్పకుండా సహాయం చేస్తారని అవధూత చెప్పడంతో అతడికి కొంత ఆశ కలిగింది. ఈరోజు బాబాయే స్వయంగా పిలిపించి నిధిని గురించి చెబుతుంటే, ఆ నిధి తనచేతిలో ఉన్నట్లే కలలుకంటూ కూర్చున్నాడు.

''నీకానిధి వెంటనే అందే అవకాశం లేదు. శాస్త్రాలన్నీ నీ కొరకు ప్రత్యేకంగా తిరగేసి చూశాను. నా మనోయోగం ద్వారా కూడా తెలుసుకున్నాను. నరబలి ఇచ్చినా కనీసం ఆరునెలలకుగానీ ఆ ధనం పొందే యోగం నీకులేదు''

''అంతవరకూ ఓర్చుకోగలను స్వామీజీ! అయినా బలి ఇవ్వడానికి నాకు ఎవరూ అందుబాటులో లేరు. అందువల్లనే దానిమీద ఆశ వదులుకున్నాను. మీరిస్తున్న హామీవలన ఆశ కలిగినా, ఈ బలిపశువుని ఎలా తేగలనో నాకు అర్థం కావడం లేదు''

''అందుకు నీకు మార్గం చెబుతున్నాను. ప్రతి మనిషీ జీవితంలో ముందు తన సుఖం కోరుకుంటాడు. అలాగాక పరుల సుఖం ముందు కోరానని ఎవరయినా చెబితే వాడంత దగుల్బాజీ మరొకడు ఉండడని అర్థం చేసుకో! నీకు కొన్ని రహస్యాలు నేను చెబుతున్నాను. అవి నీవు దాచి ప్రవర్తించడంపై నీ భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. ఈ రహస్యాలు ఒక్క అవధూతకు తప్ప మరెవరికీ తెలియనివి! నీకు మాత్రమే తెలుపుతున్నాను'' రెండుసార్లు నొక్కిపలికాడు బాబా!

నరసింహారావు తల ఆడిస్తూ ''నా శరీరం, మనస్సు మొత్తం మీకొరకు అర్పణ చేస్తున్నాను స్వామీ! నా ప్రాణంపోయినాసరే ఎటువంటి రహస్యాలు బయటకు రావు'' అన్నాడు దృఢంగా.

బాబా చెయ్యెత్తి ఆశీర్వదించాడు నవ్వుతూ. ''మంచిది, మంచిది'' అన్నాడు.'' ఒకవేళ బయటపడినా నష్టం నీకే! నాకేమీ నష్టం జరుగదు. నీకు కావలసిన బలిపశువు అవధూత సరఫరా చేస్తాడు. అతడికో లక్ష రూపాయలు పరిహారంగా చెల్లించు. నీవుగాక మరొకరికయితే రెండు లక్షల వరకూ అవుతుంది. నీకొరకు నేను అతనికి చెప్పగలను. ముందు నీపని కానియ్! ఆ తర్వాత నీకు నాద్వారా కూడా మంచి యోగం కలుగుతుంది. నీ భవిష్యత్తు బంగారు పడవలా తయారవుతుంది''

''లక్ష రూపాయలు ఒకేసారి తీసుకురాగలశక్తి నాకు లేదు స్వామీ! తమరు నామీద కనికరించాలి.''

''అది నా బాధ్యత కాదు. అవధూత అంతకు తక్కువ అయితే అంగీకరించడు'' అన్నాడు బాబా.

కొద్దిసేపు ఆలోచించి ''పోనీ ఆ ఖర్చు నేను భరిస్తాను. నీపని నిర్విఘ్నంగా జరుపుకో! ఆ తర్వాతనే డబ్బును సమకూర్చు! ఇదయినా

నీలాంటి ప్రియశిష్యుడికొరకు అంగీకరిస్తున్నాను''

నరసింహారావు మరోసారి బాబా పాదాలకు తలతాకిస్తూ సాష్టాంగ నమస్కారంచేసి, బాబా పాదధూళి నొసట ధరించాడు. సంతోషంతో అతని గుండె ఊపిరిపీల్చడం ఆగిపోయినట్లయింది. ''నా శరీరం వలిచి చెప్పులు కుట్టించి మీ రుణం తీర్చుకుంటాను స్వామీ!'' అన్నాడు.

''సరే వెళ్ళు... అవధూత దగ్గరకు వెళ్ళు! అతడికి నేను వార్త పంపిస్తాను''

నరసింహారావు సంతోషంగాలేచి భక్తితో నమస్కరించి బయటకు సాగాడు. బాబా దివ్యశక్తులుగలవాడనికానీ, లేనివాడనికానీ అతడు ఎప్పుడూ ఆలోచించలేదు. బాబాకు చాటుమాటు వ్యాపారం ఏదోఉందనీ, దానివల్లనే అతడు అంతులేని ఆస్తి సంపాదిస్తున్నాడనీ మాత్రం ఆలోచించాడు. అదేమిటో అతడికి ఎంతకూ అంతుపట్టలేదు. క్రమక్రమంగా పరిస్థితి అర్థమవుతోంది. తననుండి కారు కోరడంతో బాబా శక్తిమీద అనుమానం ఏర్పడింది. ఆ కారులో పిల్లవాడిని అపహరించడంతో ఇదేదో పిల్లలను దొంగిలించే వ్యవహారంగా భావించాడు. ఆ పిల్లలను ఎందుకు ఉపయోగిస్తారో అతనికి తెలియదు. ఈరోజు బాబా చెప్పినదాన్నిబట్టి చూస్తే, అవధూతను అడ్డుబెట్టుకుని నరబలికి కావలసిన పిల్లవాడిని బాబాగారే తనకు అందిస్తున్నట్లు భావించాడు. అవధూత విలువ అక్కడ పెద్దదేఅయినా బాబాను కాదని అతడు ఏపనీ చేయడు. పిల్లవాడిని తెచ్చి నరబలికి అప్పగించడమంటే, బాబాకు సంబంధం లేకుండా అవధూత పనిచేయడం కల్ల. ఇదంతా బాబా మాయాజాలమే. అయినా ఎవరైతే తనకెందుకు? తనకు కావలసింది సంపాదన. దానికొరకు అనేక చెడుదారులు తొక్కాడు. ఇప్పుడు మరిన్ని అడ్డదార్లు తొక్కడానికి తాను వ్యతిరేకి కాదు. ఈ దేశంలో నిజాయితీగా డబ్బు సంపాదించి, కోట్లకు పడగెత్తినవాడు ఎవడూ లేడు. ఎవడూ అనుసరించని నీతి తాను ఒక్కడే అంగీకరించవలసిన అవసరం, అనుసరించవలసిన బాధ్యత తనకు లేదు. దొరికినంత అందుకోవడమే తన పని. బాబాకు లక్ష రూపాయలు ఇవ్వడమో, ఇవ్వకపోవడమో తర్వాత విషయం. ముందు నరబలికి కావలసిన పిల్లవాడు తనకు ఉచితంగా దొరుకుతాడు. తన ఇంటిలోని నిధులు స్వంతం చేసుకోవడానికి అన్ని ప్రయత్నాలు చేస్తాడు. ఆ నిధి దొరికితే తాను ఐశ్వర్యవంతుడవుతాడు. ఆ తర్వాత కూడా గోదావరి గోదావరిగానూ, కృష్ణ కృష్ణగానూ పారుతూనే ఉంటుంది.

కారులో అవధూత నివాసం దగ్గరకు వచ్చేసరికి అవధూత ఎక్కడికో బయలుదేరుతున్నట్లుంది. నరసింహారావును చూసి చిరునవ్వుతో చేయి పైకెత్తాడు.

''రాం రాం స్వామీజీ!'' అన్నాడు నరశింహారావు చేతులు జోడించి.

''రాం రాం!'' అంటూ నరసింహారావు చేతులు పట్టుకున్నాడు అవధూత.

''ఇప్పుడే మీగురించి బాబాజీ నాకు ఫోన్ చేశారు. మీరు వస్తారనే ఎదురుచూస్తున్నాను'' అంటూ లోపలకు దారి తీశాడు.

అవధూత అంతటివాడు తనకోసం ఎదురుచూస్తూ నిలబడవలసిన అగత్యం లేదు. అవధూత ముందు తాను మర్రిచెట్టు కింద ఉమ్మెత్తమొక్కలాంటివాడు. ఇపుడు అతని అవసరం కొద్దీ తనకోసం బయట నిలబడ్డాడు. బాబానుండి తనను గురించి ఫోన్ రావడంతో, బాబా వద్ద తన ప్రాపకం పెరిగిపోతున్నదన్న ఉద్దేశంతోనే ఆ మాత్రం గౌరవం ఇచ్చాడు.

ఇద్దరూ హాలులో కుషన్ కుర్చీలమీద కూర్చున్నారు. కాళ్ల కింద మెత్తటి దిండ్లు తగులుతున్నాయి. భామ ఇద్దరికీ కూల్‌డ్రింక్స్ తెచ్చి అందించింది.

''భామా... ఇతడు మన బాబాజీగారి ప్రియశిష్యుల్లో ఒకరు. పేరు నరసింహారావుగారు'' అని చెప్పి, నరసింహారావుతో ''ఈమె నా కొరకు నియమించబడిన సేవిక. పేరు భామ...'' అంటూ పరిచయం చేశాడు.

భామ అతడి కళ్లలోకి దీర్ఘంగా చూస్తూ నమస్కారం చేసింది. ఫుల్‌సూటులో నున్నగా వున్న అతడిని చూసి ఆమె మనస్సు చలించింది. ముక్కిపోయిన శరీరం, అసహ్యించుకునే గడ్డంతో తనముందు తిరిగే అవధూతనూ, నరసింహారావునూ పోల్చిచూస్తే

నక్కకూ, నాగలోకానికీ ఉన్నంత తేడా? ఇంతకు ముందు కూడా అతన్ని ఇదే హాలులో చూసింది. కానీ బాబా శిష్యుడుగా భావించలేదు. అవధూతతో వ్యాపారం కొరకు వచ్చి ఉంటాడనుకుంది.

ఆమె లోపలకు వెళ్తూనే "చెప్పండి నరసింహారావుగారూ! ఏమిటి విశేషాలు?" అన్నాడు చిరునవ్వుతో అవధూత. ఇంతకుముందు తనను వెంట్రుకలా చూసిన అవధూత ఇప్పుడు గడకర్రకు ఇచ్చిన విలువ ఇస్తుంటే అతడు సంతోషపడ్డాడు.

"బాబాగారు మీకు ఫోన్‌చేసి అన్ని వివరాలూ చెప్పగలనన్నారు"

"చెప్పారు కూడా! మీ ఇంటిలోని నిధిని సంపాదించుకోడానికి మీకు బలిపశువు కావాలి. ఆ బలిపశువును నేను మీకు సప్లయి చేయాలి. అంతేగా?"

అంతేనన్నట్లు తల ఊపాడు నరసింహారావు.

"తప్పకుండా అప్పగిస్తాను. మరి పూజాదికాలు మీరు నిర్వర్తించుకుంటారా? అవి మేమే నిర్వర్తించే ఏర్పాటు చేయమంటారా? బాబాగారు ఈ విషయం ఏమీ చెప్పలేదు. అయినా మీరు ఇప్పుడు మా ఆంతరంగికులు గనుక అడుగుతున్నాను. అవసరమయితే సహకారం చేద్దామని నా ఉద్దేశం."

"పూజాదిక క్రతువులు నిర్వహించడానికి చాలామంది పురోహితులు దొరుకుతారు గానీ, ఇది సీక్రెట్ వ్యవహారం! నరుణ్ణి బలి ఇచ్చేదానికి ఎవరూ అంగీకరించరు. మీరు ఈ సహాయం తప్పకుండా చేయవలసిందిగా కోరుతున్నాను"

తల ఊపాడు అవధూత. చిలుము గొట్టంలో గంజాయి పోసి తెచ్చింది భామ. ఆ సమయంలో దాని అవసరమే లేదు. కానీ నరశింహారావును చూడాలనీ, అతడు తనను చూడాలనీ ఆమె ఆతృత. అందుకే ఆ సమయంలో తెచ్చింది. ఆ విషయం అవధూత సులువుగానే గ్రహించాడు. "భామా... లోపలకు వెళ్లు! అతిథులతో మాట్లాడేటప్పుడు రాకూడదని తెలియదా?" అన్నాడు తీక్షణంగా.

"అతడు మన అతిథి కాదుగదా స్వామీజీ" అన్నది సౌమ్యంగా.

"ప్రస్తుతం అతడు మనకు అతిథే. లోపలకు వెళ్లు. మేము మాట్లాడుకోవలసినవి చాలా ఉన్నాయి"

ఆమె విసవిసా లోపలకు వెళ్లింది.

అవధూత తలతిప్పి నరశింహారావువైపు చూశాడు. అతడు ద్వారం వైపు చూస్తున్నాడు.

"సరే... ఏర్పాట్లు ఎప్పుడు చేద్దామనుకుంటున్నారు?"

"మీరే సూచించండి! అంతా మీ ఇష్టప్రకారమే నడిపించండి"

"రేపు అర్ధరాత్రి మంచిదినం. మీ ఇంట్లోవారిని మరెక్కడికైనా తరలించండి. ఆ యింట్లో ఎవరూ ఉండకుండా చూడండి"

తల ఊపాడు నరసింహారావు. సెలవు తీసుకొని బయటకు వచ్చాడు. ఇంటికి వచ్చేసరికి భార్య మంచంమీద పడుకుని ఉంది. మూడున్నర అడుగుల వెడల్పుగల మంచానికి నిండుగా ఉంది ఆమె. చిరునవ్వుతో ఆమెవైపు చూస్తూ "సుజా... ఈ రోజు నువ్వూ, పిల్లలూ మీ పుట్టింటికి వెళ్ళాలి" అన్నాడు.

ఎన్నడూ చూపించని అతడి అభిమానానికి ఆమె చకితురాలయింది.

"ఎందుకూ... అడ్డంగా ఉన్నాననా? ఇంతవరకూ బయట తిరుగుతున్నారు; ఇక ఇంటికే పిలిపించుకుని సంసారం సాగిద్దామనా?"

"ఛీఛీ... పాడు మాటలు! ఎప్పుడూ అవిధంగా ఊహించుకుంటూ జీవితం నరకంగా తయారుచేసుకుని, నన్నూ నరకంలోనికి లాగుతున్నావు. నీ సుఖం కొరకే నేను ఏ పనిచేసినా, ఇప్పుడూ అంతే" అన్నాడు పక్కలో కూర్చుంటూ. ఆమె లేచి కూర్చుని "ఎందుకో చెప్పు" అంది తిరిగి.

"మనింట్లో 'నిధి' గురించి తెలిపే ఫలకం ఉంది చూశావా?"

చూశానన్నట్లు తల ఊపిందామె.

"ఎన్నాళ్లు ఇట్లా నానాగడ్డి తిని సంపాదించి బతుకుతాము? ఆ నిధిని ఎలాగయినా చేజిక్కించుకుంటే ఆ తర్వాత సుఖంగా బతకవ

చ్చు. మన పిల్లల భవిష్యత్తుకు ఎంతో మంచిది. ఆ నిధి కొరకు రేపు హోమం చేయిద్దామనుకున్నాను. హోమం చేయాలంటే ఇంట్లో ఆడవాళ్లు ఉండకూడదట''

అతని మాటలు ఆమెకు కూడా ఆమోదించగలిగేవిగానే ఉన్నాయి. ఎన్నాళ్ళీ జీవన పోరాటం? ఆ నిధి దొరికితే హాయిగా జీవించవచ్చు. ఆమెకు మరో అనుమానం వచ్చింది. భర్తవైపు పరీక్షగా చూస్తూ అంది-

''మరి నరబలి పెట్టాలని అందులో రాశారు గదా! అది సాధ్యమయ్యే పని కాదుగదా''

''అదంతా నేను చూసుకుంటాను. నీకెందుకా బాధలూ, అనుమానాలూ? నీవు లక్షణంగా పుట్టింటికి వెళ్ళి రెండు రోజులుండి తిరిగిరా అప్పటికి అన్నీ సమకూరతాయి. అనవసరంగా ఊహించి మెదడు పాడుచేసుకోవద్దు''

తన భర్త ఎవరినో బలి ఇవ్వడానికి సిద్ధపడ్డాడని తెలియడంతో ఆమె గుండెలు గుబగుబలాడాయి. ఆ విధంగా ఉచ్చు మెడకు తగిలించుకోవలసిన స్థితి ఏర్పడుతుందేమోనని భయపడుతున్నది. అందునా ఒక మనిషిని నిలువునా చంపడమంటే ఎంత భయంకరం?

మరి ఆస్తి సంపాదించాలంటే తప్పదేమో అనుకుంది. పది రూపాయల కొరకు కత్తితో పొడిచి చంపే దౌర్భాగ్యులు జన్మించిన ఈ దేశంలో లెక్కలేనంత ఆస్తి 'నిధి' ఉందని తెలిసిన తర్వాత ఒక ప్రాణం తీయడానికి వెరచి ఆస్తి పోగొట్టుకోగలరా? భర్త చెప్పేది సబబుగానే తోచింది. రెండురోజులు పుట్టింట్లో ఉండివద్దామనుకుంది.

ఆమె అంగీకారం తెలియడంతో సంతోషించాడు నరసింహారావు. ఆమె నరబలికి అంగీకరించదేమోనని ముందు ఆలోచించాడు. ఆమె వెళ్లకుంటే ఏ విధంగా వెళ్లనంపాలా అని ఆలోచిస్తున్నాడు. ఆమె స్వయంగా ఒప్పుకోవడంతో అతనికి చిక్కుముడి విడివడినట్లయింది. అప్పటికప్పుడే ఆమెను గుడ్డలు సర్దుకోమని చెప్పి, ఫోన్‌వద్దకు నడిచి రైలుస్టేషన్‌కు ఫోన్ చేశాడు. మరో నాలుగు గంటలవరకూ రైలు లేదని తెలిసి, స్కూలుకు వెళ్ళిన పిల్లల కొరకు కారులో వెళ్లాడు.

నరసింహారావు తిరిగి వచ్చేసరికి సుజాత గుడ్డలు సర్ది సిద్ధంగా ఉంది. ఒకవైపు ఆమె గుండె గుబగుబలాడుతున్నది. మరోవైపు ఆశ ఆమెను పీడిస్తున్నది. ఎట్టకేలకు ఆశ జయించింది.

''మీరు జాగ్రత్త! లేనిపోనివన్నీ మెడకు తగిలించుకుంటున్నారు'' అంది భర్త కళ్ళల్లోనికి చూస్తూ. అంతవరకూ 'నీవు' అనే తప్ప 'మీరు' అని ఆమె నోటివెంట వినని నరసింహారావు ఆశ్చర్యపోయాడు. ఆమె చెప్పే ప్రతిమాటకూ తలఊపాడు. ఆమె ఎంత తొందరగా వెళ్ళిపోతే అంత మంచిదని అతడు అనుకుంటున్నాడు. సఖ్యతలేనివారి సంసారంలో ఈ 'నిధి' ఈరోజు సఖ్యత కలుగు చేసింది. భర్తను గౌరవించదలచుకొని ఆమె, ఈ 'నిధి'ని సాధించడానికి అతడు పడేపాట్లు చూసీ, అది దొరికితే తాము బ్రతికే గొప్ప బ్రతుకు గురించీ తలచుకుని అతన్ని గౌరవించదలచుకుంది.

కారులో రైలు స్టేషన్‌కు చేర్చాడు. రైలు వస్తూనే ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటు ఎక్కించి, కదలిపోతున్న రైలును చూస్తూ దీర్ఘంగా ఊపిరి పీల్చి వదిలాడు. అక్కడికి ఓ పెద్ద భాగోతం పూర్తి అయిందనిపించింది. ఆమెను ఇంట్లో పెట్టుకుని ఏంచేయడానికి సాధ్యంకాదు. అక్కడి నుండి క్లబ్‌కు వచ్చాడు. సమితి అధ్యక్షుడు కలిసి పలుకరించాడు.

''ఎక్కడి నుండి రావడం?''

''మాశ్రీమతి పుట్టింటికి వెళ్తుంటే స్టేషన్‌కు వెళ్ళి రైలు ఎక్కించివస్తున్నానండీ!'' అన్నాడు రావు. అతన్ని పరీక్షగా చూశాడు సమితి అధ్యక్షుడు. నరసింహారావు చాలా మారాడనుకున్నాడు. సంవత్సరంకిందట చిన్న చిన్న కాంట్రాక్టుల కొరకు తనదగ్గర దేబిరిస్తూ తిరిగిన వ్యక్తి ఈరోజు కారులో తిరుగుతున్నాడు. ఇదంతా బాబా మహిమే అనుకున్నాడు. బాబా మందిరం నిర్మాణం పూర్తయిన తరువాత అతని వద్దకు వెళ్ళి వచ్చేవారందరూ ఉన్నతంగా పెరిగిపోతున్నారు. సంఘంలో వారి పరపతి, గౌరవం పెరిగిపోతున్నది. బాబా మహిమలు వారికి రక్షగా పనిచేస్తున్నాయి.

''కన్పించడంలేదేమిటి?'' అన్నాడు అతడి దగ్గరకు కుర్చీ లాక్కుంటూ.

"ఏదో ఒక సంపాదన కొరకు ప్రయత్నించా లికదండీ? జీవన పోరాటం చేస్తున్నాను"

"బాబాగారిని కలుద్దామనుకుంటున్నాను. ఎప్పుడూ ఏవో పనులు! తీరిక దొరకడంలేదు. రేపు బాబాగారిని కలుద్దామా?"

తల ఊపాడు నరశింహారావు. "ఆయన దర్శనం చేసుకోవాలంటే ముందే అనుమతి సంపాదించుకోవాలి. ఎకాఎకిన వెళ్తే మనల్ని పలుకరించేదిక్కుండదు"

"ప్రయత్నించి చూడు; అనుమతి దొరికిన తర్వాతే వెళ్దాం!" బాబాగారి శిష్యుడుగా నరశింహారావుకు అప్పటికే గుర్తింపు రావడంతో చాలామంది అతడివద్దకు వచ్చి కుశల ప్రశ్నలువేశారు.

బాబావల్ల తనకు గౌరవం పెరుగుతున్నందుకు అతడికి బాబామీద భక్తి మరింత పెరిగింది. ఈలోకంలో నిజానికి డబ్బు సంపాదించేవాడూ, దానికి కారకుడయ్యేవాడి మీద ఉండే ప్రేమ, భక్తి నీతి నిజాయితీ గలవాడి మీద ఎన్నడూ చూపించరు. ఆడది వ్యభిచారంచేసి సంపాదించినా, మగవాడు గుండెల్ని పిండి సంపాదించినా, డబ్బు పోగుచేస్తేనే వారికి ఎక్కడలేని గౌరవమర్యాదలు దొరుకుతాయి. అంతకుముందు నీచంగా దూషించినవారూ, నిందలువేసినవారు కూడా వారిని నెత్తిన పెట్టుకుని పూజించడానికి సిద్ధపడతారు. ఇదీ నరశింహారావు నిర్ధారించుకున్న సత్యం.

ఇంతవరకూ ఆ క్లబ్బుకు కొన్ని వందల వేలసార్లు వచ్చాడు. మరి ఎప్పుడూ ఇవ్వని గౌరవం ఈమధ్య అందరూ ఇస్తున్నారు. గేటు వద్ద నిలబడే కాపలావాడు తనను చూపి నిర్లక్ష్యంగా ఉండేవాడు! ఈమధ్య అల్లంతదూరంలో తనకారు కనిపిస్తూనే వంగ నమస్కారం చేయడానికి డ్రస్ సరిచేసుకుంటున్నాడు. ఇక ఆఫీసర్లు నాయకులు కనిపించినవెంటనే అంతకు ముందు మాట్లాడేవారిని అలా వదిలి తనను 'హలో' అంటూ పలకరిస్తున్నారు. ఈ పలుకరింపు కొన్నిసార్లు శృతి మించుతున్నది కూడా! దానికి కారణం రెండుచేతులా డబ్బు, కారు, బంగళా సంపాదించడమేకాదు, ఆ ప్రాంతంలో మహత్తుగలవ్యక్తిగా ఆరాధించబడే బాబాకు తాను ప్రియశిష్యుడని తెలియడంవల్లకూడా ఈ గౌరవం ఏర్పడుతున్నది. తాను ఎలా డబ్బు సంపాదించాడో, సంపాదిస్తున్నాడో చాలామందికి తెలిసినా ఆ తప్పులు ఎవరూ చూపడంలేదు. వాళ్లుచూసేది తన ఆస్తి మాత్రమే.

నవ్వుకున్నాడు చిన్నగా! పేకాటవద్ద కూర్చుందామని ఆలోచించి కూడా, మళ్ళీ విరమించుకుని తిరిగి బయటకువచ్చి కారెక్కాడు.

రేపు చేయవలసిన కార్యానికి కావలసిన వస్తువుల లిస్టు అవధూత రాయించాడు. వాటిని కొనుగోలుచేసి, ఇంటికి చేర్చుకోవాలి. ఇతరులకు అప్పచెప్పితే అనుమానం వస్తుంది.

బజారుకు వెళ్లాడు. కావలసిన వస్తువులను కొని కారులో చేర్పించాడు. ఇంటికివచ్చి, వస్తువులన్నీ ఇంట్లో వదేసి, సినిమాకు బయలుదేరాడు. సినిమా చూస్తున్నంతసేపూ భామవైపు మనస్సు పోతున్నది. తన భార్యకు, భామకూ పోల్చిచూస్తే చాలా తేడా ఉంది. రుబ్బురోలు పాత్రంలా ఉండే తన భార్యనుండి శారీరక సుఖం, మానసిక సుఖం రెండూ అందడంలేదు. ఎప్పుడూ ఏదో విసుగు, కోపం, అకాలనిరాకరణ, ఆమెలో పెనవేసుకున్నాయి. వాటిని ప్రతిసారీ, ప్రతిపనిలోనూ చూపిస్తూనే ఉంటుంది.

భామ సన్నగా చలాకీగా, 'అందం అంటే ఇదే' అన్నట్లు ఉంటుంది. అవధూతవద్దకు వెళ్ళినప్పుడల్లా భామను చూస్తున్నాడు. అనమయంలో అవధూత పీక పిసికి భామను బయటకు తెస్తే బాగుంటుందనే ఆలోచన కూడా వచ్చింది. ఆ నడక, ఆ చిరునవ్వు, ఆ సుందరమైన దేహం, వడలి వాడిపోతూ, జేబురుగడ్డంతో ఉన్న అవధూత క్రింద నలిగిపోతున్నాయంటే రావుకు కంపరం పుట్టేది.

'భామను తాను పొందగలడా? లేదు... అవధూత అడ్డుపోతేగానీ భామను తాను పొందలేడు. భామ పతివ్రతేంకాదు. కానీ, భూతం అడ్డు ఉంది. ఆ భూతం ఎలా వదుల్తుందో అతడికి అర్థంకావడంలేదు. వదుల్తుందన్న నమ్మకమూ లేదు. ఆ భూతం ఉన్నంతవరకూ కనీసం

తాను ఆమెతో మాట్లాడను కూడా లేదు. ఏదోవిధంగా ఆమెను బయటకులాగాలి. భామ ముఖకవళికల్నిబట్టి, జడల బర్రెలాంటి అవధూత ఆమెను పెనవేసుకున్న భూతమేనని నిర్ధారించుకున్నాడు. అవసరమైతే బాబాగారి 'రికమెండేషన్' అయినా ఉపయోగించి ఆమెను బయటకు లాగాలి. బాబా తనమీద విశ్వాసం చూపుతున్నాడంటే, తన కార్యాల్ని తప్పకుండా నెరవేర్చగలడన్న నమ్మకం అతనికి కలిగింది.



బజారు నుండి వస్తున్న నరశింహారావుకు రోడ్డుమీద నడిచివస్తున్న గోవిందం కనిపించాడు. ఒకప్పుడు ఇద్దరూ ప్రియస్నేహితులు. ఒకే రూంలో, ఒకే స్కూలులో చదువు సాగించారు. ఆ తర్వాత గోవిందం ఉద్యోగం చేస్తున్నా కూడా ఒకరికొకరు సహాయం ఇచ్చిపుచ్చుకునేవారు. ఈమధ్య నరశింహారావు అంతస్థు పెరిగిపోయిన తర్వాత ఒకరికొకరు కొంత దూరంగా మసలుకుంటున్నా అప్పుడపుడు కలిసి తిరుగుతూనే ఉన్నారు.

కారు నిలిపి గోవిందాన్ని పలుకరించాడు. "కనిపించటంలేదే?" అన్నాడు.

"నేనెక్కడికి పోతాన్రా కనిపించకపోవడానికి? నువ్వే కనిపించడంలేదు. బాబాగారి పాదసేవ చేయడం ఆరంభించిన తర్వాత!" అన్నాడు గోవిందం నవ్వుతూ.

"అదేం లేదులే... రా కారెక్కు - వెళ్దాం"

ఇద్దరూ బార్ దగ్గర కారాపి దిగారు. లోపలకు వెళ్ళి కూర్చుని - "ఏం తీసుకుంటావ్?" అన్నాడు నరశింహారావు.

"ఏదయితే ఏం? అన్నీ మనకలవాటే!"

రమ్ తీసుకురమ్మన్నాడు బట్లర్‌ని.

"ఏమిటి విశేషాలు? గంగారాంను చూడక చాలారోజులయింది. ఎలా ఉన్నాడు. వాడో నాస్తిక మూర్ఖుడు. డబ్బు సంపాదించడమంటే ఏమిటో తెలియని పిచ్చివాడు. అనవసరంగా బాబాను తిడతాడుగానీ, బాబా శక్తిసామర్థ్యాలు తెలిసిఉంటే, ఏనాడో ఆయన పాదదాసుడై, ఈపాటికి బాగుపడేవాడే"

"నువ్వు బాబాగారి దయవల్లే ఇంతవాడినయ్యాననుకుంటున్నావా?"

"తప్పకుండా గోవిందం. ఆయన మహిమ అటువంటిది. ఆయన ముఖం ఒకసారి చూస్తే ఎంత నాస్తికుడయినా ఆస్తికుడుగా మారవలసిందే"

గోవిందం తలఊపి నవ్వాడు. "ఆ విషయాలు తర్వాత. నీ ఇంట్లో ఏదో నిధి ఉందన్నావు. దాన్ని సాధించాలని మాతో చెప్పేవాడివి. మరి దాని విషయం ఏమైంది? బాబాగారేమైనా దాన్ని సాధించి నిన్ను అభివృద్ధి చేశారా ఏమిటి? లేక నువ్వే దాన్ని సాధించావా?"

"ఇంకా పనికాలేదు. దానికొరకే ప్రయత్నంచేస్తున్నాను. అది సంపాదిస్తే ఇంకేం. ఈ దేశంలోని పార్లమెంటుసభ్యులందర్నీ డబ్బుతో కొని ప్రధానమంత్రినే కాగలను. ఈరోజు ఆ నిధి సంపాదించే ప్రయత్నం చేస్తున్నానులే"

"ఈ రోజేనా? అయితే నేనూ వస్తాను. నిధి ఎలా బయటకు వస్తుందో చూడాలి"

"త్రాగుతున్న రమ్ గుడ్డలమీద ఒలికింది నరశింహారావుకు. తను అనవసరంగా నోరు జారాననుకున్నాడు. గోవిందాన్ని అక్కడికి తీసుకెళ్ళి, ఆ వాతావరణం చూసి అతడు భయపడితే, భయపడి పారిపోతే, ఆ తర్వాత అందరికీ చెబితే, తన చేతికి నిధి రావడం సంగతేమోగానీ, సంకెళ్ళు వస్తాయి. ఈ సమయంలో ఇలా తాగుతూ కూర్చోవడం; తాగుడు మైకంలో ఏదేదో వాగడం... పనులకు అవరోధమవుతున్నదనుకున్నాడు.

"ఏరా! పలుకవేం! నేనేం నీకు దొరికే ఆ నిధి గుంజుకోవడం లేదులే! ఊరకే చూద్దామని! ఎప్పుడూ ఇలాంటి సంఘటల్ని చూడలేదు"

''ఈరోజు కేవలం పూజ చేస్తున్నాంరా! నిధి చేతికి రావాలంటే పూజచేసిన ఆరునెలలకే వస్తుంది. వచ్చిచూసేదేముంది?''

''చెప్పాగా ఇటువంటివి ఎప్పుడూ చూడలేదని! ఆ పూజే చూస్తాను''

గుటక వేశాడు నరశింహారావు ఏవిధంగా తప్పించుకోవాలో ఆలోచిస్తూ! ''వద్దులే! చాలా రహస్యంగా జరగాలని పురోహితులంటున్నారు. మరెప్పుడైనా తీసుకెళ్లి చూపిస్తాను. రెండవసారి కూడా పూజ చేయాల్సి ఉంటుంది''

గోవిందం నిరాశగా అతడి ముఖంలోకి చూశాడు. నరబలిఇస్తేగాని ఆ నిధి చేతికిరాదని నరశింహారావు గతంలో ఓసారి చెప్పాడు. అది చేతగాకనే ఆ నిధి జోలికి వెళ్లడంలేదని కూడా చెప్పాడు. ఈరోజు పూజ చేస్తున్నాడంటే నరబలి చేయడానికి సిద్ధపడుతున్నట్లే గదా! అయితే ఎవరిని, ఏవిధంగా బలి ఇస్తాడు? చేసేదెవరు? చేయించుకునేదెవరు? ఇవన్నీ ఆసక్తికరంగా ఉన్నాయి. ఆ నరబలి చూడాలన్న ఉత్సాహం అతడిలో ఉంది. కాని నరశింహారావు నరబలి గురించి మాట్లాడటం లేదు. తాను వస్తానంటే వద్దంటున్నాడు. పైగా ఆ విషయం దాచిపెట్టడానికే ప్రయత్నిస్తున్నాడు. తాను చూసి ఎవరికైనా చెప్తుతానని భయపడుతున్నాడేమో!

''ఒరేయ్ నరశింహా! నీ రహస్యాలు నేను ఎవరికీ చెప్పను. ఆ విషయంలో నువ్వేం భయపడకు. నీకు తెలుసుగా ఇంతవరకూ మనకు చెందిన ఏ రహస్యాలూ బయటపడలేదని, చూడాలన్న ఆశ ఉంది. ఈ ఆశ తీర్చరా?'' అన్నాడు అభ్యర్థనగా.

నరశింహారావు చివరకు తల ఊపాడు. గోవిందం తొందరగా బయటకు చెప్పడు. తన మీద అతడికి పూర్తి విశ్వాసం, స్నేహాభిమానాలు ఉన్నాయి. అతడివల్ల ఇంతవరకూ తనకు లాభమే గానీ, నష్టమేం జరగలేదు. ఇక ముందుమాత్రం ఎందుకు వస్తుంది?

''రాత్రి ఏడు గంటలకు ఇంటివద్దకు రా!'' అంటూ లేచాడు.

గోవిందానికి గోవర్ధనగిరి ఎక్కినంత సంతోషం కలిగింది. నిజంగా 'నిధి' ఉండి అది బయటపడటమే జరిగితే, అందులో తనకూ వాటా ఇవ్వాల్సి ఉంటుంది. లేకుంటే ఆ విషయం ప్రభుత్వానికి చెబితే ఆస్తి ప్రభుత్వఖజానాకు, నరశింహారావు జైలుకూ వెళ్లవలసివస్తుంది. 'అసలు నిధి ఉందా? లేదా? ముందు తేల్చుకుంటే తన డిమాండ్‌లు పెట్టవచ్చు. అందువల్లనే అక్కడ ఏంజరుగుతుందో చూడాలనుకున్నాడు.

రాత్రి ఆరున్నర గంటల ప్రాంతానికి అవధూత పంపిన నలుగురు వ్యక్తులు బలిపశువుతో వచ్చారు. ఏడుస్తున్న పిల్లవాడిని నోరునొక్కి కాళ్ళూ చేతులు కట్టి ఒక గదిలో పడవేశారు.

''కావలసిన వస్తువులు తెచ్చారా?'' అన్నాడు తంతు నిర్వాహకుడు.

నరసింహారావు తల ఊపి తాను తెచ్చిన వస్తువులన్నీ వారి ముందు పెట్టాడు.

''అన్నంవండాలి, ఆ ఏర్పాట్లు తొందరగా కానివ్వండి'' అన్నాడు అతడు. నరసింహారావు నోరు వెళ్ళబెట్టాడు. అక్కడ అన్నం వండేవాళ్ళు ఎవరూ లేరు. మాంత్రికుడు విసుక్కున్నాడు. ''కూడులేకుండా దేవికి ఎలా నైవేద్యం పెడతారయ్యా? ముందు అన్నం సమస్య చూడు. అది లేకుంటే నేను వెళ్లిపోతాను'' అన్నాడు హెచ్చరిస్తూ.

బియ్యం కావలసినన్ని ఉన్నాయి, కాని వండేవారు లేరు. సమయానికి గోవిందం వచ్చాడు. కొత్తవ్యక్తిని చూసిన మాంత్రికుడు కోపంగా నరసింహారావు వంక చూశాడు. అతని చూపు తప్పించుకుంటూ ''ఒరేయ్ గోవిందం... సమయానికి ఆపద్బాంధవుడిలా వచ్చావు. అన్నం వండాలి; మనం ఇద్దరం కలిసి ఆ ప్రయత్నం చేద్దాం'' అన్నాడు.

గోవిందం ముసిముసినవ్వులు నవ్వాడు. అతనికి వంటవచ్చినా వారందరి ముందూ తను వంటవాడిగా మారడం నామోషీగా అనిపించింది. అందువల్ల ఒక ఉపాయం చెప్పాడు- ''ఇప్పుడు వంటచేయడం, వార్చడం అంతా తలనొప్పి వ్యవహారం. కావలసింది అన్నమేగదా! హొటల్ నుండి తెప్పిద్దాం''

ఈ ఐడియాకు అందరూ అతనివైపు సాదరంగా చూశారు. ఇప్పుడు వంటచేయవలసిన

స్తే ఎవరు చేయవలసివస్తుందోనని వచ్చినవారికీ, మాంత్రికుడికి కూడా భయంగానే ఉంది. నరసింహారావు బాబాకు ప్రియశిష్యుడని తెలుసు. అతనికి ఈ వచ్చిన వ్యక్తులు సహకరించకపోతే రేపు బాబాతో శాపనార్థాలు అనుభవించవలసివస్తుంది. కొత్తవ్యక్తి రావడం వారికి ముందుకోపం కలిగించినా, అతడి అమోఘ సలహా వారికి నచ్చుడంతో ప్రసన్నవదనులయ్యారు. ఆమాత్రం కూడా ఆలోచించే స్థితిలో లేని మేధావులు వాళ్ళు.

కారులో నరసింహారావు గోవిందాన్ని పంపించాడు. హోటల్లో వంద పార్శిల్ భోజనం కట్టించమని అడిగాడు. క్యాషియర్ సర్వర్లను పిలిచి ఆర్డర్ జారీ చేశాడు. "ఎందుకండీ వంద మీల్స్? ఏదైనా డిన్నరా?" అన్నాడు కాషియర్.

గోవిందం తలఊపి "టూరిస్టులు వచ్చారండీ! అందువల్ల అవసరం" అన్నాడు.

భోజనం ఇంటికి చేరవేసేటప్పటికి రాత్రి తొమ్మిది గంటలయింది. అపాటికి మాంత్రికుడు తన పనిలో నిమగ్నమై ఉన్నాడు. పూజ గదిని శుభ్రంగా తుడిపించి మధ్యగదిలో ముగ్గు దట్టంగా వేశాడు. అగరువత్తులు వదికడ్డీలు వెలిగించాడు. ఆముదం దీపం అఖండ జ్యోతిగా వెలిగింపచేశాడు. మహాకాళిక ఫొటో ఒక మూలకు చేర్చి ధూప, దీప నైవేద్యాలు అర్పించాడు. ఆ గదిఅంతా క్రమంగా మత్తుకలిగించే వాతావరణంగా నెలకొంది. అటువంటి గదులలోకి వెళ్ళిన తర్వాత దేవుడి మీద భక్తి కలుగుతుందో లేదోగానీ ఆ వాసనకు తల దిమ్మెక్కి ఒకవిధమైన మత్తుకు అలవాటుపడక తప్పదు. మన స్వంత ఆలోచనలు అడుగంటి అక్కడున్న ఆకొద్దిసేపూ, అదంతా పవిత్ర వ్యవహారంగానూ, దేవుడు తమకు కనిపిస్తున్నాడనీ ఊహించుకుంటూ మత్తులో ఉంటారు. సారా తాగినవాడికీ, ఇటువంటి గదులలోనికి వెళ్లి మత్తులో పడినవారాకీ తేడా ఒక్కటే! సారాయితాగి పూర్తిగా మత్తు ఎక్కినవాడి మెదడు ఆలోచించే స్థితినుంచి జారుకుంటుంది. ఈ మత్తులో పడినవారి మెదడు మరోరకంగా ఆలోచించే స్థితికి వస్తుంది. అదికూడా బయటకు వచ్చేవరకూ తాత్కాలికమే.

అదే అనుకున్నాడు గోవిందం. బయట నుండి ఎన్నో ఆలోచనలతో లోపలకు వచ్చిన అతడు కొద్దిసేపు ఆ వాసనమత్తుతో అన్నీ మరచి తమ ముందున్నది కాగితంపటం కాదనీ, నిజంగా దేవతేననీ భ్రమపడుతున్నాడు.

గదిలో ముగ్గువేసి దాని మధ్య అన్నం కుప్పగా పోశారు. మాంత్రికుడు వేపమండలు చేతబట్టుకొని హ్రాం, హ్రీం, హ్రూం, హ్రేం, హ్రౌం, హ్రేం, హాం ఫట్ మంటూ ఎగురుతూ అరుస్తున్నాడు. అతడు చదివేది మంత్రాలో, తిట్లో గోవిందానికి అర్థంకాలేదు. అలా ఓ అరగంటసేపు ఎగిరిన తర్వాత శాంతించాడు. కొంత అన్నం పళ్ళెంలోకి తీసుకుని 'నిధి' ఉన్నదనుకున్న చోటుకువచ్చాడు. అక్కడ ఆ అన్నం పోసి అగరువత్తులు, ఆముదం దీపం వెలిగించాడు. చుట్టూ గుండ్రంగా గీతగీసి అడుగులోతు మట్టి తవ్వారు. గుంటలో పేడతో శుభ్రంగా అలికారు. తెచ్చిన అన్నం కొంత గుంటలో పోసిమిగిలినది ముగ్గు మధ్య పోశారు.

"బలిపశువును తీసుకురా" అన్నాడు మాంత్రికుడు పక్కనున్నవాడితో. మాంత్రికుడి ముఖం కోపంతో, ఆవేశంతో చిత్తభ్రమతో ఉద్రేకంతో ఊగిఊగిపోతున్నది. మాటమాటకూ పండ్లు కొరుకుతూ 'అహౌం అది' 'అహౌం అంతః' అంటూ పలుకుతున్నాడు. అతడుపలికే పలుకులు ఎవరికీ అర్థంగాకున్నా నోరు మూసుకుని శ్రద్ధగా వింటున్నారు.

పిల్లవాడిని బావివద్దకు తెచ్చారు. ఇద్దరు మనుషులు బావిలో నీళ్ళుచేది స్నానం చేయించారు. ఒళ్ళు తుడిచి నొసటికి అడ్డబొట్టు, నిలువు నామం పెట్టారు. నొసటికి చేతులకు, కాళ్ళకు విభూధి రేఖలుగా దిద్దారు. గొంతుకూ, వీపుకూ, రొమ్ముకూ, గడ్డం కింద దట్టంగా రుద్దారు. కాళ్లకు పసుపురుద్దారు, మొలత్రాడు తెంచివేశారు. పూలదండ మెడలో వేసి, చేతి మణికట్లకు పూలమాలలు చుట్టారు. అక్కడి నుండి మాంత్రికుడి వద్దకు తెచ్చారు. మాంత్రికుడు ఆ 'బలిపశువు'ను కింద నుండి పైదాకా పరీక్షగా చూశాడు. తర్వాత సంతృప్తిగా తల ఆడించి "డింభకా! బలికి సిద్ధమా?" అని అడిగాడు. ఆ పిల్లవాడికి ఆ తంతు అర్థంకా

వడం లేదు. ఏడుస్తూ చుట్టూ చూశాడు. తనకు తెలిసినవాళ్ళు ఎవరూ కనిపించక పోవడంతో బిక్కుబిక్కుమంటూ నిలబడ్డాడు.

"రేయ్‌ధింభకా!" ఇల్లదిరిపోయేలా అరిచాడు మాంత్రికుడు. ఆ అరుపుకు నరసింహారావే ఉలిక్కిపడి చుట్టూ చూశాడు. ఈ అరుపులు బయటవాళ్ళకు వినిపించి, పక్కఇళ్ళవాళ్ళులేచివస్తే తన గతి ఇకఅంతే! అరవవద్దని అతడికి నచ్చచెప్పడం సాధ్యంకాదు. అరచేతిలో ప్రాణాలుంచుకుని కూర్చున్నట్లుంది అతడి పని.

మాంత్రికుడి అరుపుకు గోవిందం వణకడం ఆరంభించాడు. ఈ తంతుచూస్తుంటే అతడి గుండె వేగం క్షణక్షణానికీ పెరగనారంభించింది. మాంత్రికుడి ఒక్కో అరువు గోవిందం గుండెకు ఒక్కో తూటు పొడుస్తున్నట్లుంది.

మాంత్రికుడి అరుపు ఏమిటో తెలియకున్నా ఆ అరుపులకు భయపడ్డ పిల్లవాడు ఏడుస్తూ అటూఇటూ తలఊపాడు. సరిపోయింది, ఆ తలఊపడం తాను బలిపశువుకావడానికి అంగీకరించడమన్నమాట. ఎప్పుడైతే బలికావడానికి బలిపశువు తనకుతానే ఇష్టపూర్వకంగా అంగీకరిస్తుందో, అప్పుడే ఆ పని సిద్ధిస్తుంది. చేసినవాళ్ళకూ, చేయించినవారికీ ఎలాంటి పాపం అంటుకోకుండా తిరుగగలరని మాంత్రికుడి నమ్మకం.

ఇద్దరు మనుషులు నిధి గొయ్యివద్ద పిల్లవాడిని బారుగా బోర్లపరుండబెట్టారు. గొయ్యికి ఒక వైపుతల, మరోవైపు మొండెం ఉండేలా పడుకోబెట్టారు. మాంత్రికుడు సింహనాదంచేసి, విరబోసుకున్న తలవెంట్రుకలను తలతోనే వెనుకకు విసిరివేశాడు. ఆ జుట్టు వెనకకు పడినట్లే పడి మళ్ళీ ముందుకువచ్చింది. కళ్ళకు వెంట్రుకలు అడ్డుపడటంతో మరోసారి సింహనాదంచేసి తలవిదిలించాడు. వెంట్రుకలు చెల్లాచెదురుగా ముందుకూ; వెనుకకూపడ్డాయి. పక్కనే ఉన్న కత్తిని చేతికి తీసుకున్నాడు. 'జైశాంభవీ!' అంటూ హూంకరించి గురిచూసుకున్నాడు. ఒకే దెబ్బతో పిల్లవాడి తలతెగిపోయింది. తెగనరికిన మాంత్రికుడు రొప్పుతూ కత్తిని కిందపెట్టాడు. అటువైపున ఉన్న వ్యక్తిచేతికి తల, ఇటువైపున్న వ్యక్తి చేతికి మొండెం అందింది. మధ్యన గోతిలో ఉన్న అన్నంమీద ధారగా రక్తంకారింది. అన్నంలోపల పూర్తిగా తడుస్తూనే, తలతీసుకొని వెళ్ళి లోపలగదిలోని అన్నంమీద ఉంచి కారే రక్తంతో దాన్నీ తడిపారు. మొండేన్ని ఎత్తిబయటముగ్గుమీదఉన్న అన్నంమీద తలకిందులుగా పట్టుకున్నారు. అన్నం మొత్తం రక్తంతో తడుస్తూనే మొండెం పక్కనపడేసి తలతెచ్చి గొయ్యిదగ్గర ఉంచారు. మొండేనికి కుడివైపు ఉన్న చెయ్యి, ఎడమకాలిని నరికి తెచ్చి, తల కింద కాలు, తలనోటిలో చెయ్యిదూర్చారు. గోతి ముందు తలను ఎదురుగా ఉంచి, రక్తపు కూడు అక్షింతలుచల్లుతూ మాంత్రికుడు ఏదో చదువుతున్నాడు.

బాలుడి మెడపైన ఎప్పుడు కత్తిపడిందో అప్పుడే గోవిందం గుండెలమీద సమ్మెటలు తగిలినట్లయింది. ఆ రక్తం, ఆ వాతావరణం, ఆ మాంత్రికుని హూంకారం చూసి స్పృహ తప్పిపడిపోయాడు. అయినా ఆ సమయంలో ఎవరూ అతడిని పట్టించుకోలేదు. దీక్షగా ఎవరిపనులు వాళ్ళుచేస్తున్నారు. నరకడం, రక్తంచూసి నరసింహారావు వాంతి చేసుకున్నాడు. అయినా రేపు దొరికే 'నిధి' మీదే అతని ఆలోచలు ఉండటంవల్ల ఆ దృశ్యం భయానకంగా అనిపించలేదు. ఇప్పుడు అతడి ఆలోచన ఒక్కటే! ఈ వస్తువులనూ, సామానునూ ఎలా బయటకు తీసుకెళ్ళాలి? ఇల్లు తెల్లారేలోగా శుభ్రంచేయాలి? లేకపోతే అనేక అనుమానాలు వస్తాయి. ఏమాత్రం బయటపడినా ఈకకు ఈక, తోకకుతోక లాగడానికి జనం సిద్ధంగా ఉంటారు. ఆ తర్వాత నానాబాధలూ కష్టాలూ వస్తాయి.

తంతు పూర్తయిన తరువాత మాంత్రికుడు ఉగ్రరూపం ఉపసంహరించుకున్నాడు. బావి వద్దకు వచ్చి ప్రశాంతంగా స్నానంచేశాడు. కుర్చీలో కూర్చుంటూ "అమృతంకావాలి నరసింహారావు" అన్నాడు. నరశింహారావు లోపలకు వెళ్ళి విస్కీబాటిల్ పెద్దది తెచ్చి అయన ముందుపెట్టాడు. మూత తీసి సీసాను నోటికి అతికించాడు. తాగుతూ చుట్టూచూస్తున్నాడు మాంత్రికుడు.

నలుగురు వ్యక్తులు రక్తపు కూడు గిన్నెలలోనికి ఎత్తుకున్నారు. మొండెం, తలను ఏమిచెయ్యమంటారని మాంత్రికుడిని అడిగాడు రావు.

"మన అవసరంతీరింది. తీసుకెళ్ళి మన మీదకు అనుమానం రానిచోట పడవేసి రండి" అన్నాడు నిషాలోకి వెళ్తున్న మాంత్రికుడు. గోవిందం కొరకు అప్పుడు చూశాడు రావు. చీకట్లో స్పృహతప్పి పడిఉన్న అతడిని చూసి, ముఖంమీద నీళ్ళు చిలకరించి లేపాడు. లేచిన గోవిందం పిరికిచూపులతో చుట్టూ భయంభయంగా చూస్తూ, మొండెం తల చూసి కెవ్వున అరుస్తూ, వణికిపోతూ నేలమీద పడి దొర్లసాగాడు. అతడి పిచ్చిచేష్టలకు నరసింహారావు ఒళ్ళు మండింది. అంతకంటే ఎక్కువగా భయంవేసింది. రేపు ఇతడు బయపడి ఎవరికైనా చెబితే ఏమవుతుందో? వీడి భయం పోగొట్టి, ధైర్యం కలిగించి ఎవరికీ చెప్పకుండా చేసుకోవాలి. మాంత్రికుడి వద్దకు వచ్చాడు.

"వీడి పరిస్థితి ఇలా అయిందేమిటి? వీడి భయంపోయే మార్గం చూడండి" అన్నాడు.

మాంత్రికుడు తలఊపాడు "ఇది సహజం. పిరికిపందల్ని ఇటువంటి చోటుకు తీసుకురావడమే తప్పు. వాడి పిరికిగుండె నీరసించిపోతుంది" అంటూ లేచి గోవిందం దగ్గరకు వచ్చాడు. తన దగ్గరున్న విబూది ఉండ తీసుకుని, గోవిందం శరీరానికి అన్నిచోట్లా తాకించాడు. మంత్రాలు చదివాడు. "విస్కీ తాగుతాడా?" అన్నాడు రావువైపు చూస్తూ. రావు తలఊపాడు.

"అయితే లోపలకు తీసుకెళ్ళి ఒంటినిండా ఎక్కించండి. కొంతసేపు మత్తులోపడి తర్వాత తేరుకుంటాడు"

గోవిందంని లోపలకు లాక్కెళ్ళాడు రావు. పదినిమిషాలకు తిరిగి బయటకు వచ్చాడు. ఆ పాటికి గోతంలో తల, మొండెం కట్టి సిద్ధంచేసి ఉన్నారు. మిగిలిన వస్తువులు కూడా శుభ్రంగా ప్యాక్‌చేసి ఉంచడంతో అవన్నీ కారులో చేర్చమన్నాడు మాంత్రికుడు.

"నరసింహారావుజీ! మీతోపాటు ఇద్దర్ని తీసుకెళ్ళి ఊరివెలుపల, మీమీదకు అనుమానం రానిచోట ఇవన్నీపడేసి రండి... ఆలోగా మిగిలిన ఇద్దరూ ఇల్లు శుభ్రంచేస్తారు. అతగాడు నిషాలో పడిఉన్నాడా?"

రావు తల ఊపాడు. "ఉదయం వరకూ అతడు లేవడు" అంటూ ఒక మూట తాను చేతికి తీసుకున్నాడు. అందరూ కలిసి కారులో చేర్చారు వస్తువుల్ని. రావు డ్రైవింగ్ సీట్లో కూర్చుంటూనే మిగిలిన ఇద్దరూ అతడి పక్కన కూర్చున్నారు. కంపోస్టు డిపోవద్దకు తెచ్చి రోడ్డు పక్కగా అవి పడేశారు. ప్యాకింగ్‌లు విప్పి చెల్లాచెదురు చేయాలన్న ఆలోచనవారికి లేదు. ఎప్పుడు వదిలించుకుందామాన్న ఆలోచనలో ఉన్నారు. కారు చెరువు వద్దకుతెచ్చి నీటిలో దించాడు. ఇద్దరు మనుషుల్తోపాటు తాను కూడా శుభ్రంగా కడిగాడు. నీళ్ళనుండి బయటకు తెచ్చి పాడిగుడ్డలతో మరకలు ఏమీ లేకుండా తుడిచారు. తిరిగి అందరూ ఇల్లు చేరారు.

ఆపాటికి ఇల్లు కూడా శుభ్రం చేశారు. రాత్రి అక్కడ ఏమీ జరగనట్లే ఉంది. సాయంత్రం ఎలా ఉందో అలాగే ఉందా ఇల్లు. గుంట పూడ్చిన చోట మాత్రం, తవ్వి పూడ్చినట్లు కనిపిస్తున్నది. మరో వారంరోజులు పోతేగాని పైమట్టి గట్టిపడి మిగిలిన ప్రాంతంతో కలిసిపోదు. ఆ ప్రాంతమంతా చిక్కగా నీళ్ళు చల్లడంవల్ల తాత్కాలికంగా అంతా బురదకావడంతో అందులో కలిసిపోయింది గుంట కూడా.

మాంత్రికునికి వెయ్యిరూపాయలు, మిగిలిన నలుగురికీ కలిపి రెండువేల రూపాయలు సమర్పించాడు రావు. వాళ్ళు సంతృప్తిపడ్డారు. డబ్బు వస్తుందన్న ఆశతో రాలేదు. బాబాశిష్యుడుగనుక బాబా ఇచ్చిన ఆదేశంతో తప్పనిసరిగా రావలసి వచ్చింది. అయినా వారి కష్టం ఉంచుకోకుండా ప్రతిఫలం ముట్టజెప్పాడు. అతనిని ఆశీర్వదించి మాంత్రికుడు, మిగిలిన వారూ వెళ్ళిపోయారు.

అందరూ ఉండగా అతడికి కొండంత ధైర్యం ఉంది. ఇప్పుడు ఒంటరికావడంతో ఆ ప్రాంతంలో ఇంతకుముందు జరిగినదంతా కళ్ళముందు కనిపిస్తూ ధైర్యం సడలుతున్నది.

లోపల ఉండలేక బయట గేటువద్దకు వచ్చి నిలబడ్డాడు.

తెల్లవారు ఝామునుకావడంతో పాలకావిళ్ళు బయలుదేరాయి. ఒకరికంటే మరొకరు వేగంగా పాలకావిళ్ళతో పరుగులు పెడుతున్నారు. ఆడవాళ్ళు లేచి కళ్ళాపిచల్లుకుంటున్నారు. తన పనిమనిషి ఇంకారాలేదు. తొందరగా వచ్చి కళ్ళాపి చల్లితే బాగుండును. వంటపాత్రలు ఏమీలేవు కాబట్టి తొందరగా పంపించవచ్చు. ఆలోచిస్తూ నిల్చున్న అతడికి ఎదురుగా వచ్చిన పనిమనిషి కూడా కనిపించలేదు. పరాకున ఉన్న అతనిని "అయ్యగారూ!" అంది.

ఉలిక్కిపడి ఆమెను చూసి పక్కకు తప్పుకున్నాడు. ఆమె లోపలకు వచ్చి పెరట్లో చూసింది. అంతా బురద; నీళ్ళు చల్లారు. ఎవరు చల్లారో ఆమెకు అర్థంకావడం లేదు. బకెట్‌తో నీళ్ళు చేదుకుని బయటకు వచ్చింది. రావు ఇంకా అక్కడే నిలబడి ఉన్నాడు. ఆ సమయంలో ఎప్పుడూ బయటకురాని అతడు ఎందుకు అక్కడ నిల్చున్నాడో ఆమె ఊహించలేకపోయింది.

లోపలకు వచ్చిన నరసింహారావు, గోవిందంవైపు చూశాడు. అతడు ఇంకా మత్తులో ఉన్నాడు. పనిమనిషి లోపలకు వచ్చిన తరువాత "ఈరోజు అంట్లు లేవు, బయట కసువు చిమ్మి వెళ్ళు" అన్నాడు.

అక్కడ బురద గురించీ, ఇంకా చీకటి ఉండగానే ఇళ్ళు శుభ్రంగా తుడవడం గురించి అడిగే ధైర్యం ఆమెకు లేదు. 'ఏదైతే మనకెందుకు' అనుకుంటూ ఆమె వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిందని నిర్ధారించుకున్న తర్వాత గేటు తలుపుకు తాళం వేసి, లోపలకు వచ్చి అన్ని తలుపులూ బిగించి పండుకున్నాడు. కళ్ళు మూతపడటం లేదు; నిద్రరావడం లేదు. తల తిరుగుతున్నది. సూదులతో పొడుస్తున్నట్లుంది. కణతలు అదురుతున్నాయి. శరీరం వణుకుతున్నది. భయంభయంగా చీకట్లోకి చూస్తున్నాడు. ఇక పడుకున్నా భయం తప్ప నిద్రరాదని నిర్ణయించుకొని లేచి బీరు సీసా తీసుకుని మూతతీసి, త్రాగుతూ పచార్లు చేస్తున్నాడు. తెలతెలవారుతున్నది. గోవిందం శరీరం కదిలింది. దగ్గరగా వచ్చి చూశాడు. అతడి కనురెప్పలు బరువుగా పైకి లేచి కిందకు వాలుతున్నాయి.

"గోవిందం... గోవిందం"

మత్తుగా కళ్ళు తెరచి ఆవులించి లేచి కూర్చున్నాడు. చుట్టూచూశాడు. మామూలు పడకగది అది. రాత్రి సంఘటనలు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. మంచం దిగి గబగబా పెరట్లోకి వెళ్ళాడు. రాత్రి చిహ్నాలు ఎక్కడా ఏమీ కనిపించలేదు. ఉదయం పనిమనిషి శుభ్రంచేసినట్లుంది.

"ఏమిట్రా... ఏంపోయిందని వెదకుతున్నావ్?" అన్నాడు వెనుకనుంచి రావు.

"రాత్రి జరిగింది ఇక్కడ ఏమీలేదే?"

"ఏం జరిగింది రాత్రి?"

"ఇక్కడ నిధికొరకు బలి ఇవ్వడం, పిల్లవాడు చావడం, నెత్తురు కూడు"

"కలగంటున్నావేమిట్రా వెధవా! రాత్రి ఇక్కడ ఏమీ జరగలేదు"

నవ్వుతున్న రావును చూసి ఆశ్చర్యంగా నమ్మలేనట్లు చూశాడు.

"రాత్రి జరిగింది కలా? నేను నమ్మను. నా కళ్ళముందు జరిగిందది"

"ఏమీ జరగలేదు. నీదంతా భ్రమ! తాగుబోతు వెధవవు. పీకలదాకా తాగి ఉంటావు. అయినా తాగి కలగనడం నీకు ఈమధ్య ఎక్కువ అయిందిరా"

తాను కలగన్నాననంటే గోవిందం అంగీకరించలేదు. జరిగింది కళ్ళతో చూశాడు. భయంతో కిందపడిపోయాడు. ఆ తర్వాత ఏం జరిగిందో తనకు తెలియదు. తెలివివచ్చి చూస్తే అంతా మామూలుగానే ఉంది. భ్రమ అనుకోడానికి ఆస్కారం లేదు. కాదనడానికి ఆధారాలూ లేవు.

"ముఖం కడుక్కో! బజారుకెళ్ళి కాఫీ తాగుదాం!"

బావి వద్దకు వచ్చి ముఖం కడుక్కున్నాడు. అప్పుడూ ఆలోచిస్తూనే ఉన్నాడు.

గోవిందం కలగా భావిస్తాడని నరసింహా

రావు భావించడం లేదు. రేపు టౌనులో ఆ వస్తువులు చూసిన తరువాత పుకారు లేస్తుంది. గోవిందం కూడా వెళ్ళిచూడవచ్చు. తిరిగి సంఘటన జ్ఞప్తికి వస్తుంది. తాత్కాలికంగా అతని భ్రమలా చూపిస్తే కొంత స్థిమిత పడలేదు. నిజమేనని తాను చెప్పితే వెంటనే మూర్ఛపోతాడు. అందువల్లే అది భ్రమగా ప్రస్తుతం నమ్మింపచూస్తున్నాడేగానీ తర్వాతయినా గోవిందం నమ్మడని తెలుసు.

* * *



ఉదయం ఆరుగంటలకు కంపోస్టు డిపో ప్రాంతంలో జనం కుక్కలు అరుస్తుంటే అటుగా వచ్చి చూశారు. ఉషోదయంలో మూటలు కనిపించాయి. కొన్ని మూటలు కుక్కలు చించడంవల్ల నెత్తురుఅన్నం చెల్లాచెదరయింది. మొండెం, తల సంచినుంచి బయట పడ్డాయి.

చూడవస్తున్న జనం ఎక్కువయ్యారు. జనం రావడంతో కుక్కలు దూరంగా వెళ్ళి వారిని చూసి మొరుగుతున్నాయి. తమ నోటి దగ్గరి కూడు తీస్తున్నారన్న కోపంతో.

జనం క్రమంగా ఎక్కువవుతున్నారు. తలొక రకంగా వ్యాఖ్యానిస్తున్నారు. అందరి దృష్టిలో

అది నరబలే. అయితే ఆ సంఘటన ఆ ప్రాంతంలో జరగలేదనీ, మరెక్కడో జరిపి ఇక్కడ తెచ్చిపడవేసి ఉండవచ్చునని ఊహిస్తున్నారు.

"పోలీసులు ఎవరూ రాలేదేం?" అన్నారు ఒకరు.

"వారిదేం పోయిందిప్పుడు. చచ్చింది వాళ్ళ వాడయి ఉండడు. సుష్టుగా తిని త్రేపుకుంటూ సాయంత్రం వస్తార్లే" అన్నారు మరొకరు.

"ఇదేం ఖర్మరా! మన పట్టణం నరబలి కేంద్రంగా తయారయిందేం?"

"చేతగాని పోలీసులు ఉంటే రేపు మనల్ని మాత్రం బలి ఇవ్వరని నమ్మకమేమిటి?"

ఒక్కొక్కరు ఒక్కోవిధంగా మాట్లాడుతున్నారు.

జనంలో కొందరు యువకులు, ఉత్సాహవంతులు దగ్గరలోని పోలీసుస్టేషన్‌కు వెళ్లారు. ఇన్‌స్పెక్టరు లేడు. ఉన్న పోలీసులకు వివరాలు చెప్పారు. పోలీసులు ఆశ్చర్యంగా వారివైపు చూసి "అలాగా?" అన్నారు. "మన ఊర్లో ఇదో పెద్దసమస్యగా తయారయిందేమిటి... అన్నీ ఇక్కడే జరుగుతున్నాయి" అన్నారు వాళ్ళు.

"కుక్కలు వాటిని చెల్లాచెదరు చేస్తున్నాయి. వచ్చి వాటిని చూడండి" అన్నాడో యువకుడు.

"తర్వాత వస్తాంలెండి... ఇన్‌స్పెక్టరుగారు లేరు" అన్నాడు హెడ్డు.

యువకులు కోపంగా ఉన్నారు. "అక్కడ కుక్కలు చెల్లా చెదురు చేస్తుంటే ఇక్కడ మీరు నింపాదిగా కూర్చుంటే ఎట్లా? మీ ఇన్‌స్పెక్టరుకు ఫోన్‌చేసి పిలవండి"

హెడ్‌కానిస్టేబుల్‌కు కోపం వచ్చింది. "పోవయ్యా! ఇన్‌స్పెక్టరు వచ్చిన తర్వాత వస్తామంటే బెదరిస్తున్నారేం? ఇదేమన్నా బెండకాయల వ్యాపారమనుకున్నారా ఏమిటి? అతిగా నీల్గితే బొక్కలో తోస్తాను" గ్రాండుమంటూ అరిచాడు.

"ఎందుకు తోయవూ? నీవు మమ్మల్ని బొక్కలో తోసేలోపల నీ కీళ్ళు తిప్పి బయట విసరిపారేస్తాం. ఊర్లో ఇన్ని హత్యలు జరుగుతుంటే పట్టుకోలేని దద్దమ్మవు నువ్వూ ఒక పోలీసోడివేనా? సిగ్గులేదూ చెప్పుకోడానికి? ఇదే మీ పిల్లల్ని చేస్తే నోరుమూసుకుంటారా?"

హెడ్‌కానిస్టేబుల్ పోలీసుల వైపుచూసి "వాణ్ణి లాక్కురాండ్రా!" అంటూ అరిచాడు.

పోలీసులు ఆ వ్యక్తి వద్దకు వచ్చి లాగడానికి సిద్ధపడ్డారు. జనం పోలీసుల్ని చుట్టుముట్టారు. ముష్టి యుద్ధం సాగింది. ఆ ముష్టి యుద్ధంలో జనానికే విజయం లభించింది. నలుగురు పోలీసులూ పారిపోయి పోలీసుస్టేషన్‌లో పడ్డారు వగర్చుకుంటూ. జనం ఆవేశంగా పోలీసుస్టేషన్‌లోకి రాళ్ళు విసిరారు. వరండాలో ఉన్న కుర్చీటేబుల్ రోడ్డు మీదకు తెచ్చి పైకెత్తి విసిరారు. అవి భళ్ళున ముక్కలు ముక్కలుగా పగిలిపోయాయి. పోలీసులు తలుపులు వేసుకోవడంతో తలుపుల మీద కూడా రాళ్ళు విసిరారు.

ఫోన్ చేయడంతో ఇన్‌స్పెక్టర్ స్వరాజ్ మోటార్ సైకిల్‌మీద వచ్చాడు. స్టేషన్ బయట జనం వీరావేశంతో ఉన్నారు. దూరంగా మోటార్‌సైకిల్ నిలిపి, నడిచి వారి వద్దకు వచ్చాడు. అతన్ని చూసి జనం మరింత రెచ్చిపోయారు. అతనిమీద కూడా రాళ్ళు విసరడంతో పరుగెత్తి పక్కనున్న కొట్లో దాక్కున్నాడు. పరిస్థితి విషమించినట్లు తెలియడంతో మున్సిపల్ కౌన్సిలర్ రామ్మూర్తి అక్కడికి వచ్చాడు. జనంలోని యువకులు ఆయన వద్దకు వచ్చి పరిస్థితి ఎందుకిలా ఏర్పడిందీ వివరించారు.

"అయినంతమాత్రాన స్టేషన్ మీద దాడిచేస్తే మాత్రం వాళ్ళు వచ్చిచూస్తారా? చెప్పేదేదో మంచిగా చెప్పాలి కానీ?" అన్నాడు ఆయన.

"నీ సలహా ఏందయ్యా! బోడిసలహా ఇస్తున్నావ్? రోజుకో నరబలి జరుగుతుంటే చూస్తూ ఊరకుండాలా ఏం? ముగ్గురు పసిపిల్లల తలలు నరికితే ఇంతవరకూ ఒక్క కేసులోనూ పట్టుకోలేని ఈ పోలీసులను నువ్వెందుకు సపోర్టు చేస్తున్నావు? ఇందులో నీ పాత్ర ఎంత ఉందో చెప్పు?" అన్నాడు ఒకతను ముందుకు వచ్చి.

"ఇదిగో! మీరు అనవసరంగా ఆవేశపడు

తున్నారు. ఆవేశంలో ఏం మాట్లాడుతున్నారో మీకే అర్థం కాకుండా ఉంది. పోలీసులను సపోర్టు చేసినంత మాత్రాన నేను నరబలిలో పాల్గొన్నాననంటావేమిటయ్యా? సిగ్గుండాలిగానీ, మాట్లాడేదానికి కూడా ఒక పద్ధతి ఉండాలి" అన్నారు రామ్మూర్తి ఆవేశంగా!

అంతకంటే ఆవేశంగా లేచాడు అతను. "మాకెందుకయ్యా సిగ్గు! మీకుండాలి గానీ! జనం ఓట్లతో గెల్చి జనానికి వంగనామాలు రుద్దే మీలాంటి ప్రబుద్ధులు ఉండబట్టే పట్టణం ఈ విధంగా తయారయింది. ఈ నరబలిలో నీ పాత్ర ఉండబట్టే ఇలా బలవరుస్తున్నావేమో" అన్నాడు మీదకువెళ్తూ.

జనం ఆవేశంగా ఉన్నారు. రామ్మూర్తి మాటలు వారిని మరింత రెచ్చగొట్టినట్లయింది. దానికి తోడు శంకరరావు కావాలనే రామ్మూర్తి మీదకు జనాన్ని ఉసిగొలిపాడు. ఫలితం రామ్మూర్తి పంచె, చొక్కా లాగి గొడ్డును బాదినట్లు బాదారు. ఆ జనంలో అతనికి సహాయంగా వచ్చి ఎవరయినా విడిపించాలని ప్రయత్నిస్తే వాడికీ అదే జరుగుతుందని, అతని అనుకూలురు అక్కడ ఉండి కూడా నోరెత్తకుండా తప్పుకున్నారు. వీరాంగణం తొక్కుతున్న జనం చుట్టుపట్ల ఉన్న కొట్లమీదా, షాపుల మీదా దాడిచేశారు. వాళ్ళు భయంతో తలుపులు వేసుకున్నారు. ఒకటిరెండు కిళ్ళీ షాపులు ధ్వంసమయ్యాయి.

మరోగంటకు రిజర్వుపోలీసులతో రెండు వ్యాన్లు వచ్చాయి. అంతవరకూ కేకలేస్తున్న జనం కకావికలై పారిపోసాగారు. రిజర్వ్ పోలీసులు లాఠీలు తీసుకొని జనాన్ని తరిమారు. అంతవరకూ పక్కకొట్టులో ప్రాణభయంతో కాలం గడిపిన ఇన్‌స్పెక్టర్ స్వరాజ్, తలుపులు వేసుకొని గుండెల్ని అరచేతపట్టుకున్న పోలీసులు బయటకు వచ్చారు.

డి.యస్.పి. వచ్చి ఆఫీసు గదిలో కూర్చున్నాడు వగరుస్తూ. అతని ముందుకు వచ్చి నిలబడి శల్యూట్ కొట్టాడు స్వరాజ్.

"ఏం జరిగింది?" అన్నాడు డి.యస్.పి. ఇన్‌స్పెక్టరును చూస్తూ. ఈలోగా రిజర్వు పోలీసులు ఓ పదిమంది జనాన్ని లోపలకు లాక్కొచ్చారు. వారిని లాకప్‌లోకి తొయ్యమని గాండ్రించి, తిరిగి ఇన్‌స్పెక్టరువైపు చూశాడు.

"నేను ఇంటిదగ్గరున్నాను సార్! స్టేషన్‌కు రావడానికి సిద్ధపడుతుండగా స్టేషన్ మీద జనం దాడిచేస్తున్నారని ఫోన్‌వచ్చింది సార్! వెంటనే మోటార్ సైకిల్ మీద వచ్చాను. రోడ్డుమీద వాహనం నిలిపి జనంతో మాట్లాడదామని నడిచివస్తున్నాను. మూకలు నా మీదకు దాడిచేయడంతో పక్క కొట్టులోకి వెళ్ళాను. ఆ తర్వాత ఏం జరిగిందీ నాకు తెలియదు"

డి.యస్.పి. హెడ్‌కానిస్టేబుల్‌ను పిలిచి జరిగింది చెప్పమన్నాడు.

"నేను స్టేషన్‌లో రాసుకుంటూ కూర్చున్నాను సార్! కొందరు వచ్చి 'కంపోస్టు డిపో వద్ద బాలుని నరికారు' రమ్మన్నారండీ! డ్యూటీలో కానిస్టేబుల్స్ ఎవరూ లేరుసార్! ఇన్‌స్పెక్టరుకు తెలిపి, ఆయన రాగానే వస్తామని చెప్పానండీ! కాదు, వెంటనే రావాలన్నారండీ! స్టేషన్‌లో సిబ్బంది లేరని నేను చెప్పుతుండగానే బయట ఉన్న జనం రాళ్ళు విసురుతూ కేకలేశారండీ! వెంటనే తలుపులు మూసి ఇన్‌స్పెక్టరు గారికి ఫోన్‌చేశామండీ! ఆ తర్వాత బయట రణగొణగా ఉందిగానీ ఏం జరిగిందో మాకు వివరాలు తెలియవండీ!"

డి.యస్.పి. తల ఊపాడు. కౌన్సిలర్ రామ్మూర్తి వగరుస్తూ స్టేషన్ వరండాలో కూర్చుని ఉన్నాడు. అతన్ని లోపలకు తీసుకు రమ్మని కానిస్టేబుల్‌తో చెప్పాడు. రామ్మూర్తి కుంటుకుంటూ లోపలకు వచ్చాడు. ఎవరో ఇచ్చిన కండువా ఒకటి నడుముకు చుట్టుకున్నాడు.

"ఏం జరిగిందో చెప్పండి?" అన్నాడు డి.యస్.పి.

రామ్మూర్తి నోరు తెరవబోతుండగా బయట కేకలు వినిపించాయి. పోలీసులు హెచ్చరిస్తున్నారు. కిటికీగుండా డి.యస్.పి బయటకు చూశాడు. తిరిగి జనం పోగయ్యారు. వారి ముందు నిలబడ్డ పోలీసులు చెదరిపోవలసిందిగా జనాన్ని హెచ్చరిస్తున్నారు. వారి హెచ్చరికలు లెక్కచేయకుండా జనం ముందుకు దుముకుతూ రాళ్ళు విసురుతూనే ఉన్నారు. డి.యస్.పి ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగి సైగచేశా

డు. ఆయన వెంటనే బయటకు వెళ్ళాడు. జనాన్ని చూసి చెయ్యి పైకెత్తి "ఎందుకు మీరు తొందరపడుతున్నారు? రాళ్ళు విసరడం మానుకోండి. ఏమైనా చెప్పదలిస్తే లోపలకు రండి" అన్నాడు.

అతడి మాటలకు జవాబుగా జనం ఏదో అరుస్తున్నారు. వేలమంది ఉన్న ఆ సమూహంలో ఎవరు ఏం మాట్లాడుతున్నారో అర్థంకాకుండా ఉంది. ఒకటీ, అరా రాళ్ళు వచ్చి పడుతూనే ఉన్నాయి.

"మీరు ఇలాగే ప్రవర్తిస్తే లాఠీచార్జి చేయవలసివస్తుంది"

జనం రెచ్చిపోయి మరింత భీకరంగా కేకలేశారు. తోసుకుంటూ ముందుకు రావడానికి ప్రయత్నిస్తున్నారు. వారిని లోపలకు రాకుండా పోలీసులు బయటకు నెట్టుతున్నారు. పోలీసులు లాఠీచార్జీకి దిగారు. ముప్పైమంది పోలీసులు, నాటు కర్రల్లాంటి బడితె కర్రల్ని తీసుకుని జనంపైబడి కొట్టడం ఆరంభించారు. జనం కకావికలై పరుగెత్తడం ప్రారంభించారు. తిరిగి కూడుకుంటున్న జనం దొరికిన పోలీసుల్ని నడుం కరచుకుని కిందపడేశారు. నలుగురు పోలీసులను జనం కింద పడవేసి కాళ్ళ కింద తొక్కడంతో పరిస్థితి విషమించిందని డి.యస్.పి అర్థంచేసుకున్నాడు. తోసుకుంటూ వస్తున్న జనం వైపు చూసి, లేచి బయటకు వచ్చాడు. "చెదరిపోండి, లేకుంటే తీవ్ర పరిణామాలకు దారితీస్తుంది. ఆవేశపడకుండా ఎవరంతకు వాళ్ళు చెదరిపోండి. ఏమైనా మాట్లాడదలిస్తే నా దగ్గరకు వచ్చి మాట్లాడండి. మీ వద్దనున్న కానిస్టేబుళ్ళను విడిచిపెట్టండి" అన్నాడు.

జనంలో నుండి జవాబు వినిపిస్తున్నది. కాని, అది స్పష్టంగా వినిపించడంలేదు. వారికి ఒక నాయకత్వములేదు, క్రమశిక్షణాలేదు. పోలీసులు ఏదో అన్యాయం చేస్తున్నారని వారి భావం! వారి సహాయం లేకుండా ఇన్ని నరబలులు జరగవని జనం అనుమానం. అందుకే నాయకత్వం లేకున్నా సంఘటితంగా లేకున్నా పోలీసులు మీదపడి బాదుతున్నా మీద మీదకు వస్తున్నారు. వారిని ఆపడం సాధ్యంకాదనిపించింది డి.యస్.పికి. వారి చేతుల్లో ఉన్న కానిస్టేబుల్స్‌ను విడిపించవలసిన బాధ్యత తనది. తాను అక్కడ ఉండగానే నలుగురు పోలీసులు ఛస్తే తనకంటే దద్దమ్మ ఆఫీసరు మరొకడు ఉండడని రుజువవుతుంది.

ఇదంతా ఆలోచించిన తర్వాత ఇన్‌స్పెక్టరు వైపు చూశాడు. జనం మరింత దగ్గరగా రావడానికి ప్రయత్నం చేస్తుండటం, పోలీసులు లాఠీలతో బాదుతున్నా తిరగబడి వారిని అదే లాఠీలు లాక్కొని కొట్టడంతో ఇక లాభంలేదనిపించింది. కనుసైగ చేశాడు ఇన్‌స్పెక్టర్‌కు.

ఇన్‌స్పెక్టర్ పిస్తోల్ చేతికి తీసుకున్నాడు. జనానికి కనిపించేలా పైకెత్తాడు. "దూరంగా వెళ్ళండి... కాల్చేస్తాను"

జనంలో కలకలం రేగింది, కాని దూరంగా పోవడంలేదు. ఇన్‌స్పెక్టర్ పిస్టల్ ట్రిగర్ నొక్కాడు. ఆ శబ్దానికి కకావికలవుతున్న జనం ఒకరినొకరు తొక్కుకుంటున్నారు. ఇద్దరు పోలీసులు తుపాకులు బారుచేసి కాల్చారు. పారిపోతున్న జనం కాళ్ళ కింద కొందరు పడి మొత్తుకుంటున్నారు.

ఇంతలో మునిసిపల్ ఛైర్మన్ గోపాల్‌నాయుడు హడావిడిగా అక్కడకు వచ్చాడు. పారిపోతున్న జనం తిరిగి ఆయన వెనక సమీకృతమయ్యారు. జనంతోపాటు ఆయన స్టేషన్ ముందుకు వచ్చాడు.

"రండి లోపలకు" అన్నాడు డి.యస్.పి. ఛైర్మన్ లోపలకు వచ్చి కౌన్సిలర్ రామ్మూర్తిని ఆ స్థితిలో చూసి, కనుబొమలు ముడిచి "ఏం జరిగింది?" అన్నాడు.

"వాళ్ళు నన్ను కొట్టి గుడ్డలు కూడా లాగేశారండి" అన్నాడు రామ్మూర్తి.

"వాళ్ళను మీరేమన్నారు? ఏమీ అనకుండానే వాళ్ళు ఎందుకు దాడిచేస్తున్నారు డి.యస్.పిగారూ! ఏమిటండీ ఈ వాతావరణం? కాల్పుల వరకూ పరిస్థితి ఎందుకు వచ్చింది?" అన్నాడు ఆయన ఆవేశంగా.

తనకు తెలిసిన వరకూ డి.యస్.పి వివరాలు చెప్పాడు.

"ఇప్పటికి ఈ టౌనులో మూడు నరబలులు జరిగాయి. పక్కన పల్లెలో మరొకటి జరిగింది.

రేపు తమ పిల్లలు మాత్రం ఆ విధంగా కారని నమ్మకమేమిటి? అని జనం భయపడటంలో తప్పులేదు. వారికి నచ్చచెప్పడానికి బదులు కాల్పులు కాలిస్తే పరిస్థితి చక్కబడుతుందా?''

''పోలీస్‌స్టేషన్ మీద దాడిచేసినా క్షమించాలనడం మంచిది కాదు ఛైర్మన్‌గారూ! వచ్చిన వాళ్ళు శాంతంగా వచ్చి రిపోర్టు ఇస్తే వచ్చి పరిశీలించి తగిన చర్యలు తీసుకునేవాళ్ళం కదా!''

''మీ పోలీసులు సరి అయిన చర్య తీసుకుంటుంటే మేము అడ్డంవచ్చామా? జనాన్ని రెచ్చగొట్టింది మీ పోలీసులు! అక్రమంగా ప్రవర్తించేది మీ పోలీసులు! అన్నింటికీ కారకులు మీ పోలీసులే!'' లాకప్‌నుండి అరిచాడు శంకరరావు.

డి.యస్.పి ఆజ్ఞతో అతడిని బయటకు తెచ్చారు. బుసకొడుతూ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు.

''నీవు వచ్చి రిపోర్టు ఇస్తే పోలీసులు తీసుకోమన్నారా?''

''స్టేషన్‌లో ఆరుగురు పోలీసులున్నారు. మేము వచ్చి చెప్పిన వెంటనే అక్కడకు రావలసిన బాధ్యత మీది. ఇన్‌స్పెక్టర్ వచ్చిన తరువాత అక్కడకు వస్తామంటే అంత వరకూ మేము అక్కడ కాపలా కూర్చోవాలా? మేము పీనుగుల దగ్గర కాపలా కూర్చుంటే ఈ ఉద్యోగాలలో మీరెందుకు?''

ఛైర్మన్ అతన్ని వారించాడు ''ఆవేశం వద్దు కాస్త నిదానంగా మాట్లాడు'' అన్నాడు మందలింపుగా.

''ఆవేశమేమిటి? జనాన్ని రెచ్చగొట్టేది వీళ్ళు! హంతకులు వీళ్ళు! దొంగలు, రౌడీలు, డకాయిట్‌లు, పిక్‌పాకెట్‌గాళ్ళు సర్వస్వం వీళ్ళే! వీరి అలవాట్లు మిగిలినవారికి నేర్పి జనం మీదకు తోలుతున్నారు. మూడు నెలలుగా నలుగురు పిల్లలు బలి అయితే ఇంత వరకూ చీమను కూడా వీళ్ళు పట్టుకోలేదు. అదేమంటే పరిశోధిస్తామంటారు. వీళ్ళు పరిశోధిస్తుండగానే మరో బాలుడు కూడా బలి అయ్యాడు. రేపు మా పిల్లలు బలికారని నమ్మకమేమిటి? ఈ అసమర్థులు టోపీలు పెట్టుకుని, కర్రలు ఊపుకుంటూ బజార్లవెంట తిరగడం తప్పితే ఇంతవరకూ చేసిందేమిటి? హంతకులలో వీళ్ళకు సంబంధాలు లేకుంటే ఎందుకు పట్టుకోరు? ఇంతమంది పిల్లలు బలి అయితే చీమకుట్టినట్లు కూడా లేని ఈ దొరగారు రేపు తన పిల్లలు బలి అయితే ఇలాగే కూర్చుంటాడా? వీళ్ళ పిల్లలకు ఏమైనా అవుతే చించుకుని పరుగెత్తే వీళ్ళు జనం పిల్లల గురించి ఎందుకు చర్య తీసుకోరు? పోలీసు శాఖ అసమర్థమయిందని నేననడంలేదు. కాని. వీళ్ళలో చాలామందికి హంతకులతో దొంగతలతో సంబంధాలున్నాయి. అందువల్లే కేసు నామరూపాలు లేకుండా చేస్తున్నారు''

ఆవేశంగా అరుస్తున్న శంకరరావును ఆశ్చర్యంగా చూస్తూ కూర్చున్నారు అందరూ.

రామ్మూర్తి తన శరీరంమీది దెబ్బలపై వాలే ఈగల్ని తోలుకోవడంలో నిమగ్నమయ్యాడు. రామ్మూర్తి అవస్థ చూస్తున్న డియస్‌పి

''ఆయన్ను హాస్పిటల్‌కు తీసుకెళ్ళండి'' అన్నాడు.

తీసుకుపోవాలనే పోలీసులూ ఆలోచిస్తున్నారు. కానీ ఆ జనంలోకి వెళ్తే తిరిగిమీదపడి అందర్నీ తంతారేమోనని వారికి అనుమానంగా ఉంది. డి.యస్.పి కూడా పరిస్థితి అర్థంచేసుకొని ఛైర్మన్‌వైపు చూశాడు. ఛైర్మన్ లేచి బయటకు వచ్చి రామ్మూర్తిని తీసుకునిపోయేలా జనానికి నచ్చచెప్పి అతన్ని తీసుకెళ్ళిన తర్వాత లోపలకు వచ్చి కూర్చున్నాడు.

''జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పటికయినా ఈ కేసుల గురించి తక్షణం చర్యలు తీసుకోండి. పసిపిల్లలు బలి అవుతుంటే ప్రజలు ఓర్పు పట్టాలనుకోవటం తెలివితక్కువతనం అవుతుంది. జనం ఓర్పుకూ హద్దులుంటాయి. వారిమీద తుపాకులు పేలితే నష్టం మీకే!'' అన్నాడు ఛైర్మన్.

డియస్‌పి బెల్ట్ వదులయ్యేలా గాలివిడిచాడు. ''పోలీసులకు ఇందులో భాగముందని ఆరోపిస్తున్నావు. నిరూపించగలవా?''

''బాగా నిరూపించగలను. కాని, ఇక్కడకాదు. ఇక్కడ నిరూపించినా దాన్ని తొక్కిపెట్టివేయగల సమర్థులు మీరు. అవసరమైతే కోర్టు

లోనయినా, జనంముందయినా నిరూపిస్తాను. అన్ని ఘోరాలకూ కారకులు మీవాళ్ళే! ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రతికేసులోనూ మీ పాలు ఉంటుంది. అందువల్లనే ఎప్పుడో పట్టివేయవలసిన ఈ కేసును, సాగదీస్తూ, కావాలని తొక్కిపట్టి మరికొందరు నాశనమవడానికి తోడ్పడుతున్నారు. అసలు హంతకులు స్వేచ్ఛగా తిరిగే వీలు కల్పిస్తున్నారు''.

''పోనీ! మీ ఛైర్మన్‌గారికి చెప్పు! పోలీసులకూ, ఆ హంతకులకూ ఇందులో సంబంధం ఉన్న వివరాలు''

''ఎవరికీ చెప్పను, వెల్లడించే సమయం ఇదికాదు''

డియస్‌పి మాట్లాడకుండా కిటికీ గుండా జనంవైపు చూశాడు. జనంలో ఇంతకుముందున్న ఆవేశంలేదు. కాని, గుంపులుగా నిలబడి ఏదో చర్చించుకుంటున్నారు. దెబ్బలుతిన్న నలుగురు కానిస్టేబుల్స్ వరండాలో చేరగిలబడ్డారు దుమ్మొదులుపుకుంటూ.

''ముందు ఆ స్థలానికి వెళ్దాం రండి'' అన్నాడు ఛైర్మన్ లేచి.

డియస్‌పి కూడా లేచి టోపీ తీసుకుని బయటకు నడిచాడు.

ఇన్‌స్పెక్టర్‌స్వరాజ్, ఆయన వెంట పోలీసులూ, చెల్లాచెదురుగా పడ్డ రాళ్ళను తప్పుకుంటూ వ్యాన్లవద్దకు నడిచి వ్యాన్లు ఎక్కారు. జనం కూడా తిరిగి కంపోస్టు డిపో వద్దకు పరుగులు తీశారు. స్టేషన్ ప్రాంతం యధావిధిగా తయారయింది. కాని, కొట్లు తెరవలేదు. శంకరరావును మాత్రం తిరిగి లాకప్‌లోకి తోశారు. బుసకొడుతూ అతడు లోపల కూర్చున్నాడు.

కంపోస్టు డిపో వద్ద వాసన భరిస్తూ జనం చాలామంది చూస్తున్నారు. అవకాశంకొరకు ఎదురుచూస్తూ, ఒకదానిమీద ఒకటిపడి కయ్యిన అరుస్తూ, కుక్కలు పోట్లాడుకుంటున్నాయి దూరంగా. పోలీస్ వ్యాన్లు అక్కడకు రావడంతో జనం దూరంగా జరిగారు. పోలీసులు వలయంగా చుట్టుకున్నారు. అప్పటికే ఎండకు అన్నం మెతుకులు ఎండిపోతున్నవి. మొండెం చుట్టూ ఉన్న రక్తం ఎండి నల్లబడుతున్నది. తలకూడా ఆ స్థితిలోనే ఉంది. వాటిని చూస్తూ తల ఆడించిన ఛైర్మన్ ''ఈ సంఘటన ఇక్కడ జరిగింది కాదు. ఎక్కడో చేసి ఇక్కడ తెచ్చిపడేశారు'' అన్నాడు.

డియస్‌పి కూడా తల ఆడిస్తూ ''నిజమే!అయితే టౌనులోనే జరిగి ఉంటుంది.ఇళ్ళల్లో చేసి, అక్కడి నుండి కారులో తెచ్చిపడవేసి ఉండవచ్చు'' అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ స్వరాజ్ ఆయా వస్తువులను స్వాధీనం చేసుకుంటున్నాడు. అక్కడ కారు టైరు గుర్తులు కనిపించడంతో ఫొటోగ్రాఫర్‌ను పిలిపించి ఆ ప్రాంతమంతా ఫొటోలు తీయించారు.

అప్పుడే బయలుదేరి అటు వచ్చాడు గోవిందం.

తెల్లారి ఇంటికి వెళ్ళిన వెళ్లడం నీరసంగా పండుకొని నిద్రపోయాడు. ఎనిమిది గంటల ప్రాంతంలో తలదిమ్ముగా ఉంటే లేచి కూర్చున్నాడు. రాత్రి జరిగిన సంఘటన తిరిగి జ్ఞప్తికి రావడంతో భయంగా ఆలోచించాడు. నరశింహారావు రాత్రి నవ్వుతూ తాను చెప్పింది విని ''అది పీడకల అయిఉంటుంది'' అన్నాడు. కాని, గోవిందం పీడకలగా నమ్మలేకపోతున్నాడు. జేబులో చెయ్యిపెట్టి చూసుకున్నాడు. కాగితం తగిలింది. తీసి చూసుకున్నాడు. అది హొటల్ బిల్లు. రాత్రి అన్నం తెచ్చిన బిల్లు. అప్పుడనుకున్నాడు నిజంగా జరిగిన సంఘటనేనని! మత్తులో ఉన్న తనను నరశింహారావు కలగా చెప్పి వంచించడానికి పూనుకున్నాడు. బయటకు వెళ్ళాలంటే భయంగా ఉంది. శెలవుపెట్టి వద్దామని నిర్ణయించుకుని స్నానం చేసి బట్టలు మార్చుకున్నాడు. భార్య కాఫీ త్రాగమంటే గ్లాను చేతికి తీసుకుని, త్రాగలేక పారబోశాడు. సైకిల్ తీసుకుని బయటకు వచ్చాడు. ప్రక్క పోర్షన్‌లో ఉన్న గంగారాం అతన్ని చూసి ''ఆఫీసుకేనా'' అన్నాడు.

తల ఊపాడు గోవిందం. ఇద్దరూ సైకిళ్ళెక్కి రోడ్డుమీదకు వచ్చారు.

''ఈరోజు మరొక పిల్లాడిని బలి ఇచ్చారట'' అన్నాడు గంగారాం.

గోవిందం ముఖంలో భయచిహ్నాలు ఏర్పడ్డాయి. ఖర్మకాలి నరశింహారావు దొరికి ఉంటే,

తనపేరు బయటపడవచ్చు. ఇంతవరకూ తన
కా విషయంతో సంబంధంలేదు. రాత్రి అనవన
రంగా ఇంట్రెస్ట్ చూపించి నెత్తికి తెచ్చుకున్నా
ననుకున్నాడు.

తిరిగి గంగారాం అన్నాడు "ఎక్కడ చేశారో
సురి! ఉదయం కంపోస్టు డిపో ముందు
పారవేసి వెళ్ళారట! వెళ్ళిచూద్దామా?"

గోవిందం తల ఊపాడు, కాదంటే అను
మానిస్తారేమోనని. ఇద్దరూ అక్కడికి చేరేసరికి
పోలీసులు అప్పుడే దిగి చూస్తున్నారు. సైకిల్స్
దూరంగా పెట్టి తాళాలు వేసి అక్కడకు
వచ్చారు. అపాటికి తల, మొండెం, కాళ్ళు
చేతులు అతికించి పెట్టారు, తెలిసిన వాళ్ళు
ఎవరయినా ఆ బాలుడెవరో గుర్తిస్తారని!

ఆ పీనుగను చూసిన గోవిందానికి రాత్రి
జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. ఒక్కసారిగా
శరీరం చలివణుకు ఆరంభమయింది. వణుకు
తున్న గోవిందాన్ని గట్టిగా పట్టుకున్నాడు
గంగారాం ఆదుర్దాగా! వెర్రివెర్రిగా పీనుగవైపు
చూస్తూ "అదే, అదే పీనుగ! వాళ్ళు చంపా
రు. నేను చూశాను" అన్నాడు కళ్ళు తేలిపోతు
న్నాయి. మనిషి నీరసించి పోతున్నాడు.
అతని మాటలు విన్న జనం ఒక్కసారిగా
త్రోసుకుంటూ చుట్టుముట్టారు.

డియస్పి, ఇన్స్పెక్టరు జనాన్ని వక్కకు
నెట్టుకుంటూ అక్కడకు వచ్చారు. అపాటికే
వెర్రిగా నాలుగుసార్లు కేకలు వేస్తూ చెప్పిందే
చెప్పి గంగారాం భుజం మీద తలవాల్చి
కాళ్ళు చేతులు కొట్టుకుంటున్నాడు.

ఇన్స్పెక్టర్ కేకతో డ్రైవర్ వ్యాను అక్కడకు
తెచ్చాడు. అతన్ని వ్యానులో చేర్చి, పోలీసుల్ని
ఎక్కమన్నాడు. వ్యాను హాస్పిటల్ వైపు
సాగింది.

"ఎవరతను?" అన్నాడు డియస్పి గంగా
రాంను చూస్తూ.

"అతడి పేరు గోవిందం. సమితి ఆఫీసులో
పనిచేస్తున్నాడు"

"అతడు మాట్లాడుతున్నదేమిటి? ఈ పిల్ల
వాడిని బలిఇస్తుంటే అతడు ఎప్పుడు, ఎక్కడ
చూశాడు?"

"అవన్నీ నాకు తెలియవు. ఇద్దరం ఆఫీ
సుకు బయలుదేరాము. ఈ వార్త తెలిసి చూసి
వెళ్దామని ఇటువచ్చాము. జరిగింది మీరు
చూశారు" అన్నాడు గంగారాం భయంగా.

జనం గుంపులుగా చేరి తీవ్రంగా చర్చించు
కుంటున్నారు. ఎలాగయితే ఏం! హంతకుల
గురించి కొంత సమాచారం ఇతని ద్వారా
తెలుస్తుందని వాళ్ళు ఆశిస్తున్నారు. పోలీసువ
ర్గాలు కూడా అదే ఆలోచనతో ఉన్నారు.
బహుశః బలిఇచ్చేటప్పుడు అతడుచూసి
ఉండవచ్చు. రెండవసారి చూడటంవల్ల ఆ
టెన్షన్, భయంకరమైన ఆ సంఘటన తల్చు
కుని స్పృహతప్పి ఉండవచ్చు. స్పృహవస్తే
గానీ అన్ని విషయాలూ బయటపడగలవని
డియస్పి అనుకున్నాడు.

అక్కడి వస్తువులను వ్యానులో చేర్చారు
పోలీసులు. శవాన్ని హాస్పిటల్‌కు మరోవ్యా
నులో పోస్టుమార్టం కొరకు పంపారు. వ్యాన్లు
వెళ్ళిపోతూనే జనం కూడా ఎవరిదారినవాళ్ళు
ఎవరిపనులమీద వాళ్ళు వెళ్ళిపోనారంభించా
రు. అంతవరకూ దూరంగా ఉన్న కుక్కలు
అక్కడకు వరుగువరుగున చేరాయి. పోలీసు
లు ఎత్తగా మిగిలిన రక్తపుకూడు కొరకు అవి
భీకరంగా పోట్లాటకు సిద్దపడి తోకముడుచు
కుని, నోళ్ళు తెరచికయ్యిమంటూ అరుస్తు
న్నాయి.



అవధూత అప్పుడే నిద్రనుండి లేచాడు. ప్ర
క్కన భామ ఒంటిమీద గుడ్డలు లేకుండా
నిద్రపోతున్నది. జీరో బల్బుమందంగా వెలుగు
తున్నది. వాతావరణం బయటా, లోనా ప్ర
శాంతంగా ఉంది. కుర్చీలో కూర్చుని చిలుం
గొట్టం బయటకుతీసి గంజాయి దట్టించాడు.

అగ్గిపుల్లగీసి వెలిగించాడు. పొగలాగుతూ ఆలోచిస్తున్నాడు.

నరశింహారావు మరొకడివి తెచ్చి ఇంటిలో ఎందుకు ఉంచాడు? మరొకరు ఎవరూ ఉండకూడదని తాను ఎంతగా చెప్పినా అతడు ఎందుకిలా ప్రవర్తించాడు? రేపు వాడికి స్మారకం వచ్చి, జరిగిందంతా చెబితే నరశింహారావు పట్టుపడతాడు. అతడు పట్టుబడితే తాను దొరికిపోవలసి వస్తుంది. ఆ తర్వాత బాబా ఏమవుతాడన్నది కాదు సమస్య! తాను మాత్రం కటకటాల్లో కూర్చోవాలి. ఇప్పటికే బాబాకు తెలియకుండా కూడబెట్టిన బంగారం, డబ్బు చాలాఉంది. ఈ సంపదతో పరారయి ఇకనయినా ఇటువంటి వాటిలో తలదూర్చకుండా హాయిగా బ్రతకాలి. ఉన్న జీవితాన్నయినా తృప్తిగా అనుభవించకుంటే ఈ జన్మకు సార్థకమేమిటి? కూటికొరకు కాషాయిగుడ్డలు, జడలు విరబోసుకొని తిరిగిన రోజుల్లాగే ఇంకా బ్రతకాలన్న ఉద్దేశం అతడికి లేదు. తినడానికి ఇంత డబ్బు కూడబెట్టుకున్న తర్వాతయినా సుఖంగా బ్రతుకలేకపోతే లాభం ఏమిటి?

అవధూత గతాన్ని నెమరువేసుకుంటున్నాడు.

చిన్నపాటి రైతు కుటుంబంలో జన్మించిన అవధూత చిన్నప్పుడే చదువు సంధ్యలు లేకుండా జులాయిగా, పోకిరిగా తయారయి తిరిగాడు. అవధూత అసలు పేరు పిచ్చయ్య. తనతోటి పిల్లలతో పిచ్చిపట్టినట్లే ప్రవర్తించేవాడు. వారిమీద నాయకత్వం, రౌడియిజం ప్రయోగించేవాడు, తల్లితండ్రులు చిన్నప్పుడే చనిపోవడంతో మేనమామ పంచన చేరాడు. మేనమామ అసలే బీదవాడు. ఏరోజు కష్టం ఆరోజు తెచ్చుకుని కాలం గడపవలసిన స్థితిలో ఉన్నవాడు. పిచ్చయ్య ఆస్తి అతడికి కొంత ఉపశమనం కలిగించింది. దొరికిన వాణ్ణి పోగొట్టుకోకూడదని, ఉన్న కూతురిని పదిహేడవ ఏటనే అంటగట్టాడు. అటువంటి రౌడీకి ఆ పిల్లను ఇవ్వకూడదని ఆమె తల్లి అన్న మొత్తుకున్నా ఆస్తికొరకు మేనమామ పెళ్ళిచేసేశాడు. తన బిడ్డకు అంతమాత్రం ఆస్తికల వాడు దొరకడం అసాధ్యమని ఆయనకు తెలుసు.

పిచ్చయ్య కొన్నాళ్ళు భార్యతో బాగానే కాలం గడిపాడు. ప్రతిరోజూ కొత్తరకం అలవాటుపడే పిచ్చయ్యకు ఆమె సరిపడలేదు. ఉన్న ఆస్తి త్రాగుడుకు, పేకాటకు, వ్యభిచారానికి కైంకర్యం చేశాడు. చివరకు భార్యకు, వేళకు కూడు పెట్టడం కూడా తన తలకుమించిన పని అయిందని ఆలోచించి, చెప్పాపెట్టకుండా ఊరు విడిచిపారిపోయాడు. అక్కడి నుండి అనేక అవతారాలెత్తాడు. చిన్న చిన్న చిల్లర దొంగతనాలు, జేబుదొంగతనాలు మొదలుకొన్ని హత్యలు చేయగలస్థాయికి ఎదిగాడు. ఈ సమయంలోనే బాబా అతడికితోడయ్యాడు. బాబాను గురించి అందరూ ఘనంగా చెప్పుకుంటుంటే అతన్ని చూడటానికి ఆయన మకాం వద్దకువచ్చాడు. బాబాను నమ్మడానికి, అతడి శిష్యుడిగా ఉండడానికి సిద్ధపడ్డాడు. ఆయన మాటలువిని కాషాయవేషం వేసి, గడ్డం పెంచాడు. అతడికి శుశ్రూషచేయడానికి నిర్ధారించుకున్న సమయంలో తన జీవితచరిత్ర సవివరంగా బాబాకు విన్నవించుకున్నాడు.

ఇటువంటి వ్యక్తి కొరకే ఎదురుచూస్తున్నాడు బాబా! సమయం చూచి చల్లగా అసలు విషయాలలోనికి లాగాడు. ముందు ఆశ్చర్యపోయినా, తర్వాత అందులో ఇమిడిఉన్న పరమార్థం తెలుసుకున్న పిచ్చయ్య బాబాకు సహాయ సహకారంగా ఉండటానికి అంగీకరించాడు. బాబా మోసగాడయినా, మంచోడయినా తనకవసరం. అతన్ని అడ్డుపెట్టుకుని తాను డబ్బు సంపాదించుకునే అవకాశం ఉన్నప్పుడు ఎందుకు వదలిపెట్టాలి? ఈ దేశంలో ఎవడు నీతిమంతుడో ఎవడికివాడు శోధించుకుంటే అర్థమయ్యేది- తమ జీవితంలో ఎప్పుడో ఒకసారి అయినా అవినీతికి పాల్పడ్డామని! తాను పురాణకథలోని సత్యహరిశ్చంద్రుడూ కాదు, శిబిచక్రవర్తీకాదు. జీవితమంతా లుచ్చాగానే కాలంగడిపాడు. ఇక మిగిలినకొద్ది జీవితం హరిశ్చంద్రుని నెమరువేసుకుంటూ బ్రతకాల్సిన పనిలేదు. అందేది అందుకుందామనుకున్నాడు.

అంతే!

పిచ్చయ్య అవధూతగా మారాడు. దివ్యభవ

నంలో మకాం వేశాడు. బాబాకు పరమశిష్యుడే కాదు అంతరంగిక కార్యదర్శి కూడా అయికూర్చున్నాడు. బాబా సేవలో తరిస్తున్న పాతికేళ్ళ అందాలరాశి భామ అవధూత సేవకొరకు వినియోగించబడింది. బాబాకు చెందిన ఆదాయం అవధూతకనుసన్నలలోకి వచ్చింది. బొడ్డు దగ్గర తూటుపొడిస్తే 'బ' కూడా వలుక లేని అవధూత నోట్లకట్టలు, బంగారు దిమ్మెల మధ్య పవళించనారంభించాడు. మొదటి నుండీ కరకుదనంతో రాటుదేలిన పిచ్చయ్యకు ఇక్కడి కరకుపద్ధతులు పెద్దఅలజడి కలిగించలేదు. భామ బాబా సేవికలలో ఉండి, అతడి చిత్తప్రవృత్తి అర్థంచేసుకున్న తర్వాత, తాను ఈ మురికికూపం నుండి బయటపడటం కష్టమని నిర్ణయించుకుంది. అడుగడుగునా కాపలాతో ఉన్న పరిస్థితిలో ఎవరో ఒకరికి లొంగిఉండక తప్పదు! భక్త కోటి విరివిగా ఉన్న బాబాకంటే, ఇంకా ఎవరూలేని అవధూత ఆశ్రయంలో ఉండడం మంచిదనుకుంది.

ఆలోచనల్లో గొట్టంలో గంజాయి అయిపోయింది. అగ్గి ఆరిపోయింది. గొట్టం టేబిల్పై వేసి చేతులు పైకెత్తి ఒళ్ళువిరుచుకున్నాడు. ఇక తాను తొందరపడాలి. ఎవరు ఎలాఛస్తే తనకెందుకు? ఉన్నంతవరకూ చేజిక్కించుకుని పారిపోవాలి.

బాత్రూంకు వెళ్ళి చన్నీటిస్నానం చేశాడు. మెదడు ప్రశాంతంగా ఉంచడానికి చన్నీటి స్నానమే శరణ్యమని బాబా ఉద్బోధిస్తుంటాడు. అదే అవధూత అవలంభిస్తాడు. ఈరోజు చాలా మందిని కలుసుకోవాలి. వారితో కార్యక్రమాలు పూర్తి చేసుకున్న తరువాత తన పలాయన మార్గం నిర్ణయించుకోవాలి. అల్మారాలోని గుడ్డలు తీసి తొడుక్కున్నాడు. భామవద్దకు వచ్చి లేపాడు. ఒళ్ళు విరుచుకుంటూ లేచిన భామ తన ఒంటిమీద గుడ్డలు లేకపోవడం చూసి, సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ దుప్పటిపైకి లాక్కుంది. అవధూత మరో సమయంలో అయితే ఆమె సిగ్గుపడే నటనకు, చేష్టలకూ సంతోషించేవాడే! కాని ఇప్పుడు ఆమూడ్ లేదు. ఆమెతో సంభాషించే ఓపిక కూడా అతనికి లేదు.

"లే! లేచి పాలు తీసుకురా!"

అతడి కంఠంలో కన్పిస్తున్న విసుగును చూచి మంచందిగి గుడ్డలు కట్టుకుని ప్రక్కనున్న వంటింట్లోకి దారితీసింది. ఆమె కనిపించినంతవరకూ చూచి, గడ్డం సవరించుకుని, హాలు మధ్యకు వచ్చి కూర్చున్నాడు. గోడకు బిగించిన అద్దంలో బయటి దృశ్యం కనిపిస్తున్నది. బయట తలుపు దగ్గర ఇద్దరు కునికిపాట్లు పడుతూ కూర్చున్నారు. గేటువద్ద మరో నలుగురు బీడీలు కాల్చుకుంటూ నిలబడి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళందరూ మెలుకవగానే ఉన్నారు. మెయిన్గేటు తలుపు తీసిఉంది. తలుపు ముందు కళ్ళాపిచల్లి ముగ్గువేసి ఉంది. ఇంటిలోనుండి బయటకు పాల కేన్ తీసుకువెళ్తున్నాడు ఒక వ్యక్తి.

భామ పాల గ్లాసుతో హాలుమధ్యకు వచ్చింది. గ్లాసు అతనికి అందించి, చిందరవందరగా ఉన్న వెంట్రుకలను వ్రేళ్ళతో సరిచేసుకున్నది. కడుక్కున్న ముఖాన్ని చీరచెంగుతో తుడుచుకుంటూ నిలబడింది. పాలుత్రాగి, గ్లాసు ఆమె చేతికి ఇచ్చి చేతికి ఉన్న గడియారం చూసుకున్నాడు. సమయం ఏడుగంటలయింది. తనతో మాట్లాడదలచిన వారు ఇక వచ్చే సమయమయింది.

"భామా! 'అమ్మ'గారికి ఫోన్చేసి చూడు. బాబాగారు మేలుకున్నారో, నిద్రపోతున్నారో!"

భామ కినుక్కున నవ్వింది. "పదిమంది పడతుల సేవలో సేదదీరుతున్న బాబాగారు ఇప్పుడిప్పుడే నిద్రలేవగలరా స్వామీజీ?"

ఆమె పరిహాసాలకు అతడికి ఒళ్ళు మండింది. ఆడదానికి అవకాశం దొరికితే ఎగతాళి చేయడానికి వెనుదీయదనుకున్నాడు. విసుగ్గా ఆమె ముఖంవైపు చూసి "పరిహాసాలకు ఇది సమయం కాదు, వెళ్ళు" అంటూ కసురుకున్నాడు.

ప్రక్కనే ఉన్న టెలిఫోన్ రిసీవర్ చేతికి తీసుకుంది. అవతలి వ్యక్తితో మాట్లాడి క్రింద పెడుతూ "లేచారు. యోగ సమాధిలో ఉన్నారట. మరో ఐదు నిముషాల తర్వాత మాత్రమే మాట్లాడమంటున్నారు 'అమ్మ'!" అంది.

"నువ్వు లోపలకు వెళ్ళు! అతిథులు వచ్చి

నవుడు అవసరమైనప్పుడు రా! అంతవరకూ ఇటు రానవసరంలేదు.'' అతని కంఠంలో కనిపిస్తున్న కరకుదనం చూసి లోపలికెళ్తూ అవహేళనగా పెదవి విరిచింది.

బయట గేటుదాటి కారు లోపలికి రావడం చూశాడు. ఊపిరి పీల్చి వదలి నటించడానికి సర్దుకుని కూర్చున్నాడు. కారునుండి దిగిన ఇద్దరు వ్యక్తులు తలుపువద్దకు వచ్చి ఆగారు. బయటనుండి లోపలకు బెల్ వినిపించింది. బదులుగా టేబుల్‌కు అమర్చిన బజార్‌నొక్కాడు. తలుపులు తెరుచుకున్నాయి. ఇద్దరూ లోపలకు ప్రవేశించారు.

''రాం రాం స్వామీజీ!''

''రాం రాం! రండి కూర్చోండి. ఎప్పుడు దయచేశారు?''

''రాత్రి అంతా ఒకటే ప్రయాణం! మధ్యన ఏఅడ్డంకులూ లేవు. ప్రయాణం సుఖంగా జరిగింది.

తల ఊపాడు అవధూత నవ్వుతూ ''మంచిదే! మీరు నాకు గుర్తేననుకోండి. వీరెవరో పరిచయం చేయలేదు'' అన్నాడు.

''ఈయన పేరు రవిశర్మ! మా సంస్థలో చీఫ్ కంట్రోలర్‌గా వ్యవహరిస్తుంటారు. ఈయనకు కూడా కొంత భాగస్వామ్యం ఉంది. పనిలో నేర్పరితనం, శ్రద్ధ కలిగిన గొప్ప మేధావి''

'మేధావి కానివాడు ఈ పనులలోకి ఎందుకు దిగుతాడు?' అనుకున్నాడు అవధూత. రవిశర్మవైపు చిరునవ్వుతో చూసి లేచి షేక్‌హ్యాండ్ ఇచ్చాడు. రవిశర్మ నవ్వుతూ అవధూత కళ్ళలోనికి చూశాడు. గడ్డం, మీసాలు, కనుబొమ్మల వెంట్రుకల మధ్య అవధూత నోరు, ముక్కు, కళ్ళు సరిగ్గా కనిపించడంలేదు.

''మేము వెంటనే మా కార్యక్రమాలు నిర్వహించుకుని వెళ్ళిపోవాలి. మాకు చెందిన విషయాలు పూర్తి చేయండి'' అన్నాడు రెండవ వ్యక్తి బహద్దూర్.

''కొంచెం సేపు కూర్చోండి వస్తాను'' అంటూ లోపలకు వెళ్ళాడు అవధూత. బాబాకు ఫోన్ చేశాడు. అటువైపు నుండి స్త్రీ కంఠం వినిపించింది.

''బాబాగారితో మాట్లాడాలి, వారికి ఫోన్ అందించండి''

''నేను 'అమ్మ'ను మాట్లాడుతున్నాను. ఆయన యోగనిష్ఠనుండి లేవలేదు. మా అవసరమేమిటో చెప్పండి'' అంది అటునుండి.

బాబాగారి సేవికల నాయకురాలు అమ్మ. బాబాగారికి ఏకైక సలహా, అధికారిణి ఆమె. బాబా తర్వాత స్థానం ఆమెదిగా పైకి కనిపించినా, ఆమె మాటను జవదాటడం బాబాకు సాధ్యంకాదు. 'అమ్మ'గా ఆమె పేరు ప్రఖ్యాతులు పొందింది. బాబా రహస్యాలన్నీ ఆమాటకొస్తే బాబాకు ఎక్కడ ఎలాంటి వెంట్రుక ఉందో శరీరం చూడకుండానే చెప్పగల వ్యక్తి. 'ఆమెతో మాట్లాడను' అనడానికి అవధూతకేకాదు మరెవరికీ శక్తిలేదు.

''నిన్న బాబాగారు చెప్పారు, బెంగుళూరు నుండి ఇద్దరు వ్యక్తులు వస్తారని. వాళ్ళు వచ్చారు. వారితో ఏవిధంగా వ్యవహరించాలో తెలుసుకోండి''

''వారి పేర్లు?''

''బహదూర్, రవిశర్మ''

''మంచిది మంచిది'' అంది అమ్మ. ఆవిడ బాబాను అనుకరిస్తున్నదనుకున్నాడు.

''వారికి సంబంధించిన వ్యవహారం నిన్ననే బాబా మీకు చెప్పారు. వారి దగ్గరున్న కాగితాలు పరిశీలించండి. ధరల వివరాలు వారి నాయకుడికి ఇంతకుముందే పంపించాం. ఆ వివరాలు వారివద్ద ఉంటే అదే పద్ధతిలో అప్పగించండి. వారిదగ్గర లేకపోతే ఒక్కొక్కరికి పదిహేనువేల రూపాయలచొప్పున వసూలు చేయండి''

లైను కట్ అయింది. అవధూత రిసీవర్ క్రేడిల్ మీద ఉంచి చిరునవ్వుతో హాలులోకి వచ్చాడు.

''దయచేసి మీరు బాధపడకండి. ఇటువంటి వ్యవహారాలు చాలా సున్నితంగా ఉంటాయి. అందువల్ల అడుగక తప్పడంలేదు. మా బాబాగారి నుండి మీ సంస్థకు వచ్చిన ఉత్తరాలేమయినా తెచ్చారా?'' అన్నాడు అవధూత.

రవిశర్మ చిరునవ్వుతో అతడిముఖం పరిశీలించాడు. తనదగ్గరున్న ఫైలును బయటకు తీసి, అందులోని కాగితాలు చూపించాడు. ఒక్కో పిల్లవాడికి పదివేల రూపాయల వంతున వాళ్ళు ఇవ్వడానికి అంగీకరించిన పత్రాలు అవి.

''మొత్తం ఎంతమందిని మాకు అప్పగించ గలరు?'' బహదూర్ ప్రశ్న.

''మాదగ్గర ప్రస్తుతం ముప్పైమందికంటే ఎక్కువలేరు. మీకు మరింతమంది కావాలంటే ఒక నెలగడువు పెడితే కావలసినంతమందిని సంపాదించి అప్పగించగలం''

అవధూత మాటలకు తల ఊపాడు రవిశర్మ.

''ప్రస్తుతం ఉన్నంతవరకే చూద్దాం. తర్వాత అవసరాల గురించి మాట్లాడు కుందాం'' అంటూ ఫైలులోని మరొక కాగితం తీసి చూపిస్తూ ''మా డైరెక్టర్ జనరల్‌గారు బాబాగారికి ప్రత్యేకంగా రాసిన ఉత్తరం ఇది. పిల్లలకు ట్రీట్‌మెంట్ చేసుకోడానికి ఇక్కడే అవకాశం కావాలి. ట్రీట్‌మెంట్ అయిన రెండు రోజుల తర్వాత తీసుకెళ్తాం''

అవధూత ఆ పేపర్ పరిశీలించాడు. తల ఊపి ''ఉండండి... వస్తాను.'' అంటూ పడకగదిలోనికి వచ్చాడు. రిసీవర్ చేతికి తీసుకున్నాడు. తిరిగి అమ్మగారే పలికారు.

''అమ్మగారూ... బాబాగారితోనే ప్రత్యేకంగా మాట్లాడి పర్మిషన్ తీసుకోవలసిన విషయం. అందువల్ల తమరు దయచేసి బాబాగారికి ఫోన్ అందించండి'' అన్నాడు. మధ్యన ఈమె అధికారం ఏమిటి? ఆర్పుతుందా తీర్చుతుందా? ఈమె చేతికి అధికారంవస్తే అటు బాబా, ఇటు నేను తిరిగి రోడ్డుమీదకు వచ్చి జోలె తగిలించుకుని మళ్ళీ సితార తీసుకుని పాటలు పాడుకోవలసి వస్తుందనుకున్నాడు.

మరో నిమిషంలో బాబా మృదువుగా పలికాడు. వివరాలు చెప్పాడు అవధూత. బాబా చాలాసేపు ఆలోచిస్తున్నట్లుండి పలకలేదు. రెండు నిమిషాల తర్వాత ''సరే... మన అండర్‌గ్రౌండ్‌లో వారికి అవకాశం కల్పించండి'' అన్నాడు.

అవధూత వారివద్దకు వచ్చి తన అంగీకారం తెలిపాడు. భామ ప్లేట్లలో ఫలహారం తెచ్చింది ముగ్గురికీ. మెరిసిపోతున్న సిల్కు దుస్తుల్లో అంతకంటే మెరిసిపోయే దేహంతో ఉన్న భామను చూసి రవిశర్మ గుటకలు మింగాడు. టేబుల్ దగ్గరకు లాగి, ఫలహారపు ప్లేట్లు అక్కడ పెట్టి లోపలకు వెళ్ళింది. వయ్యారంగా నడిచి వెళ్తున్న ఆమె వీపును చూస్తూ రవిశర్మ బొమ్మలా కూర్చుండిపోయాడు.

రవిశర్మ భావం గమనించిన అవధూత ''ఫలహారం తీసుకోండి'' అన్నాడు.

అవధూత ముఖంలో కనిపించిన కోపం చూసి రవిశర్మ తలపక్కకు తిప్పుకున్నాడు. ఫలహారం తినడం పూర్తయ్యేసరికి ముగ్గురికీ పాలు కలిపి తెచ్చింది. వారు పాలు తాగేంతవరకూ అక్కడే నిలబడి, ప్లేట్లు - గ్లాసులు తీసుకుని లోపలకు వెళ్ళింది.

అటువంటి యువకుల్ని చూసినప్పుడల్లా భామ హృదయం చలిస్తుంది. అందంగా, ఆనందంగా, సుఖంగా యవ్వనపు పొంగుల్ని అనుభవించవలసిన వయస్సులో, సత్తాలేని జెబురుగడ్డాల ముసలమధ్య శరీరాన్ని కృశింపచేసుకుంటున్నందుకు ఏడుపు వస్తుంది. అయినా తప్పదు. వాళ్ళు కనిపించేది తాత్కాలికం. వీరు కనిపించేది శాశ్వతం! వారితో కనీసం మాట్లాడే హక్కు కూడా లేదు. వీరి అవసరాలు తీర్చవలసిన బాధ్యత తనది,లేదా బలవంతంగా నయినా తీర్చుకుంటారు.

లోపలకు వెళ్తున్న భామవైపు చూశాడు బహదూర్.

''చెప్పండి'' అన్నాడు అవధూత ముఖంలోకి చూస్తూ రవిశర్మ.

''మాకు ఇక్కడ అండర్‌గ్రౌండ్ ఉంది. మీకు అవసరమనుకుంటే దాన్ని ఉపయోగించుకోవచ్చు. రెండు రోజులు అంటే ఈ రోజు రేపు మాత్రమే అవకాశం. ఎట్టి పరిస్థితుల్లోనూ మీరు ఎల్లుండి ఉదయం ఖాళీచేయవలసి ఉంటుంది'' అన్నాడు అవధూత చిలుంగొట్టానికి గంజాయి కూరుస్తూ.

అంగీకరించాడు రవిశర్మ. ''ఈరోజు రేపు చాలు. ఈ ట్రీట్‌మెంట్ మాప్రాంతంలో చేసుకోగలం, కాని పిల్లల్ని వ్యానులో తీసుకెళ్తుంటే

వాళ్ళు కేకలేశారనుకోండి, వ్యవహారం చెడుతుంది. అందువల్ల ఇక్కడే ట్రీట్‌మెంట్ ఇచ్చి, ఒకరోజు స్వస్థతపొందిన తరువాత వ్యానులో తీసుకెళ్తే, ట్రీట్‌మెంట్ బడలికవల్ల అరవలేక పోతారు. అందువల్లే ఇక్కడ ట్రీట్‌మెంట్ చేయాలనుకున్నాం''

తల ఊపాడు అవధూత. గొట్టం వెలిగించి ఒక దమ్ములాగి వారికి అందించాడు, వాళ్ళు కూడా దమ్ములాగారు.

''మొత్తం ముప్పైమంది మనిషికి పదివేల చొప్పున మూడు లక్షల రూపాయలు అవుతుంది'' అన్నాడు అవధూత– డబ్బు బయటకు తీయమన్న ధోరణిలో.

రవిశర్మ సూట్‌కేస్ పైకెత్తి టేబుల్‌పైన పెట్టాడు. మూత తెరచి డబ్బు కట్టలు అవధూత ముందుకు తోస్తూ ''లెక్క పెట్టుకోండి'' అన్నాడు.

అవధూత గడ్డం సవరించుకుంటూ నవ్వాడు. ''ఇందులో మోసాలు జరుగుతాయనుకోను. మనవని బయటివారిని మోసం చేయటం. మనలో మనమే ఆ మోసాలు ఉపయోగించుకుంటే ఎన్నాళ్ళు వ్యాపారం చేయగలం?'' అన్నాడు. లేచి నిలబడి ''వెళ్దాం పదండి'' అన్నాడు.

ఇద్దరూ అతన్ని అనుసరించారు. డబ్బు కట్టల్ని పడకగదిలోకి విసిరివేసి, వారిద్దరితో అండర్‌గ్రౌండ్‌వైపు వెళ్ళాడు. ఆ డబ్బు కట్టల్ని గుండెలకదుముకుంది . భామ ఆనందంతో. ఒక్కో కట్టను రెండుసార్లు చొప్పున మార్చి మార్చి ముద్దుపెట్టుకుంది.

ముగ్గురూ లోపలకు వచ్చేటప్పటికి కొందరు పిల్లలు ఇంకా నిద్రపోతున్నారు. కొందరు అప్పుడే లేచి కూర్చున్నారు. ముందే లేచిన వారు భయంభయంగా చుట్టూ చూస్తున్నారు. ఎవరూ అరవడంలేదు, ఏడవనూలేదు.

ఒక్కొక్కరిని వరుసగా చూపించి లెక్కపెడుతూ ముప్పైమందినీ చూపించాడు.

రవిశర్మ తల ఊపి, ''మీ సహాయానికి మా థాంక్స్ ... పదండి వెళ్దాం! మా పనులు కూడా తొందరగా ముగించుకోవాలి'' అన్నాడు.

ముగ్గురూ హాలులోకి వచ్చారు. అవధూత అనుమతితో రవిశర్మ ఫోన్ రిసీవర్ చేతికి తీసుకున్నాడు ''వ్యాను వెంటనే తీసుకురండి'' అని అటువారికి చెప్పి, క్రేడిల్ మీద ఉంచాడు.

''వ్యాను ఎక్కడుంది?'' అన్నాడు అవధూత బహదూర్‌తో.

''హొటల్‌వద్ద విడిచివచ్చాము. అందరినీ ఒకేసారి ఇక్కడకు తీసుకురావడం మంచిది కాదుగదా''

తల ఊపాడు యధాలావంగా అవధూత.

పదిహేను నిమిషాల్లో వ్యాను వచ్చింది. వ్యానులోని సామానులు తీసుకుని నలుగురు మనుమలు లోపలకు వచ్చారు. అందరూ అండర్‌గ్రౌండ్ హాలులోకి దారితీశారు. తెచ్చిన సామానులు కిందపెట్టి, మరికొన్ని సామాన్ల కొరకు వెళ్ళారు.

''దయచేసి ఇక్కడకు ఎవరినీ రానివ్వకండి. రాదలచుకుంటే మీరు మాత్రమే రండి. మావరకూ మాకు కావలసిన సామానులకూ, అవసరాలకు మా మనుమలు నలుగురూ పైకీ కిందకూ తిరుగుతూ ఉంటారు''

అంగీకరించాడు అవధూత. మరిన్ని సామాన్లతో నలుగురు తిరిగివచ్చారు. కొన్ని కుర్చీలు, టేబుల్స్ పైనుండి కింది హాలులోనికి వాళ్ళే చేర్చుకున్నారు. బేసిన్‌వద్ద పంపు తిప్పి చూశారు, నీరు వస్తున్నది.

పైనుండి నాలుగు మంచాలు తెప్పించారు. అంతటినీ పరిశీలించి సంతృప్తిగా తల ఊపాడు రవిశర్మ. ''మీరు వెళ్ళి పిల్లల్ని మా వారికి అప్పచెప్పండి'' అన్నాడు.

అవధూత వెళ్ళి, వారికి అప్పగించవలసిన పిల్లల్ని చూపించాడు. ఒక పిల్లవాడి జబ్బపట్టుకున్నాడు వారిలోని ఒక వ్యక్తి. ఆ పిల్లవాడు అరుస్తున్నా లెక్కచేయకుండా హాలులోనికి తీసుకువచ్చాడు. టేబుల్‌పై పడవేసి ఇద్దరూ గట్టిగా పట్టుకున్నారు. మూడో వ్యక్తి తాడు తీసుకుని పశువును కట్టివేసినట్లు కాళ్ళు చేతులు కదలకుండా బిగించాడు. తల, దేహం ఏదీ కదలకుండా ఉండలా చుట్టి కట్టివేశాడు. వాడి అరుపులు మాత్రం హాలులో ప్రతిధ్వనిస్తున్నాయి. రవిశర్మ డాక్టరుగా తయారయ్యాడు. శస్త్ర చికిత్సకు కావలసిన పరికరాలను మరొక

టేబులోమీద అమర్చారు. పిల్లవాడి మోకాలును పరిశీలించాడు. కండ- నరాలు- ఎముక పట్టి పిసికి చూశాడు. తర్వాత కత్తితో మోకాలి కిందుగా కోశాడు. జిల్లున రక్తం స్రవించింది. పిల్లవాడి పెడబొబ్బలకు హాలు అదురుతున్నట్లుంది. వెంటనే మార్ఫియా ఇంజక్షన్ ఇచ్చాడు. పిల్లవాడి అరుపులకు వారి చెవులు రొదపెడుతున్నాయి. రెండు నిమిషాల్లో మత్తులోకి వెళ్ళాడు పిల్లవాడు. కత్తెర తీసుకొని ఎముకను కత్తిరించాడు. మోకాలి కిందభాగం కత్తిరించిన వరకు ఊడివచ్చింది. దాన్ని డస్ట్‌బిన్‌లో పడేసి కారుతున్న రక్తాన్ని ఆపడానికి ప్రయత్నం చేశాడు. మందువేసి తెగిన కాలువద్ద కట్టు బిగించాడు. అదేవిధంగా ఒక చెయ్యి భుజంవరకూ తీసి కట్టుకట్టాడు. తాడువిప్పి, వాడిని హాలులో ఒక మూలకు తీసుకెళ్ళి కింద పరుండబెట్టారు. మరొకడిని తెచ్చారు. వాడు హాలు కలియచూసి, ఒకమూల రక్తం ఓడుతున్న పిల్లవాడిని చూసి, రోదన ఆరంభించాడు. రవిశర్మ ఆలస్యం చేయకుండా వాడికి కూడా మార్ఫియాన్/ఎక్కించాడు.

స్పృహకోల్పోయిన తరువాత టేబుల్ మీద పరుండబెట్టి, కట్టేశారు. రెండుచేతులూ, మోకాలిపైకి కటింగ్ చేశారు. కాలు, మోకాలి వరకూ వెనకకు విరిచి వంకరతిప్పాడు. వాడిని కూడా తీసి మొదటివాడి ప్రక్కన పరుండపెట్టారు. మూడవవాన్ని తెచ్చి మత్తుమందు ఎక్కించారు. కళ్ళు తెరచి ద్రవంపోశారు. క్షణాలమీద చురచురపొంగి, రెండు కళ్ళున్నచోట లొట్టలుపడ్డాయి. మరొకడిని తెచ్చారు. చెవులో ఇనుపకడ్డీ దూర్చి త్రిప్పి చెవుడు కలిగించారు. రెండుకాళ్ళూ విరిచివేశారు.

రెండు గంటల్లో ఆముప్పై మందిని వికలాంగులుగా తయారుచేసి వరుసగా పడుకోబెట్టారు. అవధూత లోపలకువచ్చాడు. కనికరమంటే ఏమిటో కలలో కూడా తెలియని అవధూత, అదంతా చూసి ఒక్కసారిగా వెర్రిగా కేకపెట్టాడు. బహదూర్ అవధూత వీపున చిన్నగా తట్టాడు. అవధూత కళ్ళు తెరచాడు. రక్తంలో ఓలలాడుతున్న పిల్లల శరీరాలు రక్తంలో అన్నపుముద్దల్లా పడిఉన్నాయి. విరిచిన కాళ్ళుచేతులు బయటకు తీసుకెళ్ళారు. నీటితో ఆ ప్రాంతమంతా శుభ్రంగా కడిగి ఫినాయల్, సెంటు కలిపి చల్లారు. రవి శర్మ కాళ్ళు చేతులు కడుక్కొని ఏమీ జరగనట్లే అవధూతవైపు చూసి చిరునవ్వు నవ్వాడు. "రండి పైకివెళ్దాం" అంటూ ముందు నడిచాడు. ముగ్గురూ పైన హాలుచేరుకున్నారు. అవధూత ఆ షాక్ నుండి ఇంకా తేరుకోలేదు. అతడి తల గిరగిర తిరుగుతున్నట్లుగా ఉంది. 'అసలు నిజంగా అది చూశానా, లేక కల' అన్న భ్రమలోనే ఉన్నాడు.

రవిశర్మ అవధూత చేతిపై చిన్నగా తట్టాడు "అది మామూలే స్వామీజీ! ఇందులో బాధపడవలసింది, భయపడవలసిందీ ఏముంది. మొదటిసారి కాబట్టి మీరుగాబరాపడి ఉంటారు. మేమూ అంతే! మొదటిసారి ఇలాగే ఉంటుంది. ఇప్పుడు చూడండి, ఏమీ జరగనట్లే, ఎంత ప్రశాంతంగా ఉన్నామో? మా వృత్తి ఇది! కొందరు బెండకాయలు వ్యాపారం చేస్తారు. మరికొందరు శనగపప్పు వ్యాపారం చేస్తారు. మన వ్యాపారం మనదే! ఆ వ్యాపారులకు లేని భయం మనకెందుకు? ఇందులో జాలి తలచవలసిందీ, భయపడవలసిందీ ఏమున్నది?" అన్నాడు అవధూత కళ్ళు చికిలించి చూస్తూ తలఊపాడు అడ్డంగా! బెండకాయలూ, శనగపప్పు వ్యాపారమూ ఇదీ ఒక్కటేనని సమర్థించుకోవాలన్నా ఆత్మ ఒప్పుకోదుగదా!"

పకపకనవ్వాడు రవిశర్మ. "ఆత్మ! ఆత్మట! ఎక్కడుందది? దాని పేరు చెప్పి జనాన్ని జోకొట్టేవాడికే తెలియదు. వరిగడ్డికి ప్రాణం ఉంది, చెట్టుకు ప్రాణం ఉంది. గొర్రెకు ప్రాణం ఉంది, గొడ్డుకు ప్రాణం ఉంది. గద్దకీ పక్షికీ, చీమకూ దోమకూ ప్రాణం ఉంది. వాటిని నిర్దాక్షిణ్యంగా మన అవసరాలకు ఏమాత్రం పాపభీతిలేకుండా చంపేస్తున్నాం. చంపివండి, నమిలి మింగేస్తున్నాం. మరి మనతోటి మనిషిని చంపినప్పుడే ఆ పాప భీతి ఎందుకు వస్తుందంటారు? అన్ని ప్రాణుల ప్రాణాలు తీసి హింసించేటప్పుడు లేని భీతి, జాలి నరునిమీద మాత్రం ఎందుకుండాలి? ఆలోచిస్తే ఒకటే కనిపిస్తున్నది. మొదటినుండీ మనిషి మీద మనిషి మమకారం పెంచుకుంటున్నాడు. మిగిలిన ప్రాణుల్ని చులకనగా చూస్తున్నాడు. అందువల్ల తనతోటి రూపానికి

హానిచేయడానికి భయపడుతున్నాడు. మొదటినుండి తనతోటి మనిషిని కూడా ఏ గడ్డిపరకగానో భావించాడనుకోండి. ఆ గడ్డిపరకను త్రెంపేసినట్లే మనిషినీ త్రెంచివేయగలడు. ఇందులో భయంగానీ, పిరికితనంగానీ, ఆత్మన్యూనతగానీ ఏమీలేదు''

రవిశర్మ దీర్ఘోపన్యాసం అవధూత మనస్సు అంగీకరించలేకపోయింది. అందులో ఎంత నిజం ఉందో తరచిచూడాలన్న ఉద్దేశం అతడికి లేదు. మనుష్యుల్ని చంపడం అవధూతకు బ్రహ్మవిద్యకాదు. తన మీదకు దాడిచేసినవారినో, తన ప్రాణరక్షణకు, తన అవసరాలకూ, ఆవేశంతో, పగతో కొన్నిచేశాడు.

కాని, ఇంతటి దారుణం తానుగా చేయడంగానీ, చేస్తుంటే చూడడంగానీ జరగలేదు. నరబలులకు సంబంధించి పిల్లల్ని ఇక్కడినుండే తీసుకెళ్ళినా, తాను కళ్లారా ఏ ఒక్కటీ చూడలేదు. వీరికి కూడా తన చేతుల్తో స్వయంగా పిల్లల్ని అమ్మాడుగానీ, ఇంతవరకూ ఈ విధంగా చేయడం కళ్లారా చూడలేదు. అందుకే అతడు అంతగా చలించాడు.

చిలుం గొట్టానికి గంజాయి ఎక్కించి, వెలిగించి పొగ పీల్చాడు. ఈ ఆత్మన్యూనతా బాధలో అంతకంటే మంచిది అతనికి కనిపించలేదు. గంజాయి దమ్ముతో నిర్వికారవస్థకు వచ్చాడు. రవిశర్మ, బహదూర్ ఒకరి ముఖం ఒకరు చూసుకుని లేచారు.

''మేం వెళ్తాం స్వామీజీ! అక్కడికి ఎవరినీ వెళ్లనివ్వకండి. వారు స్పృహలోకి వచ్చిన తరువాత ఏంచేయాలో మా మనుషులు చూసుకుంటారు. వారికి కావలసిన సౌకర్యాలు అందించండి చాలు'' అన్నాడు రవిశర్మ.

పడక గదిలో గంట మోగడంతో అవధూతల లేచి వెళ్తూ ''మళ్ళీ వస్తాను'' అన్నాడు. లోపలకు వెళ్తూనే ''మీరు భోజనం ఏర్పాట్లు చేయమన్నారు కదా; చేశాను. వారు వెళ్తామంటుంటే మీరు పలుకరేమిటి?'' అంది భామ.

ఆమెవైపు గుర్రుగా చూశాడు అవధూత. ''సరే... వడ్డించే ఏర్పాటు చెయ్యి'' అనిచెప్పి హాలులోకి వచ్చాడు. ''మీకు భోజన ఏర్పాట్లు ఇక్కడే చేశారు. భోజనం ముగించుకుని వెళ్లుదురుగానీ'' అన్నాడు. ఇద్దరూ తిరిగి కుర్చీల్లో కూర్చున్నారు.

''ఒక చిన్న విషయం అడుగుతాను. ఇది వ్యాపార రహస్యమే అనుకోండి. ఇష్టమైతేనే చెప్పవచ్చు'' అన్నాడు అవధూత.

''అడగండి, మీకూ మాకూ మధ్య సత్సంబంధాలు అవసరం'' అన్నాడు రవిశర్మ చిరునవ్వుతో. ముందు అతడి భయం తొలగిస్తేగానీ భవిష్యత్తులో మరోసారి తమతో సహకరించలేడని వారి ఉద్దేశం!

''ఒక్కొక్కడికి. పదివేల రూపాయలు పోసి కొంటున్నారు గదా! వీరిమీద ఆ డబ్బును ఏ విధంగా సంపాదించగలరు?'' గడ్డం దువ్వుతూ అడిగాడు అవధూత.

రవిశర్మ బహదూర్‌వైపు చూశాడు.

బహదూర్ అవధూతవైపు చూశాడు.

''వీళ్లను మేము ఎందుకు కొంటున్నామో మీరు ఒక్కసారి కూడా ఆలోచించలేదా?''

''ఆలోచించాం! మేము ఆలోచించింది ఎక్కడికైనా నరబలి కొరకు తీసుకెళ్తున్నారేమోననుకున్నాం. ఎందుకంటే కోట్లకొలదీ ఉన్న ఏ నిధుల కొరకో, లేక తమ వ్యాపారాలు బ్రహ్మాండంగా అభివృద్ధి చెందడానికిగాను క్షుద్ర దేవతల సంతృప్తికి ఇటువంటి నరబలులు ఇస్తుంటారు. ఇంత డబ్బు పెట్టి వ్యయప్రయాసలు భరించి తీసుకెళ్తున్నప్పుడు, సరయిన పద్ధతిలో వినియోగించుకుంటారు గదా!''

''నిజమేకావచ్చు స్వామీజీ! ఇలా ఎందరికి నరబలి అవసరం! ఎన్ని ప్రాంతాలలో నిధులున్నాయో, ఆ నిధుల్ని ఎలా తీయాలో ఎంతమందికి తెలుసు? అసలు అనుమానం తప్ప నమ్మకంగా తెలియని ఆ నిధుల కొరకు అంత డబ్బు తగలేసి బలి ఇచ్చేయడమెందుకు? అలా కొందరు చేస్తుండవచ్చు. అయినా వారిని విమర్శించడం మా పనీ కాదు. వారినే కాదు, ఎవరినీ విమర్శించం! మా పని అలాంటిది కాదు. వికలాంగులను చేసి వారిని అడుక్కోవడంలో తర్ఫీదు చేసి భిక్షగాళ్లుగా, బెంగుళూరు వీధుల్లో సంపాదనపరులుగా చేయడం! ఆ విధంగా మాకు మంచి రాబడి ఉంటుంది. మేమే కాదు. ఎవడూ రాబడి లేని వ్యాపారం

చేయడు.

"ఈ అడుక్కోవడంలో ఒక్కోవ్యక్తి రోజుకు ఇరవై నుండి ముప్పయ్ రూపాయల వరకూ సులభంగా సంపాదించగలడు. మొత్తంమీద నెలకు వెయ్యి రూపాయలు ఒక వ్యక్తి అడుక్కోవడం ద్వారా సంపాదిస్తాడు. అందులో రెండు వందల రూపాయలు తిండికి, మరో వంద ఇతరత్రా- అంటే- మందులకు ఖర్చు అయినా మొత్తంమీద ఒక వ్యక్తి సంవత్సరానికి ఎనిమిదివేలు నికర సంపాదన! ఇతర భిక్షగాళ్ళు స్వతంత్రంగా బ్రతకడంవల్ల , దుర్వ్యసనాల వల్లా, వారిని నమ్ముకున్న ఇతరులవల్లా వారు డబ్బు మిగుల్చుకోలేకపోవచ్చు. కానీ, వీళ్ళు నిత్యం మా స్వాధీనంలో ఉండటంవల్ల మాకు ప్రతిసంవత్సరం ఎనిమిదివేలకు తగ్గకుండా మిగుల్తాయి. ఒక్కొక్కపుడు సగటున యాభై సంవత్సరాలు బ్రతికినా, నలభై సంవత్సరాలు వారిద్వారా మాకు రాబడి ఉంటుంది. జీవితకాలంలో దాదాపు మూడులక్షల రూపాయలు ఆ వ్యక్తి ద్వారా సంపాదించే అవకాశం ఉన్నప్పుడు పదివేల రూపాయలు పెట్టుబడి పెట్టడానికి ఎవరూ వెనుతీయరు.

ఆశ్చర్యంగా వింటున్నాడు అవధూత! అతడి మనస్సు పరిపరివిధాలుగా ఆలోచిస్తున్నది. ఇప్పుడు అతనికి పాపభీతి, భయం పోయాయి. ఈ సంపాదన విషయం బాబా ఎందుకు తెలుసుకోలేకపోయాడోనని ఆశ్చర్యపోతున్నాడు. బాబాకు ఈ విషయం తెలిస్తే ఎవరికో అమ్మడంమాని స్వయంగా వీరిలాగే ఒక కేంద్రం ఏర్పాటుచేసి వ్యాపారం నిర్వహించేవాడే!

అవధూత మనస్సు పాదరసంలా ప్రాకుతున్నది. వీరికి పిల్లల్ని అమ్మడంకంటే ఎలాగూ తనకు వందలరూపాయలలోనే పిల్లలు దొరుకుతున్నారు గనుక, ఓ వందమందిని ఇలా తయారుచేసి, జీవితాంతం కూర్చుని తినడమే కాదు. కోట్లు, కోట్లు సంపాదించవచ్చు. ఇప్పుడున్న పద్ధతిలో దినదినగండంగా బ్రతకడంకంటే, 'అమ్మ' మోకాలిక్రిందనో బాబా మోచేతిక్రిందనో పడి, వారిని సంతృప్తి పరుస్తూ, చెప్పింది చేస్తూ నికృష్టంగా ఉండటంకంటే, తానే ఇక్కడినుండి ఏ బొంబాయో పారిపోయి ఈ వ్యాపారం మొదలుపెడితే బాగుంటుందని ఆలోచిస్తున్నాడు.

ఎలాగూ బాబా పట్టునుండి తప్పించుకోవాలనుకుంటున్నాడు. ఇక్కడి సొమ్ము కొంతయినా తీసుకోగలిగితే పెట్టుబడి పెట్టవచ్చు. భామలాంటి వారిని తోడు చేసుకుంటే వ్యాపారం నిర్విఘ్నంగా జరపవచ్చు. అతడి ఆలోచనను భగ్నంచేస్తూ బజర్ మ్రోగడంతో లేచి 'పదండి' అన్నాడు.

ముగ్గురూ డైనింగ్‌రూంలో అడుగుపెట్టారు. భామ వడ్డనకు మురిసిపోతూ రవిశర్మ, బహదూర్ సంతృప్తిగా భోజనం చేశారు.

వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత అవధూత పడకగదిలోకి వచ్చి 'నోట్లకట్టలు ఏవీ?' అన్నాడు.

పరుపుకింద పెట్టిన కట్టలు తీసి పైనవేసింది. వాటిని తిరిగి లెక్క పెట్టుకుని గోడకున్న అల్మారాలో త్రోశాడు.

భామవైపు చూసి కన్నుగీటి నవ్వుతూ, "నీకు త్వరలోనే విముక్తి ప్రసాదిస్తాను, వెళ్ళి హాయిగా బ్రతుకగలవా?" అన్నాడు.

భామ ఆశ్చర్యంగా చూసింది. తేరుకుని తన ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చి అలవోకగా నవ్వింది. "నాకు విముక్తి కలిగినా నేను తమ పాదాలు సేవిస్తూ కాలం గడుపుతాను స్వామీజీ! నాకు జీవితాంతం మీరు కావాలి. అంతకుమించి ఇంకేమీ కోరను" అంది.

ఆమె బుగ్గగిల్లి "చాలా తెలివిగలదానివి" అన్నాడు.

"నాకు తెలివితేటలున్నాయని భ్రమించడంలేదు. ఒకవేళ ఉన్నా అవికూడా మీ సేవకొరకే వినియోగించి తరిస్తాను. నాకు ఇంకే భ్రమలూ ఆశలూలేవు. మీ సాన్నిధ్యంలో మిగిలిన శేషజీవితం గడిచిపోవాలని కోరుకుంటున్నాను"

ఆమె మాటలు పూర్తికాకముందే తమకంతో ఆమెను కౌగలించుకుని మంచంమీదకు చేరాడు.

అవధూత పారిపోవడానికి సిద్ధపడుతున్నా

డనీ, బాబాకు పంగనామాలు పెట్టి ఆస్తి చేజిక్కించుకుని వెళ్ళిపోతాడనీ భామ ఊహించుకోగలిగింది. తనమీదా, తన శరీరంమీద వ్యామోహం వల్లా తననూ తీసుకెళ్ళడానికి ఆలోచిస్తున్నాడని గమనించింది. తాను





అవధూత దయవల్ల బయటపడగలిగితే ఆ తర్వాత ఇంత నిర్బంధం ఉండకపోవచ్చు. తన వ్యామోహంలో బాబా 'అమ్మకు' అధికారం ఇచ్చినట్లు తనకూ అధికారం ఇవ్వవచ్చు. లేదా తాను ఈ రహస్యాలు బయటపెడితే అవధూత నాశనమవుతాడు. అందువల్లయినా తన్ను బాగా చూసుకోగలడు. సమయం చూసుకొని చేతికి దొరికినంత లాక్కొని, అవధూతకు మస్కా కొట్టి తాను పారిపోవచ్చు. అప్పుడు ఈ బాబా పీడ, ఆ తర్వాత అవధూత పీడ, ఏదీ ఉండదు. కొంత మొత్తం చేతిలో ఉంటే ఈ. బాధలు తొలగిపోయి సరిఅయిన జోడు చూసుకుని హాయిగా జీవితం గడపవచ్చు.

అవధూత, భామ ఎవరి ఆలోచనలు వారు చేస్తున్నారు.

తాను బయటకుపోతే తనకు నమ్మకమైన వ్యక్తి కావాలిగనుక భామను దువ్వుకోవడం మినహా అవధూతకు గత్యంతరంలేదు. పైగా మంచి రక్షణకూడా!

టెలిఫోన్ మ్రోగడంతో లేచి అవధూత రిసీవర్ చెవిదగ్గరకు తీసుకున్నాడు. అటునుండి బాబా కంఠం ఖంగున మ్రోగుతున్నది.

"బెంగుళూరు వాళ్ళు డబ్బు ఇచ్చారా?"

"ఆ ఇచ్చారు బాబాజీ! మొత్తం మూడులక్షలు"

"వెంటనే ఇక్కడకు తీసుకురా! ఆలస్యం చేయవద్దు"

రిసీవర్ క్రిందపడేసి విసుగ్గా అల్మారావద్దకు వచ్చాడు. పేర్చిన కట్టల్ని మంచంపై పడవేసి, ప్రక్కనున్న సూట్‌కేస్ తెరచి అందులో పెట్టాడు. అస్తవ్యస్తంగా పండుకున్న భామవైపు చూశాడు.

"ఎక్కడికి వెళ్తున్నారు స్వామీజీ!" అంది భామ లేచి కూర్చుంటూ.

"బాబాగారు వెంటనే డబ్బు తీసుకురమ్మన్నారు"

భామ లేచివచ్చి అవధూత చెయ్యి పట్టుకుంది "స్వామీజీ! ఈ డబ్బు బాబాకు ఇవ్వకుండా మనం తీసుకొని ఇక్కడినుండి వెళ్ళిపోదాం! బాబాకు అందనంత దూరం పారిపోతే ఆయనేం చేయగలడు?"

అవధూత అట్టహాసంగా నవ్వాడు, "భామా! ఇదెంత! మనం పోదలచుకుంటే ఇంతకు వందరెట్లు డబ్బు బంగారం ఉంది. దాన్నిగురించి నువ్వు ఆలోచించకు. అతగాడు తెమ్మన్న తర్వాత తీసుకుపోకపోతే సమస్యలే! అదునుచూసి పోవడానికి అన్ని ప్రయత్నాలూ తర్వాత చేద్దాం" అంటూ సూట్‌కేస్‌తో బయటకు నడిచాడు.



నరసింహారావు కారులో బాబామందిరం వద్దకు వచ్చాడు. అతడి ముఖం ఆందోళనగా ఉంది. మందిరం తలుపువద్దకు వచ్చి బజర్ నొక్కాడు. లోపలనుండి ఒకస్త్రీ బయటకు చూసి, తిరిగి లోనకు వెళ్ళింది. మరికొద్ది సేపటిలో బయటకు వచ్చి, "బాబాగారు ధ్యానంలో ఉన్నారు. అందువల్ల అనుమతి తీసుకుని వద్దామని వెళ్ళాను, రండిలోపలకు" అంది. ఆమెవెంట లోపలకు నడిచాడు.

పరుపుమీద పరచిన ముఖమల్ గుడ్డపై కాళ్ళు చాపి పండుకున్నాడు బాబా! దిండు మీద తల చేరవేసి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. రావు సాష్టాంగపడి బాబా పాదాలకు తన తల తాకించి లేచి నిల్చున్నాడు. కూర్చోమని సైగచేశాడు బాబా!

"బాబాజీ! నా గొంతుకు ఉరి బిగుసుకుంటున్నది. దీన్ని తప్పించే మార్గం చూపండి" అన్నాడు బాధగా. నరసింహారావు మాటలకు నిటారుగా కూర్చున్నాడు బాబా!

"నువ్వు అనవసరమైన పనులు చేసి ఇరుక్కున్నావు" అన్నాడు బాబా తీక్షణంగా ఆయన కన్నులు నరసింహారావు ముఖంమీదే కేంద్రీకరించబడి ఉన్నాయి.

రావు తలవంచుకున్నాడు. "నిజమే బాబాజీ! వాడిని వదలించుకోలేక ఇంటికి తీసుకునివెళ్ళాను. అలాకాకుండా నిర్లక్ష్యంగా త్రోసివేస్తే సరిపోయేది. అలా చేయలేకపోయినందుకు ఇప్పుడు అనుభవిస్తున్నాను. నరబలి ఇస్తే నిధి దొరుకుతుందని అంతకుముందే చాలాసార్లు వాడితో అని ఉన్నాను. నిషాలో దిక్కు తెలియక నిధికొరకు హోమం చేస్తున్నానని నోరుజారాను. తర్వాత వాడిని రానివ్వకుంటే అంతా బయటపెడతాడన్న భయంకొద్దీ ఇంటికి తెచ్చాను. పిరికిపంద, భ్రష్టుపట్టించాడు"

"ఇంతవరకూ వాడు చేసింది ఏమీలేదు. వాడు స్పృహలోకి వస్తేనే నీకు బాధ కలిగించే సంఘటనలు జరుగుతాయి. అందువల్ల వాడు స్పృహలోకి రాకుండానే చేయాలి"

"ఏం చేయమంటారో చెప్పండి స్వామీజీ! తప్పకుండా చేస్తాను"

"హాస్పిటల్‌కు వెళ్ళి వాడిని హతమార్చడంకంటే గత్యంతరం లేదు"

వణికిపోయాడు నరసింహారావు. "ఆ పని

నేను చేయలేను స్వామీ! నిన్ననే నరబలి చూచి నా గుండె వణికిపోయింది. ఇక చేత కత్తిపట్టి ఆ పని చేయలేను"

"పోనీ, నీ తరపున ఎవరితోనయినా చేయించు. లేకుంటే ఇందులో నుండి తప్పుకోవడం కష్టమని నీకూ తెలును. నీ ప్రాణంకంటే వాడి ప్రాణం ఎక్కువకాదు గదా!"

నరసింహారావు మాట్లాడలేదు. తలవంచుకుని కూర్చున్నాడు.

బాబా కొంతసేపు ఆలోచించి, "పోనీ, కొంత డబ్బు ఖర్చుపెట్టుకోగలవా? మరొకరికి ఆ పని అప్పగిద్దాం!" అన్నాడు.

నరసింహారావు తల ఊపాడు. బాబా ఫోన్ అందుకున్నాడు. ఎవరినో రమ్మని చెప్పి కింద పెట్టాడు.

చాలాసేపు ఎవరూ మాట్లాడకపోవడంతో ఆ హాలులో నిశ్శబ్దం తాండవించింది. పావుగంట తర్వాత అడుగుల చప్పుడు కావడంతో తలెత్తి చూశాడు రావు. వస్తున్న వ్యక్తిని హాస్పిటల్ సూపరింటెండెంట్‌గా గుర్తించాడు. ఆయన అక్కడకు ఎందుకు వస్తున్నాడో తెలియక బాబావైపు తల త్రిప్పిచూశాడు. బాబా కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాడు.

సూపరింటెండెంట్ బాబా పాదాల దగ్గరకు వచ్చి, అతని పాదాలు చేతులతో తాకి కళ్ళకద్దుకున్నాడు. బాబా కళ్ళు తెరచిచూసి, కూర్చోమని సైగచేశాడు. సూపరింటెండెంట్ పాలరాళ్ళమీద కూర్చుంటూ "బాబాజీ! విశేషాలు ఏమున్నాయో శలవివ్వండి!" అన్నాడు.

బాబా మందహాసం చేసి ఒత్తిగిలపడ్డాడు. గడ్డం సవరించుకుంటూ కొంతసేపు ఆలోచించాడు.

"మీ హాస్పిటల్‌లో ఒక మెంటల్ పేషెంట్ ఈరోజు చేర్చబడ్డాడు. అతడు చాలా ప్రమాదకరమైన వ్యక్తి. అతడు ఈ లోకంలో నివసించడానికి యోగ్యుడుకాడు. నెమ్మదిగా మాటలు వదిలాడు ప్రశాంతవదనంతో. సూపరింటెండెంట్ ఆలోచిస్తూ కొంతసేపు కూర్చుని, "పంచాయితీ గుమాస్తాని గురించి మీరు మాట్లాడుతున్నారా?" అన్నాడు.

బాబా తల ఊపాడు.

"అతడి కేసు ఒక డాక్టరు చూస్తున్నాడు. ఆ డాక్టరు అనుమతిలేకుండా, ఆ పేషెంటుకు ఎలాంటి ట్రీట్‌మెంట్ మరొకరు ఇవ్వకూడదనేది హాస్పిటల్ రూల్సు. ఆ నిబంధనల ప్రకారమే డాక్టర్లు సర్వీసుచేస్తారు. అతడికి మరోరకమైన ఇంజక్షన్ ఇవ్వమని నేను చెప్పినా, ఆ డాక్టర్ గ్రహించగలుగుతాడు గదా!"

"నువ్వు చెప్పేది నిజమే! కాని ఆ విషయాలతో నాకు పనిలేదు. వాడిని అంత మొందించాలని నేను ఆదేశిస్తున్నాను. ఏవిధంగా చేయడమన్నది నువ్వు ఆలోచించుకో! ఆ అవసరాన్ని బట్టి నువ్వు ప్రవర్తించాల్సిందే! అవి నేను చెప్పవలసిన సంగతులు కావు"

సూపరింటెండెంట్ పలుకలేదు. తిరిగి బాబా అన్నాడు, "డబ్బు ఆశ చూపించు. దానికి లొంగనివాడెవడు? ఒక లక్ష లేదా రెండులక్షలు. కుక్కలాగా వాడే కాళ్ళవెంట తిరుగుతాడు. నీవు చేయమన్న పని విశ్వాసంతో వాడే చేస్తాడు"

"ఆ డబ్బుతో ఆ మెంటల్‌వాడి నోరే మూయించవచ్చు కదా!"

"నిజమే! కాని, వాడికి ఎంత డబ్బు అందించి మూయించదలచినా సాధ్యంకాని పని! ఎందుకంటావా? వాడు పోలీసు కస్టడీలో ఉన్నాడు. వాడు సంధిప్రేలాపనలు పలికినవుడే వాడికి అంతా తెలునునని పోలీసులు నమ్మారు. మెంటల్‌నుండి సాధారణస్థితికి వచ్చిన తరువాత వాడి శరీరం పిండిఅయినా రహస్యంగా లాగడానికి ప్రయత్నిస్తారు. వాడు లొంగిపోయి చెప్పకతప్పదు. అందువల్ల ఇటు నుండే మార్గం చూడాలి"

"ప్రయత్నిస్తాను" అన్నాడు సూపరింటెండెంట్ చివరకు. అతడి ఆమాట కొరకే కాచుకు నిలబడ్డ జానకమ్మ ముందుకువచ్చి బ్యాగ్ అతడిముందు పెట్టింది.

"ఇదేమిటి అమ్మగారూ?" అన్నాడు సూపరింటెండెంట్ చిరునవ్వు నవ్వి.

"ఇందులో రెండులక్షల రూపాయలున్నాయి. ఏ విధంగా ఖర్చుపెట్టినా సరే... బాబాగారి ఆదేశం నెరవేర్చాలి" అంది జానకమ్మ.

సూపరింటెండెంట్ పలుకలేదు. లేచి "శల విప్పించండి బాబాజీ!" అన్నాడు చేతులు ముకుళించి. బాబా సైగ చేశాడు. బ్యాగ్ చేతికి తీసుకుని బయటకు నడిచాడు. వెళ్ళిపోతున్న అతన్ని చూస్తున్నాడు నరశింహారావు.

"నీ కొరకు ఎంత ఖర్చు పెట్టవలసి వచ్చిందో చూస్తున్నావా నరసింహారావూ" బాబా మాటలతో ఆలోచనలనుండి తేరుకుని చూస్తున్నాను బాబాజీ! నామీద తమకున్న కరుణకూ, దయకూ నా చర్మం వలిచి చెప్పులు కుట్టించి ఇవ్వగలను'' అన్నాడు భక్తిభావంతో.

బాబా చిరునవ్వు నవ్వాడు. "నువ్వు చేయవలసిన పని అదికాదు. నీకు ఇంత సహాయం మేము చేయడానికి కారణం ఏమిటో నీకు తెలుసా? నీ ఆచరణ, నీ వినయవిధేతలు నాకు నచ్చాయి. నాకు తగిన శిష్యుడివి నువ్వేనని నిర్ణయించుకున్నాను. నిన్ను అభివృద్ధిలోకి తీసుకుని రావాలని అనుకుంటున్నాను. ఈ ప్రయత్నంలో కొన్ని చీడపురుగులు అడ్డున్నాయి. వాటిని తొలగించి ఆ స్థానం నీకు అప్పగిస్తాను''

తనమీద బాబాగారికున్న అపారమైన దయ, నమ్మకానికి నరశింహారావు సంతోషించాడు కాని, తనకు ఆయన ఇవ్వదలచుకున్న స్థానమేమిటో తెలియక ఆలోచిస్తున్నాడు.

అతడి ఆలోచన అర్థమైనట్లు తలపంకించి బాబా అన్నాడు-

"అవధూత నన్ను మోసం చేశాడు. నామహత్తు వాడికి తెలియక నాకే ఎసరు పెడుతున్నాడు. వాడి స్థానంలో నిన్ను ఉంచడానికి నిర్ణయించుకున్నాను''

నరసింహారావు మరోసారి బాబాపాదాలు స్పృశించాడు. బాబా తర్వాత అత్యున్నతమైన అధికారపీఠం అవధూత నిర్వహిస్తున్నాడు. ఆ పదవి తనకు దొరికితే, తన ఇంటిలో దొరికే నిధికొరకు పడిగాపులు కాయవలసిన అవసరమే తనకు ఉండదు. భవిష్యత్‌లో ఒక వెలుగు వెలడగానికి అవకాశం ఉంటుంది.

"ఎల్లుండి మంచి ముహూర్తం; ఆస్థానాన్ని ఆ రోజు నీకు అప్పగిస్తాను"

"అవధూత ఎక్కడకు వెళ్తాడు స్వామీ?"

"వాడికి పరలోకంలో స్థానం ఇచ్చాను; అక్కడికే వెళతాడు"

"అతడు చేసిన తప్పేమిటో తెలుసుకోవచ్చా బాబాజీ?"

"నిరభ్యంతరంగా! రేపు ఆ స్థానంలోకి వెళ్తున్న నువ్వుకూడా వాడిలా తయారుకాకుండా జాగ్రత్తపడటానికయినా నువ్వు తెలుసుకోవాలి. ఈ మందిరానికి చెందిన చాలా ఆస్తిని వాడుకాజేశాడు. ఆ మోసం చేసినందుకు చివరి శిక్ష అదే మరి''

నరశింహారావు తల ఊపాడు.

"ఇక నువ్వు వెళ్ళు, ఎల్లుండి ఇక్కడకు రా! అధికారముద్ర అందచేస్తాను. అధికారం స్వీకరించిన తరువాత ఆ భవనం స్వాధీనపరుచుకుని అక్కడ ఉండవచ్చు.''

మరోసారి బాబాపాదాలు తాకి, నమస్కారం చేసి బయటకు వచ్చాడు.

బాబా ఫోనెత్తి అవధూతకు ఫోన్‌చేశాడు. వస్తున్నానని జవాబిచ్చాడు అవధూత. మరో పావుగంటకు అవధూత అక్కడకు వచ్చి పాదాలు తాకి నిలబడ్డాడు.

బాబా కూర్చోమని చెప్పలేదు. ఆగ్రహంగా చూసి "అవధూతా! నన్ను మోసం చేశావు" అన్నాడు. బాబా ముఖంలో అంత కోపం ఎన్నడూ చూడని అవధూత భయంతో "ఏం చేశాను బాబాజీ?'' అన్నాడు వినయంగా.

బాబా ఆగ్రహంగా అవధూత కళ్ళలోకి చూస్తూనే ఉన్నాడు.

"బొంబాయినుండి వచ్చిన వ్యక్తులు నీకు ఎంత బంగారం ఇచ్చారు?''

"అరవైకిలోలు ఇచ్చారు బాబాజీ?''

"పచ్చిమోసం అవధూతా! నీ మోసానికి ప్రాయశ్చిత్తం దేవుడు తప్పకుండా చూపిస్తాడు. అరవై కిలోలుకాదు; నీకు చేరింది ఎనభైకిలోలు;

"మీకెవరో నమ్మబలికి మోసం చేస్తున్నారు బాబాజీ? నాకిచ్చింది అరవై కిలోలు మాత్రమే'' అన్నాడు అవధూత నమ్మకంగా.

జానకమ్మ టేప్‌రికార్డ్ తెచ్చి అక్కడపెట్టి, అందులో కేసెట్ పెట్టి ఆన్ చేసింది. అవధూత ఎవరెవరితో ఏయే విధంగా మాట్లాడారో,

బాబాకు అసలుకంటే తక్కువగా ఎక్కడికక్కడ లెక్కలు చూపించాడో వివరంగా వినిపిస్తున్నది.

"భామా... నీకు విముక్తి కలిగిస్తాను; ఇక్కడి నుండి వెళ్ళిపో!"

"ఎక్కడికి వెళ్ళగలను స్వామీజీ! నేను యావజ్జీవితమూ తమ పాదాల వద్దసేవచేసుకుంటూ పడి ఉండగలను"

"ఎనభైకిలోలకు కిలోకు పదివేల చొప్పున డబ్బు అందిస్తాను. మీరు మాత్రం నాకోసహాయం చేయాలి. ఎవరడిగినా నాకు అందించిన బంగారం అరవై కిలోలేనని చెప్పాలి"

టేప్‌లో వినవస్తున్న మాటలు వింటున్న అవధూత నరాలు ఉడిగిపోయి చల్లబడుతున్నాయి. అతని శరీరంలో సన్నగా వణకు ఆరంభమయింది.

"ఇంకా బుకాయిస్తావా?" అన్నాడు ఆగ్రహంగా బాబా.

"నువ్వు మోసగాడివి. కుక్కను సింహాసనం మీద కూర్చో బెడితే ఇలాగే జరుగుతుంది. బజార్లో పిక్‌పాకెట్ చేసుకుని బతికే నిన్ను అందలం ఎక్కిస్తే మాత్రం పాత మోసాల అలవాటు విడిచిపెట్టలేదు"

అవధూతకు అంతకంటే ఎక్కువే కోపం వచ్చింది. 'ఇతగాడి రహస్యాలు ఎన్నో తాను దాచిపెట్టినందుకు ఇతగాడి ప్రత్యుపకారం ఇదా?' అనుకున్నాడు.

"పలుకవేం... నీ జవాబేమిటి?" మండిపడ్డాడు బాబా.

అవధూత మనస్సు కూడగట్టుకున్నాడు. ధైర్యంగా అన్నాడు "నిజమే... మీ సంపాదన మీరు చూసుకుంటున్నారు; నా సంపాదన నేను చూసుకుంటున్నాను".

"ఎవరి సంపాదన ఏమిటి? ఇది ప్రజల కొరకు వినియోగించేది! దైవ, ధర్మ కార్యాలకు వినియోగించేది. దీనిని మోసం చేయడం ద్వారా నువ్వు పాపం చేస్తున్నావు!"

"అందరం మోసగాళ్ళమే బాబాజీ! మిమ్మల్ని దైవ స్వరూపులుగా ప్రచారం చేసింది నేను, అందలం ఎక్కించింది నేను, నేనే లేకుంటే అసలు బాబా అనేవాడు ఎక్కడున్నాడు?" అన్నాడు అవహేళనగా అవధూత.

"నమ్మకద్రోహివి అవధూతా! పచ్చి మోసగాడివి! బాబా ఉప్పుతింటూ బాబానే తూలనాడుతున్నావంటే ఎంతటి విశ్వాసఘాతుకమో నీకు తెలియకపోవచ్చు. కాని నీ పాపం కట్టి కుడుపుతుంది. బాబా మహత్తులో నువ్వు భస్మమవుతావు" అంది జానకమ్మ మెటికలు విరుస్తూ.

"అసలు బాబాకు ఒక మహత్తు ఉండి ఏడిస్తేగా! బజారు జీవితం అనుభవించిన నువ్వు ఒక 'అమ్మ'గా తయారయ్యావు. దొంగతనాలు చేసి బతికే బషీర్‌గారు బాబాగా తయారయ్యారు. మెస్మరిజం నేర్చుకుని, జనానికి ఆ మెస్మరిజం చూపించి దేవుళ్ళుగా, మహత్తుగల బాబాలుగా చలామణి అయ్యే కొందరు కిరాతకాలు చేస్తున్నవారే. ఈ 'అమ్మ' ఒక పచ్చి వ్యభిచారిణి- తార్పుడు కత్తెయే! పరమ అమాయకులైన జనానికి 'నీ' అమ్మతనం- ఆయన బాబాతనం చూపించి మీ మహత్తులు వర్ణించుకోండి, పొగిడించుకోండి. మీ గుట్టంతా తెలిసిన నా దగ్గర కూడా మీ మహత్తులు, శక్తులు ఎందుకు చూపిస్తారు? ఇంతవరకూ జరిగిన అనేక నరబలులలోనూ, దొంగనోట్లలోనూ, దొంగబంగారం కొనడంలోనూ మీ ఇద్దరికీ అన్నివిధాలా సంబంధం ఉంది. కిలో బంగారం నాలుగు లక్షలు పెట్టి ఎవడు కొంటాడు? అవి దొంగ నోట్లు కావడంవల్లనేకదా! అలాగే క్షుద్ర వెధవలు పిల్లల్ని ఎత్తుకొచ్చి అప్పగిస్తే వారికిచ్చేవీ దొంగనోట్లేగదా! మనం ప్రతి పనికి ఉపయోగించేది దొంగనోట్లేగదా! మన బాబాగారికి దైవశక్తిగల బాబా అనికాదు పెట్టవలసిన పేరు... 'దొంగనోట్ల బాబా'గా పిలవాలి. ఇందులో అందరం భాగస్థులమే. ఈరోజు నా కళ్ళముందర అభం శుభం తెలియని అమాయకులైన ముప్పైమంది పిల్లల అవయవాలు అతిఘోరంగా తొలగించడం చూసినవాడు, వాడు మానవత్వం గలవాడయితే మనిషిగా ఎందుకు పుట్టానని వలవలా ఏడుస్తాడు. మనం ఏడవడం లేదు; ఎంత ఆదాయం వచ్చిందని లెక్కించుకుంటున్నాము. ఇక నరబలుల సంగతి సరేసరి! ఇదంతా డబ్బు కొరకే అందరం కలిసి చేశాం. ఇందులో

ఎవరి మహత్తూలేదు, మంత్రాలూ లేవు. తంత్రాలు మాత్రమే ఉపయోగించాం. అందుకే మీ మానాన మిమ్మల్ని విడిచిపెట్టి నా మానాన నేను బతకడానికి నాకు చేతనయినంత నేనూ మిగిలించుకుంటున్నాను. ఆ మిగిలించుకున్నదానితో ఇక వెళ్ళిపోదామనుకుంటున్నాను. ఇప్పటికే కావలసినంత మోసం, హత్యలు చేయడం జరిగింది. ఇక ఆ వృత్తినుండి బయటపడటానికే నా ప్రయత్నం'' అంటూ వెనుతిరిగాడు అవధూత వినురుగా.

జానకమ్మ, బాబా కొద్దిసేపు అతడి ఉపన్యాస ఒరవడిలో కొట్టుకుపోయి ఆలోచించే శక్తి కోల్పోయారు. అతడు బయటకు వెళ్ళిపోవడంతో ఇద్దరూ ఊపిరి పీల్చుకుని ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

“వీడు పారిపోకముందే తగిన బుద్ధిచెప్పాలి'' అంది జానకమ్మ.

బాబా ముఖం చిరునవ్వుతో వెలిగిపోయింది. టెలిఫోన్ రిసీవర్ చేతికి తీసుకున్నాడు. అవతలి వ్యక్తితో కొంతసేపు మాట్లాడి కిందపెట్టాడు.

“వాడి జీవితం అంతమొందించుకోడానికే మనతో తలపడ్డాడు'' అన్నాడు బాబా. జానకమ్మ అతడి దగ్గరగా వచ్చి పరుపుమీద కూర్చుంది అతడి ముఖంలోకి చూస్తూ.

బయటకు వచ్చిన అవధూత కారెక్కాడు. తన నివాసానికి వెళ్ళి దొరికింది తీసుకుని భామను వెంటపెట్టుకుపోవడానికి నిశ్చయించుకున్నాడు. భామను వదలకూడదు. మిగిలిన జీవితం భామతో గడపాలి. భామను బానినత్వం నుండి విడిపిస్తే అనేక రహస్యాలు బయటపడతాయి. బాబా సమస్య అటుంచి తాను కూడా అందువల్ల దెబ్బతినవలసివస్తుంది.

అతడి ఆలోచనల్లో ఎదురుగా వస్తున్న లారీని చూడలేదు. కారు నడుపుతున్న డ్రైవరు తమమీదకు వస్తున్న లారీని తప్పించి, ఒకవక్కగా పోవడానికి చేసిన ప్రయత్నం విఫలమయింది. లారీ వచ్చి కారును దారుణంగా గుద్దుకుంది. అంతపెద్ద లారీ దెబ్బకు కారు నజ్జునజ్జు అయింది. ఆలోచనలనుండి దృష్టి లారీ మీదకు తిప్పిన అవధూత లారీ తమమీదకు రావడం చూసి బాబా తన మీద ప్రతీకారం తీర్చుకోడానికే పంపాడనుకున్నాడు. కారు డ్రైవరు, కారులోని అవధూత నలిగిపోయి నిముషాలలో ప్రాణాలు విడిచారు.

★ ★ ★

నరసింహారావుకు అవధూత చనిపోవడం గురించి తెలిసింది. హుటాహుటిన బాబా వద్దకు వచ్చాడు. ఆ సమయానికి బాబా ముందు భక్తులు చాలామంది ఉన్నారు. వారికి వికాసం అంటే ఏమిటో, దేవుడంటే ఏమిటో, సృష్టికి మూలమేమిటో వివరిస్తున్నాడు బాబా. ఆయన పలుకులు శ్రవణానందకరంగా ఉన్నాయి. అందరితోపాటు రావు కూడా కూర్చుని విన్నాడు. సభ ముగిశాక ఎవరిదారినవాళ్ళు వెళ్తున్నారు. అందరూ కార్లలోనూ, మోటారు సైకిళ్ళ మీద వచ్చినవారే. అందరూ వెళ్ళిన తరువాత రావును చూసి బాబా చేతి సైగచేశాడు. దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు రావు.

“బాబాజీ... మన అవధూత మరణం పొందారని తెలిసివచ్చాను'' అన్నాడు ఆయన వైపే చూస్తూ.

బాబా ముఖం ప్రశాంతంగా ఉంది.

“నిజమే... నీకు మొన్ననే చెప్పాగా దుష్టులు శిక్షించబడతారని. వాడు మోసగాడు. మోసంతో ఈ మందిరంలోని ఆస్తిపాస్తుల్ని నాశనం చేయాలని కుతంత్రాలు పన్నాడు. ఆ కుతంత్రంలో తానే బలి అయ్యాడు''

రావు మాట్లాడలేదు. తిరిగి బాబాగారే అన్నారు.

“ఇంతవరకూ అవధూత నివశించిన భవనాన్ని నువ్వు స్వాధీనం చేసుకోవచ్చు. నా తరుపున అక్కడి పనులు నీవు సాగించవచ్చు.'' అంటు ఫైలును అతడి ముందుకు తోశాడు. ఆ ఫైలును తీసుకుని తెరచి చూశాడు రావు. తన పేర అధికారం దాఖలు చేస్తూ, ఆ భవనంలోని వ్యక్తులు తన ప్రియశిష్యుడి ఇష్టాఇష్టాలకు లోబడి నడుచుకోవాలని బాబా ఆదేశిస్తూ రాసిన ఉత్తరాలు, అధికార ముద్రలూ ఉన్నాయి. ఆ అధికారం స్వీకరించడానికి నరశింహారావు ఇప్పుడు భయపడుతున్నాడు.

రేపు తను డబ్బు దగ్గర కక్కుర్తి పడితే ఎల్లుండి తన గతీ ఇంతే కావచ్చు. అయినా తప్పదు. తన రహస్యాలు బాబాచేతిలో చాలా ఉన్నాయి. తాను అధికారం వద్దని వ్యతిరేకిస్తే ఇప్పుడే తన రహస్యాలు బయటపెట్టి, తనను కష్టాలపాలు చేయవచ్చు. అధికారుల్లో అతడికి చాలా పలుకుపడి ఉంది. కొంతకాలం అణగి ఉండటమే మేలనుకున్నాడు.

"మాతాజీ నీ వెంట వచ్చి అక్కడ అందరినీ పరిచయం చేస్తుంది"

కారులో జానకమ్మ, నరశింహారావు బయలుదేరారు. కారు భవనప్రాంగణంలో ప్రవేశిస్తూనే గేట్‌కీపర్లు, రక్షకులు పరుగెత్తుకుంటూ వచ్చి అమ్మ ఎదురుగా చేతులు కట్టుకుని నిలబడ్డారు. లోపలకు వెళ్తూ, అందరినీ లోపలకు రమ్మని ఆదేశించింది జానకమ్మ.

అందరూ లోపలకు వచ్చిన తరువాత– "ఇక ముందు ఇక్కడ బాబాగారి ప్రతినిధిగా, మీకు నాయకత్వం వహించి, కార్యక్రమాలు నిర్వహించునది ఇతడే! ఇతడి పేరు అగ్నిహోత్ర! అగ్నిహోత్రగారు మిమ్మల్నందర్నీ సంరక్షించడానికీ, విధులు నిర్వర్తింపచేయడానికీ, కాపాడటానికీ సిద్ధంగా ఉన్నారు".

అందరూ తలలూపారు. అగ్నిహోత్రగా మారిన నరశింహారావును చూస్తూ భామ తలుపువద్ద నిలబడి చూస్తున్నది. అవధూతది చావో, హత్యో ఆమెకు తెలియదు. అయినా ఆమెకు అనుమానమే! అతని ద్వారా తాను బయటపడగలనని ఆశించింది. ఆ ఆశ విఫలమయింది. ఈ రెండురోజులుగా ఏడుస్తూనే ఉంది.

రావును అండర్ గ్రౌండ్‌లోపలకు తీసుకెళ్ళింది జానకమ్మ! లోపల పడి ఉన్న పిల్లలనూ, వారి కట్లనూ చూచి అగ్నిహోత్ర గుండె ఘోషించింది. వారికి కాపలాగా ఉన్న నలుగురు వ్యక్తులను చూశాడు. లోపల ఇంత ఘోరాలు జరుగుతున్నాయని అతడికి తెలియదు. బాబా గొప్ప దైవిక శక్తి కలవాడుగా భ్రమించి, అతని ప్రాపు సంపాదించాలనుకున్నాడు. కాని క్రమక్రమంగా తెలుసుకుంటూ వస్తున్నది బాబాకు ఏ శక్తులూ లేవని! అయినా తన అవసరం కొరకు బాబాను నమ్ముతున్నట్లు నటిస్తూ మధ్యన కూరుకుపోయాడు. ఈ భవనంలోకి రావడం ద్వారా మరింత కూరుకుపోయానని భయపడుతున్నాడు.

భవనమంతా తిప్పి చూపి, అప్పగించవలసినవి అప్పగించింది అమ్మ!

భవనంలో చివరి గది వద్దకు వచ్చి తలుపు తట్టింది. అయిదునిమిషాల తర్వాత తలుపు తీశారు. లోపలకు వెళ్ళిన తరువాత జానకమ్మ అద్దంవైపు చూపించింది. "ఈ అద్దం ద్వారా బయట తలుపు తట్టుతున్నది ఎవరయినదీ తెలుస్తుంది. మన వ్యక్తులు కానిచో తలుపు తీయరు" అంది. అగ్నిహోత్ర తల ఊపాడు. లోపల రెండు మిషన్లు పనిచేస్తున్నాయి. వరుసగా అచ్చువేసిన నోట్లకట్టలు పేర్చి ఉన్నాయి. కాగితాలు చేతికి తీసుకుని చూశాడు. అవి దొంగనోట్లుగా గుర్తించడం కష్టం! మామూలు నోట్లకూ, ఆ నోట్లకూ తేడా ఏమీలేదు. అన్నీ కలిపితే ఏది మంచో, ఏది నకిలీదో తెలియదు. అన్నీ పదిరూపాయల నోట్లే. ఊపిరి పీల్చి వదిలాడు. జానకమ్మ దాన్ని గురించి వివరిస్తున్నది. ఎప్పుడు, ఏ విధంగా, ఎంత వాడుతున్నదీ చెప్పుకుంటూపోతున్నది.

బయట ఆఫీసు గదిలోకి వచ్చారు. అక్కడ చాలా ఫైల్స్ ఉన్నాయి. అవన్నీ తీసి అతడికి చూపించింది. అందులో పిల్లల్ని తెచ్చే దొంగ సన్యాసులు, బంగారం అమ్మకానికి తెచ్చేవారు, అనుచరులు, బయట నుండి సమాచారం సేకరించి అందించేవారి ఫొటోలు, వారిని గుర్తించే విధానాలు ఉన్నాయి.

మధ్యాహ్నం వరకూ అక్కడే ఉండి అన్నీ చూపించి ఆమె వెళ్ళింది. ఆమె వెళ్ళాక చాలాసేపు హాలులో కూర్చున్నాడు. అతని మెదడు ఇంకా పనివైపు మొగ్గుచూపలేదు. అవధూత రూపం కళ్ళకు కనిపిస్తున్నది. తాను ఇందులో అనవసరంగా ఇరుక్కున్నాన్నేమోనని ఆలోచిస్తున్నాడు.

భామ అతనిదగ్గరగా వచ్చి నిలబడింది. "మీకొరకు భోజనం తయారు చేశాను స్వామీజీ" అంది. ఆమెను కిందినుండి పైదాకా చూశాడు. మెరుపు తీగలాగా అతని కళ్ళకు కనిపించింది. చిరునవ్వుతో ఆమెవైపు చూచి "నే

ను స్వామీజీని కాను'' అన్నాడు.

''నాకు తెలియదు. ఇంతకు మునుపు ఉన్న వారిలాగే మిమ్మల్నీ పలుకరించాను. ఎలా పలుకరించమంటే అలా పలుకరిస్తాను, మీ దాసురాల్ని'' అంది.

ఆమె చెయ్యి పట్టుకుని లేచాడు. డైనింగ్ రూంలోనికి వెళ్ళి భోజనం చేశాడు. ఆలోగా పక్కగదిలో పక్క సర్దుతూనే అతనికి భోజనాదికాలు చూసింది. అతడు పడక గదిలోకి వస్తూనే ఆమె గడపవద్ద నిలిచింది.

''మీ కొరకు ఉదయమే రవిశర్మ వాళ్ళు వచ్చి వెళ్ళారు'' అంది అతనివైపు చూస్తూ చిరునవ్వుతో.

ఎందుకొరకన్నట్లు చూశాడు ఆమె వైపు.

''పిల్లలు ఇక్కడున్నారట! వారిని తీసుకెళ్ళాలట! ప్రస్తుతం ఇక్కడి బాధ్యతలు చూస్తున్నది ఎవరని అడిగారు. నాకు తెలియదని చెప్పాను. బాబాతో సంప్రదించాలని వెళ్ళారు''

''సరే... వచ్చిన తర్వాత మాట్లాడతాను. రా! అక్కడే నిలబడ్డావేం?''

ఆమె అతడి దగ్గరగా వచ్చింది. ఈ స్వామి, పాత స్వామిలాగా గడ్డాలు మీసాలతో అసహ్యకరంగా లేడు. నవనాగరికంగా ఉన్నాడు. వయస్సుకూడా చిన్నదే. తనకు తగినవాడు వచ్చాడని ఆనందంగా ఉంది. అనుభవంలో మొద్దుబారిన అవధూతలాంటివారిని రెచ్చగొట్టి, వారిని మాయచేసి తప్పించుకోవాలంటే చాలా కష్టం! యవ్వనంలో ఉన్న అగ్నిహోత్రను రెచ్చగొట్టి తప్పించుకుని పోవాలని ఆమె ఉబలాటపడుతున్నది ఇప్పుడు! 'అమ్మ చెప్పినట్లు ఈ వాతావరణానికి అతడు కొత్తవాడే అయితే, ఈ వాతావరణంలో చాలా రోజులుగా మసలుతున్న తాను అతడిని సులభంగా బోల్తా కొట్టించగలనని భావించింది.

అతడి కౌగిట్లోకి జారింది. వెచ్చగా ఉన్న అతడి కౌగిట్లో మత్తుగా కళ్ళు మూసుకుని, అతడి చేష్టలకు మురిసిపోతూ మహదానందంతో ఉంది.

తలుపుదగ్గర బజర్ మోగింది. భామ మనస్సు ముడుచుకుపోయింది. తింటున్న అమృతం చేజారిపోయినట్లయింది. ఆమె వీపునిమిరి లేచి హాలులోకి వచ్చాడు అగ్నిహోత్ర! రవిశర్మ, బహదూర్ లోపలకు వచ్చారు. బాబా దగ్గరనుండి తెచ్చిన ఉత్తరం చూపించారు.

''సంతోషం! ఈరోజే వెళ్తారా?'' అన్నాడు వారితోపాటు కూర్చుంటూ.

''తప్పదండీ! మా పని పూర్తయింది. మరో రెండునెలల్లో తిరిగి వస్తాం. ఆలోగా సరుకు మాకు ఎంతకావలసిందీ తెలుపుతాము'' అన్నాడు రవిశర్మ.

మరోగంట తర్వాత పిల్లలతో నింపుకుని వ్యాను వెళ్ళిపోయింది. సింహద్వారం మూత పడింది. అగ్నిహోత్ర పడకగది చేరుకున్నాడు. ఆలోచిస్తూ పడుకున్నాడు. ఎప్పుడు నిద్ర పట్టిందో ఏమో భామ పిలుస్తుంటే కళ్లు తెరచి చూశాడు.

''బాగా నిద్రపోయారు. ఇలా అయితే ఇక్కడి కార్యాలు మీరు నిర్వహించలేరు'' అంది కిలాకిలా నవ్వుతూ. ఆమె నవ్వుకు అతడి మనస్సు పరవశించిపోయింది.

''ఇక్కడ నగటున ప్రతి ఐదునిముషాలకూ ఎవరో ఒకరు వస్తూ పోతూఉంటారు. ఒక్కోసారి అయితే బయట ఎందరో వేచిఉంటారు. ఈమధ్యలో బాబాగారినుండి ఆదేశాలు ఫోను ద్వారా వస్తుంటాయి. ఈ విధంగా నిద్రపోతే బాబాగారు త్వరలోనే ఇంటికి పంపిస్తారు. నిద్రపోతూ కూడా మేల్కొన్నట్లు ఉంటేగానీ పనులు సాగవు''

ఆమె హితబోధలు వింటూ లేచి వెళ్ళి స్నానం చేశాడు. భామ తెచ్చిఇచ్చిన ఫలహారం తిని, కాఫీ తాగి, అర్ధనగ్నంగా ఉన్న భామను ముద్దుపెట్టుకుని, ఆమెను ఆ వాతావరణంలో వదిలిరావడానికి ఇష్టంలేకున్నా వచ్చి హాలులో కూర్చున్నాడు.

హాలు తలుపు తెరవబడింది. బయట ఉన్న వారిపేర్ల లిస్టు గేటుకీపర్ తెచ్చి ఇచ్చాడు. వారి పేర్లు చూచి మొదటి వ్యక్తిని రమ్మన్నాడు. అతడు లోపలకు వచ్చి ''నమస్తే స్వామీజీ! నా పేరు స్వరాజ్! ఇన్స్పెక్టరును-పోలీసు ఇన్స్పెక్టరును'' అన్నాడు.

అగ్నిహోత్ర కళ్లెగరేసి కూర్చోమన్నాడు.

''నేను మిమ్మల్ని ఇంతకు

ముందే ఎన్నోసార్లు క్లబ్బుల్లో చూశాను. నా పేరు నరశింహారావు" అన్నాడు. స్వరాజ్ కూడా ఆశ్చర్యంగా అతనివైపు చూసి "మీరు బాబాకు బాగా తెలుసా?" అని అడిగాడు. తలఊపాడు అగ్నిహోత్ర!

"ఈ పీఠంమీద అధికారం నాకు దఖలువరచారు చెప్పండి, ఏమిటి విశేషాలు?" అన్నాడు.

స్వరాజ్ సర్దుకుని కూర్చున్నాడు. 'ఆ స్థానంలో ఎవరున్నా అతడికేమిటి? తాను తెలుసుకున్న సంగతులు ఆ స్థానంలో ఉన్న వ్యక్తికి చెప్పాలి. అదే తన బాధ్యత' అనుకున్నాడు.

"నరబలుల సమస్య మీద కేసు చాలా తీవ్రంగా ఉంది. ఎక్కడకక్కడ పోలీసులు తిరుగుతున్నారు. స్థానిక పోలీసుల మీద అనుమానం ఏర్పడటంతో ఇతర ప్రాంతాలకు చెందిన గూఢాచారులద్వారా విచారణ జరిపిస్తున్నారు. ఇదే సమయంలో స్వామీజీ మరణం కూడా జరగడంతో అది మామూలు యాక్సిడెంటుకాదనీ, దాని వెనుక చాలా రహస్యాలు ఉండవచ్చనీ అధికారులు అనుమానిస్తున్నారు. పూర్తిగా పరిశోధనలో నిమగ్నమై ఉన్నారు. అవసరానికని పోలీసు కుక్కల్ని కూడా తెచ్చిపెట్టారు. ఈసారి నరబలిలాంటిది జరిగితే వెంటనే కుక్కల్ని రంగంలో దింపుతారు. ఊళ్ళో ప్రతి మనిషినీ అనుమానంగానే చూస్తున్నారు. మీ జాగ్రత్తలో మీరుండటం ఎంతైనా మంచిది"

అగ్నిహోత్ర తల ఊపాడు. "మా జాగ్రత్తలో మేముంటాం! మా ప్రయత్నాలు అడ్డులేకుండా సాగిస్తాం" అన్నాడు.

ఆ మాటలకు స్వరాజ్ అతని ముఖంలోనికి చూశాడు. అవధూత అయితే ఇటువంటి విషయాల మీద ఎన్నడూ వ్యాఖ్యలు చేయడు. విన్న తర్వాత ప్రశాంతంగా ఉంటాడు. కొత్తగా వడంవల్ల ఆ విధంగా ప్రవర్తిస్తున్నాడని భావించాడు స్వరాజ్.

"మరి నేను వెళ్తాను" అన్నాడు స్వరాజ్. తనకు ఇవ్వబోయే డబ్బు కూడా అడిగి తీసుకోవాలనుకున్నాడు. తనకు ఏమిచ్చేది అతడికి తెలియకపోవచ్చు.

అతడి ఊహకు వ్యతిరేకంగా భామను పిలిచాడు అగ్నిహోత్ర. భామ ఎదురుగా నిలబడింది గడపవలోనే. "పదివేల రూపాయలు తీసుకురా!"

అతడి ఆజ్ఞ అవుతూనే భామ వెళ్లి నోట్లతోపాటు బ్యాగు కూడా తెచ్చి ఇచ్చింది. బ్యాగ్ అందుకున్న స్వరాజ్ కృతజ్ఞతగా తల ఊపి నమస్కారం చెప్పి వెళ్లాడు. అతడు బయటకు వెళ్ళిన తరువాత అగ్నిహోత్రవైపు తిరిగి అంది భామ-

"మీరు నన్ను పిలిచి డబ్బు అడుగకూడదు. అది తప్పు! డబ్బు అవసరమైతే చిన్నచీటీ రాసిగానీ, లేదా మీ అరచేతిలోగాని రాసుకుంటే పడకగదిలో ఉన్న నాకు కనిపిస్తుంది వెంటనే తెస్తాను"

తన తెలివిలేనితనంవల్ల తన బానిస సలహా పొందవలసిన పరిస్థితి ఏర్పడిందనుకున్నాడు. కొంతపరిచయాలు, పరిస్థితులు అర్ధమయ్యేవరకూ, ఆ భవనంలో ఇలాంటివి తప్పవని సరిపుచ్చుకున్నాడు.

భామ లోపలకు వెళ్లింది. ఆ తర్వాత మరో వ్యక్తి లోపలకు వచ్చి నిలబడి "నాపేరు నారాయణ స్వామీజీ" అన్నాడు.

కాషాయగుడ్డలలో ఉన్న ఆ వ్యక్తిని చూసి తల ఊపి కూర్చోమన్నాడు.

"అవధూతగారుండగా ఇద్దరు పిల్లల్ని తెమ్మని చెప్పారు. ప్రయత్నాలన్నీ చేసుకున్నాను. రేపు ఇక్కడికి పదిమైళ్ల దూరంలోని పల్లెకు కారు పంపాలి. వెంటనే ఆ ఇద్దరు పిల్లల్ని ఇక్కడకు చేరుస్తాను" అన్నాడు నారాయణ.

ఫైల్‌లో అతడి పేరు చూశాడు. ముందు కొంత డబ్బు తీసుకునే వ్యక్తి అతడు. అందువల్ల ""నీకు డబ్బు కావాలా?" అన్నాడు అగ్నిహోత్ర.

తలఊపాడు అతను కావాలని.

అగ్నిహోత్ర చీటీ రాయడంతోనే, భామ రెండువందల రూపాయలు తెచ్చి టేబుల్ పైన పెట్టింది. ఆ డబ్బు ఇస్తూనే నారాయణ వెళ్ళిపోయాడు.

మూడో వ్యక్తి లోపలకు వచ్చాడు. అతడు ఫుల్‌సూటులో ఉన్నాడు. అతడు

పరిచయపూర్వకంగా నవ్వి చెయ్యి ముందుకు చాచాడు. అతడితో కరచాలనం చేసి "కూర్చోండి" అన్నాడు నవ్వుతూ. అతడు కూర్చు న్నాడు.

"నా పేరు రఘునందన్! అవధూతకు బాగా పరిచయం. మా దగ్గర ఇప్పటికే చాలా బంగారం కొన్నారు. తిరిగి అందుకొరకే వచ్చాం. ఆయన మృతి చెందినట్లు తెలిసి చాలా విచారించాము"

అతడిని గతంలో భామ చూసింది గనుక భామ కూల్‌డ్రింక్స్‌తో అక్కడకు వచ్చింది. పరిచయపూర్వకంగా ఆమెవైపు చూసి నవ్వాడు. ఆమె తల తిప్పుకుని లోపలకు వెళ్లింది.

"జరిగేది జరిగిపోయింది. అవధూతగారు ఈ జన్మ విడిచి పరలోకం చేరారు. ఎంత బంగారం తెచ్చారు?"

"దాదాపు తొంభై కిలోలుంటుంది"

"ధర నిర్ణయాలయ్యాయా?"

రఘునందన్ కాగితం తీసి చూపించాడు. బాబా ముద్రతో ఉన్న ఆ కాగితం మీద కిలో నాలుగు లక్షల రూపాయలుగా రాయబడి ఉంది. ఆ కాగితం మీది రాతకు ఇక తిరుగులేదు.

అగ్నిహోత్ర సిగరెట్ ముట్టించాడు. రఘునందన్‌కు ఒకటి ఇచ్చాడు. సిగరెట్ తాగుతూ "సరుకు ఎక్కడుంది?" అన్నాడు.

"హొటల్ దగ్గర మరో కారులో ఉంచాము. మీరు వస్తే చూడవచ్చు."

"నేను రానవసరంలేదు. గతంలో మీరే ఇక్కడకు తెచ్చేవారు కదా! మీ మీద మాకు నమ్మకముంది. కారు ఇక్కడికి తీసుకువస్తే అన్ని సమస్యలు పరిష్కారం చేసుకుందాం."

రఘునందన్ అంగీకరించి లేచి వెళ్లాడు. మరో అరగంటకు కారువచ్చింది. కారును పోర్టికోలోకి తీసుకు రమ్మని అగ్నిహోత్ర బయటకు నడిచాడు. ప్రహరీ లోపల ఆవరణలో చాలా మంది వ్యక్తులున్నారు. పోర్టికోలోకి మరో వ్యక్తితో కలిసి వెళ్లాడు. వెంట వచ్చిన వ్యక్తి బంగారాన్ని పరీక్షించి, సరయినదేనని నిర్ధారించిన తర్వాత వాటిని తూకం వేయించి లోపలకు చేర్పించాడు.

"గతంలో బాబాగారు నిర్ణయించిన రేటు కంటే ఎక్కువ రేటు ఇచ్చారు. అందుకు ప్రతిఫలంగా మేము తూకం తగ్గించి రశీదు ఇచ్చేవాళ్లం. ఆ పద్ధతినే మీరు కొంటారేమో ఆలోచించండి."

అగ్నిహోత్ర నవ్వుతూనే ఆలోచించాడు. ఆ రహస్యం బయటపడితే అవధూత వెళ్ళిన స్థానానికే తనూ పోవలసివస్తుందనుకున్నాడు.

"అది నా పద్ధతికాదు. బాబాగారు ఏ ధర ఇస్తానన్నారో, అదే ధర సరుకు ఉన్నంత మేరకు ఇవ్వడం జరుగుతుంది" అంటూ లోపలకు వెళ్లాడు. పది నిముషాలలో నలుగురు మనుషులు సంచులు మోసుకుంటూ తెచ్చి కిందపోశారు. కట్టల్ని వరుసగా లెక్కపెట్టి తిరిగి సంచులకు పేర్చారు. బస్తాలన్నీ ఎత్తి కారులో పడవేశారు. లెక్కలు సరిచూసుకున్న వెంటనే అగ్నిహోత్రకు వీడ్కోలు చెప్పి వాళ్లు వెళ్లిపోయారు వచ్చినకారులోనే!

జీవితంలో ఎన్నడూ చూడని అంత బంగారం చూసేసరికి అగ్నిహోత్ర మనస్సు పరిపరివిధాల సాగింది. అంత బంగారం తన స్వాధీనంలో ఉంటే ఈ బాబా ఎంత? ఇతగాడి మహత్తు ఎంత? ఏ దేశం వెళ్లినా సుఖంగా బతకవచ్చు.

ఇదే ఆలోచనలతో అవధూత నాశనమయ్యాడని అతడికి తెలుసు. తెలిసినా ఆ కోరిక చావదు. అది సహజం.

భామ అతడి దగ్గరగా వచ్చింది. మిగిలిన వారు తనను చూసి భయం భయంగా దూరంగా ఉంటున్నారు. భామ నిర్భయంగా దగ్గరకు వచ్చి సలహాలిస్తున్నది. ఒక్కరోజుతోనే అతడికి చాలా సన్నిహితమయింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది భుజం మీద చెయ్యివేసి.

"నిన్ను గురించి, నీ అందం గురించే! ఇంతటి అందగత్తె ఇక్కడ బందీగా ఎందుకుందా? అని ఆలోచిస్తున్నాను"

"పోనీ! మీకు దమ్ముంటే ఈ బంధం తెంపండి. హాయిగా లోకం మీద విహరిస్తూ కాలం గడుపుతాను" కిలకిలా నవ్వింది భుజం

మీద గడ్డం రుద్దుతూ.

"కానీ నాకు దూరం అవుతావుగా! నాకు దూరమవుతే నేను భరించలేను"

"నిజంగానా! ఈ ఒక్కపూటకే ఇంతటి మమకారమా?" అంది కళ్ళు టపటపలాడిస్తూ.

"ఔను, నీ అందం అటువంటిది. మరి నువ్వు లేకుండా నేను బతకలేను. ఎల్లకాలం నా దగ్గర్లే నువ్వుండాలి."

"ఇంతగా నన్ను కోరే మీరు నన్ను ఈ భవనంలోనే బందీగా ఉంచి, మీరూ వడి ఉండటం ఎందుకు? బయటకు వెళ్ళి హాయిగా కాలం గడపవచ్చు గదా! దొరికింది దొరకపుచ్చుకుని వెళ్ళి హాయిగా కాలం గడుపుదాం!" అంది నవ్వుతూ.

అగ్నిహోత్ర చిరునవ్వు నవ్వాడు. అతడికే ఆ కోరిక ఉంది. దొరికింది దొరకపుచ్చుకుని పారిపోతే సరిపోతుంది. ఎలాగూ తాను పోలీసులకు దొరికితే ఉరిశిక్షపడుతుంది. భామతో పారిపోతే స్వేచ్ఛగా బతకవచ్చు.

"తప్పకుండా పోదాం! నీవు నాకు కావాలి. ఈ నీచమైన పనులు చేసి నేను జీవించలేను. దీనినుండి నాకూ, నీకూ విముక్తి కావాలి" అన్నాడు ఆమె నడుం చుట్టూ చేతులు వేసి. అతడి మెడ చుట్టూ చేతులు వేసి దగ్గరకు అదుముకుంది భామ. ఆమెకిప్పుడు ఆనందంగా ఉంది. ఇక్కడ నుండి అవధూత వెంటపారిపోయినా, తిరిగి బయట అతడి గుప్పిటి నుండి కూడా పారిపోయి, తనకు తగిన వాడి కొరకు వెదుక్కోవలసి వస్తుంది. ఇప్పుడలాకాదు. తనకు తగిన తోడు అగ్నిహోత్ర! తన అవసరాలకు ఉపయోగపడే వయస్సుగలవాడు. అతడూ విముక్తి కోరుకుంటున్నాడు. ఇందులో ఇమడలేకపోతున్నాడు. ఇద్దరం ఏకమైతే ఇకమిగిలిన జీవితం హాయిగా కాలం గడపవచ్చు.

అవధూత ఏ విధంగా దెబ్బతిన్నదీ అగ్నిహోత్రకు తెలియదు. పడకగదిలోనేకాదు, ఆ భవనం అంతటా ఆటోమేటిక్ టేప్‌రికార్డర్స్ అమర్చబడి ఉన్నాయనీ, అవన్నీ అందుకోడానికి ఆ భవనంలోనే ఒక వ్యక్తి తిరుగుతుంటాడనీ, బాబాకు ఎప్పటికప్పుడు సమాచారం అందిస్తాడనీ తెలియకనే, అవధూత తనే సర్వస్వం అన్నట్లు ప్రవర్తించి, భామతో పారిపోవడానికి నిశ్చయించుకోవడంతో మరణం పాలయ్యాడు. తిరిగి అగ్నిహోత్ర కూడా అదే పద్ధతి ఆలోచిస్తున్నాడు. ఆ గదిలో తామిద్దరే ఉన్నారన్న ధైర్యంతో, ఆమెతో పారిపోదామని ఆలోచిస్తూ మాట్లాడుతున్నాడు. తాము మాట్లాడే విషయాలు మరికొన్ని గంటల్లోనే బాబాకు ఆధారాలతో సహా చేరతాయని తెలిస్తే ఆ ఊసు ఎత్తేవాడేకాదు.



రఘునందన్ రెండు కార్లలో సంచులు వేసుకుని హోటల్‌కు వచ్చాడు. కార్లను పోర్టికోలలో వదిలి, తాళాలు వేశారు. అక్కడ ఇద్దర్ని కాపలాగా నియమించి, మిగిలిన నలుగురూ గదికి వచ్చారు. అంతకుముందే తెచ్చుకున్న బాటిల్స్ ఓపెన్ చేసి తాగడంలో మునిగిపోయారు.

బజర్ నొక్కి వెయిటర్‌ను పిలిచారు. రఘునందన్ అనేకసార్లు ఆ హోటల్‌కు వస్తూపోతూ ఉన్న కారణాన, అక్కడి వర్కర్స్ చాలామంది తెలిసినవారే! అతడి వెంట వచ్చే మిగిలినవారు మారుతున్నా రఘునందన్ మాత్రం తప్పకుండా ప్రతిసారీ రావలసిందే! గోల్డ్ స్మగ్లింగ్ నాయకునికి కుడి భుజం అతడు. అతనికి తెలిసిన వెయిటర్ వచ్చాడు. ఎదురుగా నిలబడి నమస్కరించాడు.

"ఈ రాత్రికి మేం వెళ్ళిపోవాలి. మాకు మంచి సరుకు కావాలి" అన్నాడు రఘు.

"ఈ పగలే కావాలాసార్! లేక సాయంత్రానికి తెప్పించమంటారా?"

"సాయంత్రం ఆరు గంటలనుంచే మా ప్రయాణం! అందువల్ల ఇప్పుడే కావాలి.

మంచి నరుకు మాత్రమే! దొక్కు తెస్తే దబ్బివ్వం!"

వెయిటర్ నవ్వాడు. "ఈ హోటల్ అధునా తనమైనదిసార్! ఇక్కడ ప్రతి ఒక్కటీ మంచి నరుకే! మీరే చూస్తారుగా!" అంటూ బయటికి వెళ్ళాడు.

మరో అరగంటకు ముగ్గురు స్త్రీలతో వెయిటర్ ప్రవేశించాడు.

తలఊపాడు రఘు లోపలకు రమ్మన్నట్లుగా! బాగా నిషాలో ఉన్నాడు. మిగిలిన ముగ్గురూ కూడా అదే స్థితిలో ఉన్నారు. వాళ్ళు లోపలకు వచ్చారు. పెద్ద అందగత్తెలు కాకున్నా శరీరసౌష్టవం బావుంది. ముఖ్యంగా వాళ్ళు కట్టిన దుస్తుల వలన మరికొంత అందం కనిపిస్తున్నది. కనిపించీ కనిపించకుండా పలుచని దుస్తుల్లో కనిపిస్తున్న అంగాలు మత్తులో ఉన్నవారికి మరింత మత్తు కలిగిస్తున్నాయి.

"నలుగురం ఉంటే ముగ్గుర్నే తెచ్చావేం?" అన్నాడు రఘు వెయిటర్‌వైపు చూస్తూ.

"ముగ్గురు మాత్రమే రిజర్వ్‌లో ఉన్నారు సార్! మరో అరగంట తర్వాత అయితే మరొకర్ని తీసుకురాగలను"

"వద్దులే!ముగ్గురుతోనే సర్దుకుంటాం"

వెయిటర్ వెళ్ళిపోయాడు.

రఘు తలుపులు వేస్తూ "డ్రింక్ హేబిట్స్ ఉందా?" అడిగాడు వారిని.

"మాకు అన్ని రకాల అలవాట్లు ఉంటాయండీ! కష్టమర్లను సంతృప్తిపరచడం మా విధి"

బాటిల్స్ ఓపెన్‌చేసి గ్లాసుల్లో పోసి వారికి అందించారు.

ఆడవాళ్ళు తాగుతుంటే వాళ్ల నడుం చుట్టూ చేతులువేసి వారిచేతుల్లో ఉన్న గ్లాసుల్ని ముద్దు పెట్టుకున్నాడు. వాళ్ళు నవ్వారు. వాళ్ల నవ్వుల్లో శృతి కలువుతూ "మనకు ఏదైనా ఒకటే" అన్నాడు.

ముగ్గురితో నలుగురు కాలం గడవడానికి నిర్ణయించుకున్నారు.

గంటన్నర తర్వాత క్రిందనుంచి ఫోన్ రావడంతో మత్తులో ఉన్న రఘు లేచి గుడ్డలు సర్దుకుని, ఫోన్ వద్దకు వెళ్ళి రిసీవర్ ఎత్తాడు. క్రింద కావలా ఉన్న వ్యక్తి మాట్లాడుతున్నాడు. కావలాకు మరొకరిని పంపమనీ, తాను రూంకి వస్తున్నాననీ చెప్పాడు. పైన రూంలో ఉన్న నలుగురూ ఖుషీచేస్తుంటారని క్రిందివాళ్ల అనుమానం! తాము అందరితో సమానమైన వ్యక్తులేతాము మాత్రం ఎందుకు ఎంజాయ్ చేయకూడదూ? బయటికి వచ్చినప్పుడే స్మగ్లింగ్ వర్గాలకు స్వేచ్ఛ, ఆనందం అనుభవించే అవకాశం ఏర్పడుతుంది. క్రింద కార్లకు కావలాకాస్తూ పడిఉండాలంటే అతనికి ఇష్టంగా లేదు.

రఘు కూడా అతను ఉద్దేశం గమనించినట్టు తానే క్రిందకు దిగి వస్తున్నానని చెప్పి, ఆడవారికి డబ్బులు ఇచ్చేసి పంపించాడు. రఘు స్నానంచేసి క్రిందికి దిగి వచ్చాడు. హాలులో కూర్చుని కిటికీ గుండా తమ కార్లు ఉన్న గ్యారేజి వైపు చూస్తున్న వ్యక్తి వద్దకు వచ్చి భుజం తట్టాడు.

"ఫోన్ చేసి మంచి నిద్రని పాడుచేశావు భాయ్!" అన్నాడు రఘునందన్.

అతడు తల త్రిప్పి చూసి "క్రింద కూర్చోవాలంటే ఏమీ తోచడంలేదు. రెండోవాడు గేటు వద్ద, నేనేమో హాల్లో పడిఉంటే మీరేమో గదుల్లో జల్సా జీవితం అనుభవిస్తున్నారు" అన్నాడు.

"జల్సా లేదూ, కుల్సా లేదూ! పైకి వెళ్ళి పడి నిద్రపోయారు. సరే! నువ్వు పైకెళ్ళు! నేనుంటాను!" అన్నాడు రఘు వాచీ చూసుకుంటూ.

"ఇంకేం వెళ్తాను. టైం కావచ్చింది గదా! ఆరుగంటలకు బయలుదేరాలి మరి" అంటూ లేచి నిలుచుని ప్యాంటు సరిచేసుకున్నాడు.

మిగిలిన ముగ్గురూ తూలుకుంటూ క్రిందకు దిగి వచ్చారు. మరో అరగంట అక్కడే కాలం గడిపి, గదులు ఖాళీచేసి గ్యారేజ్‌లో ఉన్న కార్లను బయటకుతెచ్చారు. ఒక్కో కారులో ముగ్గురు చొప్పున రెండు కార్లలో ఆరుగురు సర్దుకున్నారు. కార్ల వెనుకసీట్లలో డబ్బు సంచులు కట్టిపడేసి ఉన్నాయి.

కార్లు హోటల్‌గేటు దాటి మెయిన్ రోడ్డు మీదకు సాగాయి. సాయంత్రం పూట కావటంవల్ల జనరద్దీ విపరీతంగా ఉంది. అసలే అతిచిన్న టౌను. ఇరుకైన రోడ్లు, రోడ్లమీదకే ఉన్న బడ్డీలు, సినిమా హాల్స్, వాటి టికెట్ క్యూలు. వీటన్నింటినీ ఛేదించుకుంటూ రాకెట్లలా పరుగెత్తే వాహనాలు. వీటిమధ్య ఊగుతూ నడిచే జనం!

రెండు కార్లూ అంత రద్దీని అధిగమించి టౌను లిమిట్స్ దాటాయి. నడుపుతున్న ఇద్దరూ పూర్తి నిషాలోనే ఉన్నా మంచి అనుభవం గల వ్యక్తులు కావడంతో, అంత రద్దీలోనూ చాలా సులభంగా బయటపడ్డారు. బాగా చీకటిపడింది.

ఇరుకు వంతెన దాటడానికి స్పీడుగా వెళ్తున్న కారును, ఎదురుగా అంతకంటే స్పీడుగా వచ్చిన లారీ వంతెన మధ్యలో గుద్దేసింది. అసలే స్మగ్లింగ్! దానికితోడు విపరీతమైన వేగం! జరిగింది ప్రమాదం! ఆ ప్రమాదం సంగతటుంచి, కార్లు పరిశీలిస్తే తమ బ్రతుకులు వటాపంచలవుతాయి. అందరూ బయటపడిపోయారు. వెనుక కారు నుండి దిగివచ్చిన రఘునందన్ స్టీరింగ్ వీల్ గుద్దుకొని విలవిలలాడుతున్న డ్రైవర్‌ను చూశాడు. ఫ్రంట్ సీటులో ఉన్న మరొకడు చచ్చివున్నాడు. మూడోవాడికి బాగా గాయాలయ్యాయి. ముగ్గురూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ట్రాఫిక్ జాం అవుతున్నది. వాహనాలు ఎటూ పోవడానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది.

"ఏం చేద్దాం?" అన్నాడు రఘు మిగిలిన వారిని ఉద్దేశించి.

"వెంటనే బాబాగారికి ఈ విషయం తెల్పి సహకారం తీసుకోవాలి. మరోకారు తెచ్చి సంచులు మార్చుకోవాలి. పోలీసులు వచ్చేవరకూ ఉంటే ఇంత డబ్బెక్కడిదని ఆరా తీస్తారు" అన్నాడు ఒకరు. అది సమంజసమేనని పించింది మిగిలిన ఇద్దరికీ!

"మీరిద్దరూ ఇక్కడే ఉండండి. నేను టౌనులోనికి వెళ్ళి, స్వయంగాగానీ, ఫోన్‌చేసిగానీ వారి సహాయం తీసుకువస్తాను" అంటూ రఘు పట్టణంలోనికి కదిలాడు. మిగిలిన ఇద్దరూ అక్కడే బిక్కుబిక్కుమంటూ నిలబడ్డారు. లారీ డ్రైవర్, క్లీనర్ బండి విడిచి కాలిసత్తువకొద్దీ పరుగు లంకించుకున్నారు. వాళ్ళు పరుగెత్తుతున్నా వీళ్ళు నిశ్శబ్దంగా నిలబడ్డారు.

వాహనాలు క్రమక్రమంగా ఒకదానివెనుక ఒకటి నిలబడుతున్నాయి. నిలిచిపోయిన వాహనాల డ్రైవర్లు, క్లీనర్లు ప్రమాదం జరిగిన చోటుకు వస్తున్నారు. ట్రాఫిక్ బంద్ కావడంతో వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఎవరో తెలిపారు. పోలీసులు వ్యానులో వచ్చారు. యాక్సిడెంట్ అయిన చోటులో శవాలను రెండింటినీ బయటకు లాగారు. చివరి దశలో ఉన్న మూడో వ్యక్తిని కూడా ప్రక్కకులాగి హాస్పిటల్‌కు తరలించారు. పోలీసులు కారులో చూడగా సంచులు కనిపించాయి. అన్ని సంచులు కారులో ఎందుకు సరఫరా చేస్తున్నారో అన్న అనుమానంతో ఒక సంచికి ఉన్న రంధ్రాన్ని మరింత వెడల్పుచేసి చూశారు. కరెన్సీ నోట్లలాగా కనిపించడంతో ఇన్‌స్పెక్టర్‌కు ఆ విషయం చెప్పారు. ఇన్‌స్పెక్టర్ వచ్చి ఒక సంచి విప్పి చూశాడు. లోపల కట్టలన్నీ వరుసగా పేర్చిన కరెన్సీ ఉంది. ఇన్‌స్పెక్టర్ ఒక కట్ట తీసుకుని పరీక్షగా చూశాడు. అవి దొంగనోట్లుగా అతను అనుమానించలేకపోయాడు. అంత కరెన్సీ కారులో ఎందుకు తీసుకువెళ్తున్నారో, ఎక్కడికి తీసుకువెళ్తున్నారో అతనికి అర్థంకాలేదు. బయట ఉన్న ఇద్దరూ జనంలో కలిసిపోవడంతో రఘు టౌనుకు వెళ్ళిపోవడంతో చనిపోయిన ఇద్దరూ ప్రమాద స్థితిలో ఉన్న ఒక్కడూ తప్ప వారికి సమాచారం అందించేవారు ఎవడూ లేడు. నలిగిన కారులోని సంచులు, వెనుక కారులోని సంచుల్ని వ్యానులో వేయించాడు. నలిగిన లారీ, కారును పక్కకు లాగించి, మార్గానికి అవరోధం లేకుండా చేశాడు. అటు ఇటు వాహనాలు వెళ్ళిపోతున్నాయి.

వాహనాలు వెళ్ళిపోయి దారి మామూలు అయిన తర్వాత వ్యానులో స్టేషన్‌కు వచ్చి, సంచులన్నీ స్టేషన్‌లో వేయించి, తిరిగి హాస్పిటల్‌కు వెళ్ళాడు. అతనికి ఈ నోట్ల విషయం చెప్పగల ఏకైక వ్యక్తి దెబ్బలు తగిలినవాడు. అతడు కూడా చనిపోతే అది మిస్టరీగా మిగిలిపోతుంది. ఎలాగైనా ఈ మిస్టరీ లాగాలని ఆ వ్యక్తి వద్దకు వచ్చాడు. ఆ పాటికి ఆ వ్యక్తి

హాస్పటల్ దగ్గరిల్లేలా ఏడ్పులూ పెడబొబ్బ లతో ఉన్నాడు.

అతని దగ్గరగా వచ్చి "ఏవూరు మీది?" అని అడిగాడు. అతడు జవాబు చెప్పలేదు. మరింత గట్టిగా గట్టిగా అరుస్తున్నాడు.

"రేయ్! నీ అరుపులు మాని నిజం చెప్పు! నిజం చెబితే నిన్ను విడిచిపెడతాం! గాయాలు మాన్పుకొని ఇంటికి వెళ్ళవచ్చు."

అతడు ఎంతవరకూ చెప్పకపోవటంతో హాస్పటల్‌నుండి పోలీసుస్టేషన్‌కు తీసుకెళ్ళారు. అక్కడ తనను చంపేస్తారని అతడు భయపడ్డాడు. కనీసం చావును తప్పించుకోవాలనుకున్నాడు. పోలీసుస్టేషన్‌లలో ఎందరినో చంపుతున్నట్లు వింటూనే ఉన్నాడు.

ఆ డబ్బుంతా బంగారం మారకం మీద వచ్చింది అని చెప్పాడు.

"బంగారం ఎక్కడినుంచి తెచ్చారు?"

"బొంబాయి నుండి వచ్చింది. ఒకవ్యక్తి కిరాయికి మమ్మల్ని తీసుకుని వచ్చాడు. అంతకు మించి మాకేమీ తెలియదు"

"మిమ్మల్ని తెచ్చిన వ్యక్తి ఎక్కడున్నాడు?"

"యాక్సిడెంట్ జరిగే సమయానికి వెనుక కారులో ఉన్నాడు. అతడితోపాటు మరో ఇద్దరు. మాకు యాక్సిడెంట్ జరిగిన తర్వాత పారిపోయి ఉంటారు"

"బంగారం ఎక్కడ అమ్మారు? అంత బంగారం కొనే వాళ్ళు ఎవరున్నారు?"

అతను తనకి తెలిసిన వివరాలు చెప్పాడు.

నోట్ల కట్టల్ని రసాయనిక పరీక్షకు పంపించాడు. అంతవరకూ ఏమిచేయడం సాధ్యంకాదు. బంగారం స్మగ్లింగ్ జరిగిందనే దానికి ఆధారం లేదు. ఆ కరెన్సీ దొంగదనే దానికీ ఆధారంలేదు. అలాగని అంత కరెన్సీని మామూలు కరెన్సీగా భావించడానికి ఆ ఇన్‌స్పెక్టర్‌కు సాధ్యంకాలేదు. దొంగనోట్లు విపరీతంగా చలామణిలో ఉన్నాయని అతనికి తెలుసు. అందువల్ల రసాయనిక పరీక్షలో ఫలితం తేలేవరకూ ఎదురు చూడటం మంచిదని నిర్ణయించుకున్నాడు. పైగా దొరికిన ఆ వ్యక్తి చెప్పినదాన్నిబట్టి ఈ అమ్మకం వెనుక పెద్దలున్నారని బయటపడింది. అటువంటి పెద్దలతో తలపడే స్థాయి అతనికి లేదు. ఏమాత్రం తెలివితక్కువగా ప్రవర్తించినా ముందు తేలేది బంగారం, డబ్బూ కాదు, ఊడేది తన ఉద్యోగమని అతడికి తెలుసు.

★ ★ ★

అక్కడినుండి బయలుదేరిన రఘునందన్ అగ్నిహోత్రవద్దకు వచ్చాడు. ఆపాటికి తన కార్యక్రమాలు ముగించుకుని భామ ముచ్చట్ల మధ్య కాలం గడుపుతున్నాడు.

బయట బజర్ మోగడంతో, అద్దంలో కనిపించిన రఘును చూసి 'మళ్ళీ ఎందుకొచ్చాడో' అనుకుంటూ హాలు మధ్యకు వచ్చాడు. ఆందోళనగా జరిగిన వివరాలు రఘు చెప్పాడు. అంతా విన్న అగ్నిహోత్ర "మీరు ఇక్కడే ఉండండి, ఇప్పుడే వస్తాను" లోపలకు వెళ్ళి బాబాకు ఫోన్ చేశాడు. జరిగిన విషయాలు ఆయనకు చెప్పాడు.

బాబానుండి వచ్చిన సమాధానం విని, రఘువద్దకు వచ్చి "వెళ్దాం పద" అన్నాడు. ముందుకు దారితీస్తూ ఇద్దరూ కారులో బయలు దేరారు. యాక్సిడెంట్ జరిగిన చోటుకు వచ్చేటప్పటికి రాత్రి పండ్రెండు గంటలు కావచ్చింది. అక్కడ పగిలిపోయిన అద్దాలు, దెబ్బతిన్న కారు, లారీ పక్కకు లాగి ఉన్నాయి. లారీకి చెందిన వారు లారీని సరిచూసుకుంటున్నారు. కారు దగ్గరమనుషులు ఎవరూ లేరు. వీరి కారు అక్కడ ఆపి దిగుతూనే లారీ వద్దనున్న వ్యక్తి అక్కడకు వచ్చాడు. ఇద్దరినీ పరకాయించి చూసి "కారు మీదేనా?" అన్నాడు.

రఘు తల అడ్డంగా ఊపాడు "మీరెవరు?" అంటూ.

"ఈ లారీ మాదేనండీ! దరిద్రపు కారు వెధవలు దొంగనోట్లతో వెళ్తూ మా లారీకి గుద్ది ప్రాణాలు పోగొట్టుకుని, మాకు ఈ గతి తెచ్చారు" అన్నాడు అతడు తిడుతూ.

ఇద్దరూ కారువద్దకు వచ్చి లోపలకు తొంగి చూశారు. అందులో ఏమీలేవు. దెబ్బతిన్న ఒకడ్ని పోలీసులు తీసుకెళ్ళారనీ, కట్టలు కట్టలు నోట్లు ఏ విధంగా పోలీసులు వ్యానులో వేసుకుపోయింది అతడు చెప్పుతున్నాడు. కారు కూడా

పోలీసులే పట్టుకుపోయారని కూడా అతడన్నాడు.

ఇద్దరూ కారెక్కారు. కారు క్లబ్ ముందు ఆగింది. రాత్రి పేకాటలో మునిగిన పెద్దపెద్ద నాయకులు, ఆఫీసర్లు వారంరోజులుగా కనిపించని నరసింహారావును చూసి చుట్టుముట్టారు.

"ఎక్కడికి వెళ్ళావయ్యా! నువ్వులేక క్లబ్ బోసిపోయినట్లుంది" అన్నాడు సమితి ప్రెసిడెంట్.

నరసింహారావు నవ్వాడు.

"గోవిందంకు మెంటల్ వచ్చేసిందటగదా! ఏమిటేమిటో పలవరిస్తున్నాడు. నరబలి నేను చూశానంటూ కేకలేస్తున్నాడట. ఏమిటి సంగతి? మీ స్నేహితుడేకదా! ఏమైనా విచారించారా?" మరో వ్యక్తి అన్నాడు.

"నాకు కూడా పూర్తి వివరాలు తెలియవండీ వెళ్ళి చూసి వచ్చాను. మన స్పృహలో లేడు" అన్నాడు నరసింహారావు కూర్చుంటూ.

హాలుమధ్య నియాన్‌లైట్లు చీకటిని పారద్రోలడానికి నిర్విరామంగా వెలుగుతున్నాయి. మూడు బ్యాచ్‌లుగా కూర్చుని పేకాటలో తన్మయత్వం పొందుతూ, అప్పుడప్పుడు బయటినుంచి వచ్చేవారిని పలుకరిస్తూ నవ్వుతూ, డబ్బు పోగొట్టుకున్న యావ మరచిపోడానికి చలోక్తులు విసురుకుంటున్నారు.

అప్పుడే ఒక వ్యక్తి రిక్షా దిగి లోపలకు వచ్చాడు. "గుడ్‌న్యూస్! ఊరివెలుపల నాలుగు గంటల క్రిందట కారు-లారీ పోట్లాడుకున్నాయి" అన్నాడు ఉల్లాసంగా కుర్చీలో కూర్చుంటూ.

నరసింహారావు అతడివైపు తల తిప్పి చూశాడు.

"ఇందులో గుడ్ ఏముందయ్యా మహానుభావా! ప్రపంచమంతటా రోజుకు లక్షన్నర యాక్సిడెంట్లు జరుగుతూనే ఉంటాయి కదా!" మరో వ్యక్తి పేకముక్కలు కలుపుతూ అన్నాడు.

"నిజమే! కానీ ఇలాంటి యాక్సిడెంట్లు అన్నిచోట్లా జరగవయ్యా యాక్సిడెంట్ అయిన కారులోనూ, దానివెనుక కారులోనూ, కొన్ని లక్షల రూపాయల విలువచేసే సరికొత్త కరెన్సీ, కట్టలు కట్టలుగా దొరికిందట. పైగా ఇవన్నీ ఒకేరకం నోట్లు. అంటే పదిరూపాయల కాగితం రూపంలోనే ఉందట. ఇద్దరు చచ్చారు. ఒకడు గాయాలతో హాస్పటల్ పాలయితే టౌను పోలీసుస్టేషన్‌కు తెచ్చి ఆరాలు తీస్తున్నారట! మరికొందరు పారిపోయారట, వారికోసం వేట మొదలయిందట! ఈ డబ్బంతా దొంగ బంగారం అమ్మకం ద్వారా వచ్చిందని దొరికిన వ్యక్తి చెప్పాడట! అసలు ఈ నోట్లే స్వచ్ఛమైనవి కావనీ, నకిలీవి అయి ఉండవచ్చని అనుమానించిన పోలీసులు రసాయనిక పరీక్షలో మునిగి ఉన్నారట. దొంగనోట్లే అయితే నాసామి రంగా మన టౌను పేరు దేశమంతా మార్మోగిపోతుంది" అతడి ఉత్సాహం చూద్దంలేదు రఘు. నరసింహారావు వైపు ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

ఆ వ్యక్తి ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు "పోలీసులకు అప్పుడే ఒక క్లూ దొరికిందట! డబ్బు ఎక్కడ తీసుకున్నదీ దొరికినవాడు చెప్పాడట! రసాయనిక పరీక్ష పూర్తి అయితే అప్పుడు ఇంకా కొత్త కొత్త విషయాలు బయటపడతాయి"

నరసింహారావు అతడితోపాటు రఘు లేచి బయటకు వచ్చారు.

"ప్లీజు రఘూ! హొటల్‌లో రంగారావు, పేరుతో రూమ్ బుక్ చేసుకొని ఉండండి. మరో గంటలో నేను వస్తాను" అంటూ అతన్ని రిక్షా ఎక్కించి కారులో భవనం వద్దకు వచ్చాడు. అపాటికే మాట్లాడటానికి చాలా మంది వచ్చి ఉన్నారు. ఈ రాత్రి కూడా వీరితో మంతనాలాడడం సాధ్యం కాదనుకుని, వారందర్నీ రేపు ఉదయం రమ్మని చెప్పి పంపించి తాను లోపలకు వెళ్ళాడు. భామ పడకగదిలో డబుల్ కాట్‌మీద అడ్డదిడ్డంగా పడుకొని ఉంది. అలికిడికి కళ్ళు తెరచి ఆందోళనగా ఉన్న అతడి ముఖం చూసి "ఏమయింది స్వామీజీ?" అంది చిలిపిగా నవ్వుతూ.

"భామా! కార్లు యాక్సిడెంటయి కరెన్సీ నోట్లు పోలీసులకు దొరికాయట" అంటూ బాబాకు ఫోన్ చేయడానికి ఫోనెత్తాడు. అటువైపునుంచి వచ్చిన ఆదేశాలూ, సలహాలూ

వింటూ, తాను చేయవలసిన పనిగురించి ఆలోచించాడు. రిసీవర్ క్రెడిల్ మీద ఉంచి "నీ ఉద్దేశం చెప్పు! వెళ్ళిపోతానంటే స్వేచ్ఛగా ఇక వెళ్ళిపో! తెల్లారక ముందే ఇక్కడకు పోలీసులు రావచ్చు. ఇందులో నీవు ఒక బానిసలాగే పడి ఉన్నా నువ్వు బందీవంటే పోలీసులు నమ్మరు. ఎముకలు విరుగ గొట్టి కేసులో ఇరికిస్తారు. వెళ్ళదలచుకుంటే తక్షణం వెళ్ళు. బయటివారికి నేను చెప్పి నిన్ను దాటించేస్తాను" అన్నాడు తొందర తొందరగా.

భామ అతడి చెయ్యి పట్టుకుంది. అతడి చెయ్యితోపాటు ఆమె చెయ్యికూడా వణుకుతున్నది. "దయచేసి నామాట వినండి! నేను ఎక్కడికని వెళ్ళను? అయినవాళ్ళందరూ ఏనాడో నాకు దూరం జరిగారు. సమాజం దృష్టిలో నేను పతితను! ఇక్కడ ఇరుక్కుని వీరి కార్యకలాపాలకు బానిసగా అయ్యాను. బందీగానే అయినా ఇంతవరకూ కాలు బయటపెట్టకుండా సుఖంగా బ్రతికాను. ఇప్పుడు తిరిగి పాత మురికికూపంలోకి పోలేను. నాకు బయట రక్షణ దొరకదు. ఒక ఆడది ఒంటరిగా ఉంటే తనను తాను ఎన్నడూ రక్షించుకోలేదు. మీతోపాటే నేనూ ఉంటాను. దొరికిన ఆస్తితో ఇద్దరం పారిపోదాం!" అంది.

ఆమె ముఖం వంక చూశాడు "ఈ సుడి గుండంలో నువ్వు ఎలా ఇరుక్కున్నావో ఎలా చెప్పగలవా?"

భామ విషాదంగా చూసింది-

"అతి పేదరికంలో పుట్టాను. నాకు ఉన్నదల్లా మగవాడిని వెర్రెత్తించే సౌందర్యం! పల్లెటూళ్లలో ఈ అందాన్ని అనుభవించడానికి అనేకులు దౌర్జన్యం చేశారు. మావారి దృష్టిలో నేను పతితనయ్యాను. గ్రామంనుండి నన్ను వెడలగొట్టినా మావాళ్ళు నన్ను దగ్గరికి తీయలేదు. అప్పటినుండి అందరికీ అందుబాటులోకి వచ్చాను. వేశ్యల కొంపలలో కాపురం చేశాను. శరీరం తాకట్టుపెట్టి పొట్టపోసుకున్నాను. జీవితం మీద విరక్తికలిగి, ఈ బతుకు బతకడంకంటే చావడం మేలని అనుకుంటున్న తరుణంలో బాబా కనిపించాడు. అతడు ఎన్నో ఆశలు కల్పించాడు, ఉవ్విళ్లూరేలా చేశాడు. ఆరోజునుండీ బాబాకు అన్ని శుశ్రూషలు చేయడానికి నేను ఉపయోగపడ్డాను. బాబా రహస్యాలు ఒక్కొక్కటే నాకు తెలుస్తున్నాయి. బాబా వద్ద ఏ మహత్యాలూ లేవనీ, సాధారణ తంత్రగాడనీ, మ్యాజిక్ మెస్మరిజంతో జనాన్ని ఆకర్షించి అవతార పురుషుడుగా అవధూత లాంటి వారి చేత ప్రచారం చేయించుకుంటున్నాడనీ, దొంగనోట్ల ముద్రణలో ముఖ్యుడని తెలిసిపోయింది. నాకు తెలిసినట్లు బాబాకూ తెలిసిపోయింది. అందుకే నన్ను దూరం చేసుకోకుండా, బయటకు పంపకుండా అవధూతకు తోడుగా ఉండమని ఈ భవనంలోకి తోలి, ఇక్కడనుండి బయటకుపోకుండా అన్ని కట్టుదిట్టాలు చేశాడు. ఇష్టంలేకున్నా అవధూత కాళ్ళక్రింద నలిగిపోయాను. అతనిద్వారా బయటపడడానికి ఎన్నో ప్లానులు వేశాను. ఒక్కటి నెరవేరలేదు. చివరకు అవధూత దుర్మరణం పాలయితే అమితంగా ఏడ్చిన వ్యక్తిని నేనే! కారణం అతనిమీద ప్రేమ ఉండికాదు, బయటకు వెళ్ళే అవకాశాలు మూసుకుపోయినందుకు! మీరు వచ్చినప్పటి నుండీ మీమీద నాకు ఆశ కలిగింది, అనుభూతి కలిగింది. మీరు నమ్మినా నమ్మకున్నా ప్రేమ కలిగింది, మీ ద్వారానయినా బయటపడగలిగితే ఇందులో ఉన్న మోసాలు మీకు తెల్పి, ఈ ఊబినుండి మిమ్మల్ని బయటకు లాగి మిగిలిన జీవితం మీతో గడుపుదామని ఆలోచిస్తున్నాను. మీకోసం అవసరమైతే నా ప్రాణాలు ఇస్తాను. దొరికినంత అందుకొని వెళ్దాం! నాకు స్వేచ్ఛ కావాలి, దానితోపాటు జీవితంలో స్థిరత్వమూ కావాలి" అంది ఉద్వేగంగా.

"మనతోపాటు బంగారం తీసుకెళ్దామంటావా" అన్నాడు ఆమెను చూస్తూ.

"బంగారమే తీసుకెళ్ళడం మేలు. ఇక్కడి నోట్లలో అసలుఏవో, నకిలీ ఏవో ఎవరికి తెలుసు? ఎక్కువ బంగారం బయటకు తీసుకెళ్ళినా బయటివారు అనుమానిస్తారు. మనం ఇద్దరం సులభంగా సూట్‌కేసులో తీసుకెళ్ళడానికి వీలయ్యేంత చాలు సూట్‌కేసులు బరువుగా ఉన్నా అనుమానాలు వస్తాయి. తేలిగ్గా సూట్‌కేసులు పట్టుకుని కారెక్కితే ఎవరూ అనుమానపడకుండా బయటపడవచ్చు"

ఆమె తెలివితేటలకు అబ్బురపడ్డాడు. పడ కగదిలోని సూట్‌కేసులు రెండు తీసుకుని, వాటిలో కొంత బంగారం దిమ్మెలు పేర్చి, అందులో తమ దుస్తులు సర్దుకుని సూట్‌కేసులు చేతికి తీసుకుని బయటకువచ్చి కారులో పెట్టాడు. బయట ఉన్న వ్యక్తులు ఆమె బయటకు రావడంతో అనుమానంగా దగ్గరకు వచ్చారు.

''మేం బాబాదగ్గరకు వెళ్తున్నాం! ఆమెను అర్జంటుగా తీసుకురమ్మన్నారు. మేము వచ్చే వరకూ ఎవరు వచ్చినా గేటు బయటే ఉంచండి'' అంటూ స్టీరింగ్ ముందు కూర్చున్నాడు. భామ కారు ఎక్కబోతుండగా ఒక వ్యక్తి పరుగెత్తుకుంటూ వచ్చి భామ చెయ్యి పట్టుకుని బయటకు లాగాడు.

''నువ్వు వెళ్ళడానికి వీలులేదు'' అంటూ అరిచాడా వ్యక్తి.

నరసింహారావు స్టీరింగ్ ముందే కూర్చుని అతడివైపు చూశాడు. అజానుబాహువు, క్రౌర్యంతో ఉట్టిపడుతున్న కళ్ళు. అతన్ని తమ వంటవాడు నవీన్‌గా గుర్తించాడు.

''నవీన్... తెలివితక్కువగా ప్రవర్తించకు. బాబాగారి ఆజ్ఞదాటితే ఫలితం దారుణంగా ఉంటుంది'' అన్నాడు కరకుగా.

అతడు వికటంగా నవ్వాడు. ''మిస్టర్ అగ్నిహోత్రా!'' అన్నాడు గట్టిగా. తనను పేరుపెట్టి పిలుస్తున్న వంటవాడివైపు తీవ్రంగా చూసి తలుపుతీసి, కారుదిగి వచ్చి నిలుచున్నాడు.

''మిస్టర్ అగ్నిహోత్రా!'' అన్నాడు తిరిగి కరకుగానే నవీన్.

''నువ్విక్కడ అధికారివి: నీ అధికారం పరిమితమైంది! అది ఎప్పుడు ఊడుతుందో నీకే తెలియదు. నేనిక్కడ బాబాగారి ప్రధాన గూఢచారిని. నువ్వు ఎవరితో ఎప్పుడు ఏవిధంగా మాట్లాడుతున్నావో మొదటగా తెలిసేది నాకే. ఈ బజారుభామను వెంటేసుకొని, బంగారాన్ని తీసుకొని పారిపోదామని ఇప్పటిదాకా పడగ్గదిలో పలికిన మీ ప్రలాపాలు నాకు తెలిశాయి. బాబాగారు వచ్చేవరకూ నువ్వు వెళ్ళడానికి వీల్లేదు'' అంటూ భామ చెయ్యి పట్టుకుని విసురుగా తోశాడు. ఆ తోపుడుకు భామ దూరంగా హాలుమెట్ల వద్ద పడింది. నవీన్ పిలుపుతో మరో నలుగురు ముందుకువచ్చారు. ఆ సూట్‌కేసులు తీసి తెరవమన్నాడు. అందులో ఉన్న బంగారు దిమ్మెల్ని చూసి నరసింహారావు వైపుచూసి వెకిలిగా నవ్వాడు నవీన్.

''అవధూతకంటే నువ్వే మొనగాడివి! మరి అవధూత మార్గం గుండా నువ్వుకూడా పోకతప్పదు'' అంటూ నరసింహారావు చెయ్యి పట్టుకొని, హాలువైపు లాక్కెళ్ళి హాలుమధ్య నిలబెట్టాడు. భామను కూడా అక్కడకు తెచ్చి నిలబెట్టాడు. ''బాబాకు ద్రోహం చేసినందుకు ఫలితం అనుభవించాలి'' అంటూ తలుపుమూసి తాళంవేశాడు.

ఆవరణలోని వ్యక్తులు ఒకరివైపు మరొకరు చూసుకుంటున్నారు.

★ ★ ★

ఫోరెన్సిక్ నిపుణులు పరిశీలించిన తర్వాత అవి దొంగనోట్లనని బయటపడడంతో పోలీసులు రంగంలోకి దిగారు. గాయాలతో ఉన్న వ్యక్తిని తీసుకుని భవనం వద్దకు వచ్చి చుట్టుముట్టారు. అపాటికి అగ్నిహోత్ర, భామ బందీలుగా హాలుమధ్య ఉన్నారు. పోలీసులు హఠాత్తుగా దాడిచేయడంతో అక్కడివారు భయభ్రాంతులై తలొక దిక్కుకు పారిపోవడం ప్రారంభించారు. పోలీసులు అందర్నీ పట్టుకున్నారు. భవనం లోపలకు చొరబడ్డారు. లోపలున్న అన్ని గదులనూ తనిఖీచేసి, అందులోనే ఉన్న అచ్చుయంత్రాలను, అక్కడ పనిచేసేవారినీ స్వాధీనంలోకి తీసుకున్నారు. అందర్నీ స్టేషన్‌కు తెచ్చారు. కానీ వారిలో అసలు వ్యక్తి ఎవరో పోలీసులకు తెలియదు.

ఇంటరాగేషన్ ప్రారంభించాక నరసింహారావు తాను చేసిన నరబలితోసహా ఒప్పుకున్నాడు. వీటన్నింటి వెనుక బాబా హస్తం ఉందని తెలిపాడు. పోలీసులు, వారి ఆఫీసర్లు ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు.

బాబా భగవత్ స్వరూపుడనీ, మహత్తుగలవాడనీ ఆ ప్రాంతంలో విపరీత ప్రచారం ఉంది. పెద్దపెద్ద నాయకులు, ఆఫీసర్లు, చివరకు పోలీసు సూపరింటెండుతోసహా ఆయన పాద ధూళికొరకు ఎగబడి తలకు తగిలించుకున్నవారే. అటువంటివారిని శిష్యగణంగా తయా

రుచేసుకున్న బాబా దొంగనోట్ల తయారీ నాయకుడనీ, నరబలికి మూలకారకుడనీ, స్మగ్లింగ్‌లో చాకచక్యం కలవాడనీ తెలిసిన పోలీసులు ఏం చేయడానికీ సాహసించలేకపోతున్నారు.

పైన ఉన్నత నాయకులను ఆకట్టుకున్న ఆ వ్యక్తి మీద తొందరపడి చర్య తీసుకుంటే తాము దెబ్బతింటామేమోనన్న భయంతో పై వ్యక్తులకు వైర్‌లెస్‌లో తెలిపి సమాధానం కొరకు ఎదురుచూడసాగారు. ఈలోగా ఈ విషయాలన్నీ బాబాకు తెలిసి పారిపోతాడన్న ఆలోచనతో, అతడు తప్పిపోకుండా ఉండటానికి మఫ్టీలో అక్కడక్కడ పోలీసుల్ని నియమించాడు డి.యస్.పి.

బయట ఈ గడబిడ జరుగుతున్న సమయంలో బాబా తన మందిరంలో భక్తులతో సమావేశమై ఉన్నాడు.

నరసింహారావునుండి రాత్రి ఫోన్ వస్తూనే ఫోన్ అందుకున్న జానకమ్మ అతన్ని అక్కడకు రమ్మని చెప్పింది. ఆలోగా తమకు అనుకూలురైన పోలీసు అధికారులకు తెలిపి ఎలాంటి చర్యా జరగకుండా యాక్సిడెంట్ కేసు మూయించడానికి ప్రయత్నించింది. రాత్రి ఎనిమిది గంటలకు ఫోన్ చేసిన నరసింహారావు ఉదయంవరకూ పత్తాలేడు. ఉదయం ఫోన్ చేసింది. ఫోన్‌లో పలికింది నరసింహారావుకాదు, పోలీసులు. అదురుతున్న గుండెతో బాబా వద్దకు పరుగెత్తుకొచ్చింది. భక్తులకు నీతి వాక్యాలు బోధిస్తున్న బాబా ఈ మాటలు విని క్షణం సేపు చలించాడు. తిరిగి చిరునవ్వుతో అర్థాంతరంగా సమావేశం చాలించి, రేపు ఏర్పాటుచేద్దామని పంపించాడు.

"నరసింహారావు ఏమయ్యాడు?" అన్నాడు లోపలకు వచ్చి.

"అదే నాకూ అర్థంకావడం లేదు. తెలుసుకోడానికి ఎవరూ అందుబాటులో లేరు. ఇప్పుడేం చేద్దామంటారు? ఆ భవనంలో ఉన్నవారు పోలీసులకు మనల్ని గురించి ఎలాగూ చెప్పగలరు. పోలీసులు ఇక్కడ దాడిచేస్తే దొరికిపోతాం... ఇక మనకు పడేది ఉరి శిక్షే" అంది ఏడుస్తూ జానకమ్మ.

ఇంతవరకూ అమ్మగా దర్జాగా చలామణి అయిన ఆమె ఇప్పుడు తన్ను తాను రక్షించుకోలేక ఏడుస్తున్నది. ఆమె ఏడ్పుచూసి బాబాకు వినుగుపుట్టింది. ఏడ్పుద్వారా ఇప్పుడు సాధించేది ఏమీ ఉండదు. ఏదో ఉపాయం పన్నాలి. పారిపోవడం తప్ప మరో ఉపాయం ప్రస్తుతానికి కనిపించడంలేదు. పారిపోతే మరో చోటనయినా మరోసారి వెలుగు వెలగవచ్చు లేదా నిశ్చింతగా ముక్కుమూసుకుని కాలం గడపవచ్చు. దొరికితే ఇంతటితో జీవితం ఆఖరవుతుంది.

"జానకీ... గుడ్డలు సర్దు! ప్రస్తుతం పారిపోవడంకంటే మార్గంలేదు" అన్నాడు బీరువా దగ్గరకు వెళ్తూ. అందులోనున్న డబ్బును సూట్‌కేస్‌లో సర్దారు. దుస్తులు అందులోనే పెట్టి బీరువా తాళం వేశాడు.

వీరు హడావిడిగా దుస్తులు సర్దుకోవడంచూసిన సేవికలు ఆశ్చర్యంగా "ఎక్కడికి ప్రయాణం బాబాజీ?" అడిగారు అమాయకంగా.

"అత్యవసర పనిమీద బొంబాయి వెళ్తున్నాం. అక్కడ మత బోధకుల మహాసభలు జరుగుతున్నాయి. వారంరోజులలో తిరిగివస్తాం" అంటూ చెరొక సూట్‌కేసు చేతుల్లోకి తీసుకొని కారువద్దకు నడిచారు. సేవికలు వారిని చుట్టుముట్టి "ఇంత అర్థాంతరంగా మీరు వెళ్తే ఇక్కడ మందిర పరిరక్షకులు ఎవరు స్వామీజీ! ఇక్కడ ఎవరూ లేకపోతే కష్టంగదా?" అన్నారు.

క్రోధంగా వారివైపు చూశారు బాబా. "నోర్మూయండి. మరికొంతసేపట్లో అగ్నిహోత్ర మందిర పరిరక్షణకు వస్తాడు" అన్నారు.

ఎప్పుడూ గట్టిగా కూడా మాట్లాడని బాబా, అంత గట్టిగా అరచేటప్పటికి సేవికలు వెనక్కు తగ్గారు. తమ విశ్వాసాన్ని ఆయన సరిగ్గా అర్థంచేసుకోలేకపోయినందుకు వారు బాధపడ్డారు. కారు డ్రైవర్ వచ్చి వంగి నమస్కారం చేశాడు. అతడివైపు కోపంగా చూస్తూ "వెంటనే బయలుదేరు" అంటూ ఆజ్ఞాపించాడు బాబా.

ఆజ్ఞ అందుకుని స్టీరింగ్ ముందు కూర్చుని కారు స్టార్ట్‌చేశాడు డ్రైవర్. అక్కడి వారందరికీ వీడ్కోలు చెప్పి 'అమ్మ' కారు ఎక్కింది. బాబా వారి వైపు కన్నెత్తి కూడా చూడలేదు. అసలు విషయాలు తెలిసిన తర్వాత తమమీద దు

మైత్రిపోస్తూ శాపనార్థాలు పెట్టేది ముందు ఈ సేవికలేనని అతడికి తెలుసు. ఇంతవరకూ ఎంతో విశ్వాసంతో తన దగ్గర తన అవసరాలు తీరుస్తూ పడిఉన్నా ఈ విషయం తెలిసి ఆ విశ్వాసం పటాపంచలైనప్పుడు వాళ్ళు చేయగ లిగేది అంతేనని ఆయనకు తెలుసు.

కారు మెయిన్‌రోడ్డు చేరడానికి మరో కిలోమీ టరు దూరం ఉంది. ఈ కిలోమీటరు పూర్తిచేసి మెయిన్‌రోడ్డు చేరేటప్పటికి అక్కడ పోలీసు వ్యాను ఉంది. కారును ఆపి పోలీసులు చుట్టు ముట్టారు.

ఇన్‌స్పెక్టరు కారు వద్దకు వచ్చాడు. అతడు తన శిష్యకోటిలో వాడుకాదని గ్రహించాడు బాబా.

"బాబాజీ! ఈ సమయంలో ఎక్కడికి ప్ర యాణం?" అన్నాడు

"అత్యవసరంగా బొంబాయి వెళ్ళవలసి వచ్చింది. అందువల్ల ఇప్పుడు బయలు దేరాం!"

"మంచిదే! కానీ టౌనులోని తమరి భవ నంలోని సామానలు బయటపడ్డాయి. పై నుండి మాకు వర్తమానం అందేదాకా మీరు ఈ ప్రాంతం విడిచి వెళ్ళకూడదని మాకు డి.యస్.పిగారి ఆర్డరు ఉంది"

బాబా గతుక్కుమన్నాడు. వారిని సముదా యించి దాటిపోవడం సాధ్యంకాదు. తనకు తెలిసినవాళ్ళయితే ఏదో చెప్పి తప్పించుకు పోవచ్చు. తనమీద భక్తితోనయినా విడువవ చ్చు. ఇప్పుడు అలా కాదు. కాళ్ళు పట్టుకున్నా విడువరు.

"కారు పోలీస్‌స్టేషన్‌కు పోనివ్వు" అన్నాడు డ్రైవర్‌తో ఇన్‌స్పెక్టరు. ఇద్దరు పోలీసులు కా రులో ఎక్కారు. మిగిలిన పోలీసులు యస్.ఐ వ్యాను ఎక్కారు. ముందు కారూ, వెనుక వ్యానూ పోలీసుస్టేషన్ చేరాయి. బాబాను దించి స్టేషన్ లోపలకు తెచ్చారు. అతని వెంట జానకమ్మను కూడా తెచ్చారు. వీరిని చూస్తూనే భవనంలో బందీగా పిల్లల సంరక్షణకు ఉన్న ముసలమ్మ ఏడుస్తూ, శాపనార్థాలు పెడుతూ, బాబాను, జానకమ్మను తిట్టడం సాగించింది.

అతన్ని తెచ్చిన వార్త తెలిసి డి.యస్.పి వచ్చాడు. జీప్ దిగి లోపలకు వచ్చి బాబాను చూసి ఆగ్రహంతో ఒక తన్నుతన్నాడు.

"నీవేషం, బతుకూ బయటపడింది. ఇన్నా ళ్ళూ మాకళ్ళు కప్పి ఎంతోమంది అమాయక పుపిల్లల జీవితాల్ని బలిచేశావు. అధికారుల్నీ పౌరుల్నీ నయవంచనతో నమ్మించావు బాబా ఇప్పుడు చివరిదశలో ఉన్నావు"

బాబా పలుకలేదు. ఇన్‌స్పెక్టర్ లాఠీతీసు కుని వీపుమీద బాదాడు. "అమ్మా" అంటూ అరచి నేలమీద దొర్లాడు బాబా! జానకమ్మ జుట్టుపట్టి బండలమీద ఈడ్చి కొట్టాడు డి.యస్.పి. ఈలోగా పైనుంచి మేసేజ్ వచ్చింది.

"ఉన్నఫళంగా అతన్ని పట్టివేయండి. ఆ పట్టివేయడంలో ఎంత నష్టం జరిగినా విడిచి పెట్టవద్దు"

"ఇక్కడ మాకేం నష్టం జరుగలేదు" అన్నా డు బాబాను చూస్తూ డి.యస్.పి. ఇన్‌స్పెక్టర్ కొట్టిన దెబ్బలకు బాబా నేలమీదపడి, రక్తం కక్కుతూ, ఆ రక్తంలో పొర్లాడుతున్నాడు. ఆగ్ర హంపట్టలేక పోలీసులు కొట్టే దెబ్బలకు, బాబా నున్నిత శరీరం బాగా దెబ్బతిన్నది. డస్సిపో యిన అతని శరీరాన్నీ, వలవల ఏడుస్తున్న జానకమ్మనూ లాకప్‌లో తోసి, వ్యానులో మంది రంవద్దకు వెళ్ళాడు. డి.యస్.పి. మందిరాన్ని స్వాధీనంచేసుకుంటున్న పోలీసుల్నిచూసి, విషయం తెలియని భక్తులు, సేవకులు ఆశ్చర్యం, భయంతో నిలబడ్డారు. విషయం తెలిసినతర్వాత తాము ఇంతకాలం ఎలా మోసపోయామో తెలుసుకుని అతడికి దాసులుగా, భక్తులుగా బతికినందుకు తమను తాము తిట్టుకుంటూ, బాబానూ, అమ్మనూ తిడుతూ బాధతో శోకాలు పెడుతున్నారు.

బంగారం, డబ్బు స్వాధీనంచేసుకున్న పోలీ సులు, వారిగతికి వారిని విడిచి తిరిగి స్టేష న్‌కు వచ్చారు. బాబాను, జానకమ్మను బయట కుతీసి, తెచ్చిన వస్తువులముందు నిలబెట్టా రు.

"ఇదంతా నీ నిర్వాకమేనని ఒప్పు కుంటావా బాబా?" అన్నాడు డి.యస్.పి. బాబా, అమ్మ ఇద్దరూ వంచిన తలలెత్తలేదు. ★

# చతుర కతలు

## పాపం నిర్భాగ్యులు

"పట్టుకోండి...పట్టుకోండి దొంగవెధవ పారి పోతున్నాడు..."

టీకొట్లో కబుర్లాడుకొంటున్న మేము నలుగురం ఉలిక్కిపడి వీధివైపు చూశాం. జిప్ బ్యాగ్ చంకలో పెట్టుకొని ఓ యువకుడు వేగంగా పరుగెత్తుతున్నాడు. అతనికి యాభై గజాల వెనుకగా ఓ నడివయసు పెద్దమనిషి దీనంగా అరుస్తూవస్తున్నాడు.

"బాబూ... ఆ దొంగవెధవని పోనివ్వకండి ... పట్టుకోండి ... ప్లీజ్"

బజార్లోని జనంఅంతా వింతగా చూస్తున్నారే తప్ప ఆ యువకుణ్ణి పట్టుకోవడానికి ఎవరూ సాహసించడంలేదు. వాడి దగ్గర ఏ మారణాయుధమో ఉంటుందనే భయమే అందుకు కారణం కావచ్చు.

ఆ పెద్దమనిషిని చూస్తే నాకు జాలేసింది.

పాపం! చెమటోడ్చి, పైసాపైసా కూడబెట్టి ఏ కూతురు పెళ్ళికోసమో దాచుకున్న ఆయన కష్టార్జితాన్ని అనాయాసంగా ఓ దొంగవెధవ గుంజుకుపోవడం ఘోరం అన్పించింది నాకు.

ఏమైతే అది అయిందని వాణ్ణి పట్టుకోడానికే నిశ్చయించుకున్నాను నేను. వెంటనే మా మిత్రబృందానికి సైగచేసి ధైర్యంగా వాడికెదురువెళ్ళాను. వాడు నన్ను ఒక్కతోపు తోసి పారిపోబోయాడు. అయితే మావాళ్ళు అప్రమత్తంగా వ్యవహరించడంతో వాడి ఆటలు సాగలేదు. దొరికిపోయాడు.

"ఏరా దొంగవెధవా? మమ్మల్నే తప్పించుకుపోదామనుకున్నావా?" అంటూ రెండు పిడిగుద్దులు గుద్దాడు పాండురంగం.

నేనా దొంగవెధవచేతిలోని జిప్‌బ్యాగ్ లాక్కున్నాను. మధు, మహేష్‌లు వాణ్ణి పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. ఇంతలో చుట్టుపక్కల జనంకూడా పోగయ్యారు.

"హమ్మో...దొరబాబులా కన్పిస్తున్న వీణ్ణి దొంగ అనుకోగలమా?"

"ఇలాంటి వెధవల్ని ఏ కీలుకాకీలు తీసినా పాపంలేదు..."

జనం తలోరకంగా వ్యాఖ్యానిస్తున్నారు.

ఇంతలో ఆపసోపాలు పడుతూ వచ్చి చేరాడా పెద్దమనిషి.



"థాంక్స్ బాబూ... దొంగవెధవని పట్టుకొని నన్ను రక్షించారు" అన్నాడయన కృతజ్ఞతాపూర్వకంగా మావైపు చూస్తూ.

"మాస్టారూ! ... ఇంతకీ ఏ మాత్రంపోయింది?" అన్నాడు పాండురంగం, ఆయన తన చేతి సంచిలో ఏదో వెదుక్కోవడం గమనించి.

"చాలావరకూ అయిపోయింది బాబూ!

మహాఉంటే ఇంకో నూటాయాభై ఉండొచ్చేమో'' అన్నాడాయన.

మాకేం అర్థంకాలేదు. దొంగవెధవ పారిపోవడానికి గుంజుకుంటున్నాడు.

అదిచూసి ఆ పెద్దమనిషి కలవరపడుతూ, "వాణ్ణి గట్టిగా పట్టుకోండి బాబూ... పారిపోగలడు..'' అంటూ మళ్ళీ తన సంచిలో ఏదో వెదుక్కోవడం మొదలెట్టాడు.

"ఇంకా మీనమేషాలు లెక్కించడమేమిటి? పోలీస్‌స్టేషన్‌కి తీసుకుపోదాం పదండి'' అన్నాడొకడు తాత్సారం భరించలేక.

"అక్కర్లేదు నాయనా! నేను చూసుకుంటాను వీడిసంగతి. మీరు మాత్రం వాడినలా గట్టిగా పట్టుకోండి చాలు'' అన్నాడాయన వినయంగా.

తర్వాత తన సంచినుంచి ఓ కాగితం తీసి మా అందరినీ ఉద్దేశించి, "నేను రాసిన స్వీయకవిత వింటాడు గదా అని ఈ వెధవ రాసిన 500 లైన్ల చెత్త ఓపిగ్గా విన్నాను బాబూ. కాని నా కవిత యాభైలైన్లు వినగానే ఇలా పారిపోయాడు. మీరలా పట్టుకోండి- మిగిలిన నూటయాభైలైనులూ వీడికి విన్పిస్తాను... పనిలోపని మీరు వింటారుగదా మొదటినుంచీ చదువుతానేం?'' అంటూ పెద్ద గొంతుతో చదవటం మొదలెట్టాడాయన.

"నా నేత్రమందారాలు నిప్పుల్ని వర్షిస్తే...
అజ్ఞానాంధకారాలు భస్మీభూతంకాకమానవు...''

విషయం మాకు అర్థంకావడానికి రెండుక్షణాలు పట్టింది.
అంతే! మూడోక్షణంలో ఆ పెద్దమనిషి తప్ప మరో పిట్టపురుగు ఆ రోడ్డుమీద కన్పించలేదు.

## ప్రేమ

"ప్రసాద్... ఇంద 'టీ' తీసుకో...'' అంటూ తనకప్పులోని 'టీ'ని కొంచెం సాసర్‌లో పోసి అతనికి ఆప్యాయంగా అందించబోయారు రంగనాధరావుగారు.

"అబ్బే... వద్దుసార్...!'' బిడియపడి పోయాడు ప్రసాద్

"తీసుకోవయ్యా... మరేం ఫర్వాలేదు...'' అంటూ బలవంతంగా సాసర్‌ని అతనికందించారు రంగనాధరావు.

ఆయన ఆప్యాయతకి కన్నులు చెమ్మగిల్లాయి ప్రసాద్‌కి. మౌనంగా సాసర్‌ని అందుకున్నాడు.

రంగనాధరావుగారు ఎప్పుడూ అంతే. తను టిఫిన్‌చేస్తున్నా, కాఫీ తాగుతున్నా తనవంతు దాంట్లో ప్రసాద్‌కి కొంత ఆప్యాయంగా ఇస్తారు. తనెంత హడావిడి పనులలోనున్నా ప్రసాద్‌ని 'టీ' తాగావా? టిఫిన్ చేశావా?'' అని పలుసార్లు ఆరాతీస్తారు. ఆయన తన మీద చూపుతున్న అవ్యాజానురాగానికి ప్రసాద్ కదిలిపోయేవాడు. ఆయన సంస్కారానికి మనసులోనే చేతులెత్తి దణ్ణం పెట్టేవాడు.

గ్రాడ్యుయేషన్ పూర్తిచేసిన ప్రసాద్ ఉద్యోగంకోసం చేయని ప్రయత్నంలేదు. తిరిగి తిరిగి కాళ్ళరిగిపోయాయే తప్ప ప్రయోజనం శూన్యం. చివరికి ఒకానొక మిత్రుని సాయంతో డ్రైవింగ్ నేర్చుకుని రంగనాధరావుగారి వద్ద కారు డ్రైవర్‌గా చేరాడతను.

రంగనాధరావుగారు రాజకీయ నాయకుడు. మొదటినించీ రాజకీయ నాయకులపై అంతగా సద్భావంలేని ప్రసాద్, ఆయన వద్ద చేరిన మొదటిరోజే తన అభిప్రాయాన్ని మార్చేసుకున్నాడు.

ఎందుకంటే ఆయన తనని డ్రైవర్‌గా చూసేవాడుకాడు. అలాగే తాను యజమానిగా ప్రవర్తించేవాడూ కాడు. ఎంతో ఆత్మీయంగా మసలేవాడు. తన వ్యక్తిగత ఇబ్బందుల్ని కనుక్కుని స్నేహితునిగా సలహాలు చెప్పేవాడు. క్యాంపులకు వెళ్ళినపుడు తనని ఎదురుగా కూర్చోపెట్టుకుని కారియర్లోని భోజనం ఇద్దరికీ ఆయనే స్వయంగా వడ్డించేవాడు. తను వద్దంటున్నా ప్రేమగా కొసరికొసరి తిన్పించేవాడు. నిజం చెప్పాలంటే తనని డ్రైవర్‌గాకాక సొంత బిడ్డలా చూసుకునేవాడాయన.

అంతటి పెద్దమనిషి ఓ సాధారణ కారు డ్రైవర్‌తో అంతటి అనుబంధాన్ని పెంచుకోవడంచూసి ప్రజలు ఆశ్చర్యపోయేవారు. మిత్రులు ధైర్యంచేసి అది కూడదనీ ఎవర్ని ఎక్కడ ఉంచాలో అక్కడే ఉంచాలనీ ఆయనకి చెప్పే



వారు. అయినా ఆయన అవేమీ పట్టించుకోక ప్రసాద్‌తో ఎప్పటిలా ఉండేవాడు.

★ ★ ★

రంగనాథరావుగారి భార్య ఆయనను నిలదీసి అడుగుతోంది.

"ఏంటండీ! ఆ డ్రైవర్ వెధవని నెత్తికెక్కించుకుని తిరుగుతున్నారట..."

"అదేం లేదే..." ఏదో చెప్పబోయారాయన.

ఆవిడ వెంటనే చిర్రున చీదుతూ—

"ఏం లేక పోవడమేమిటి? మీ సంగతి నాకు తెలియదా? వాడు మీకేం కాకపోతే వాడి మీద మీకెందుకంత ప్రేమ? ... నిజం చెప్పండి! లేదంటే ఈరోజే బావిలోపడి ఛస్తాను..." అందావిడ పెద్దగొంతుకతో.

"ఓసీ నీయమ్మ కడుపుమాడ! అంతపని చేయకు... నీదంతా వట్టి అనుమానమేనే! అసలు విషయం చెప్పమంటావా?...

"చెప్పమనేగదా అడిగేది?" విసురుగా అందామె.

"నేను రాజకీయ నాయకుడ్ని. ఇంటాబయటా నాకెందరో శత్రువులు... చుట్టూ గోతులు తీసేవారూ ఉంటారు. ఎవడే సమయంలో ఏంచేస్తాడో... ఎందులో ఏం కలిపి ఇస్తాడో... అందుకే వాడికి ముందు ఇస్తే అనుమానం ఉండదు. దాని వలన మనకి పేరుకి పేరూ వస్తుంది. ప్రాణానికి ప్రాణం నిలుస్తుంది. అవునా? అదీగాక అందువల్ల ఆ ప్రసాద్‌గాడు మనపట్ల వినయంగా ఉంటాడు. చెప్పినట్లు వింటాడు... ఇన్ని విషయాలున్నాయే వెర్రిముఖమా?" అన్నారు రంగనాథంగారు చిద్విలాసంగా నవ్వుతూ.

"అవురా! మీరు నిజంగా రాజకీయ నాయకులన్పించారండీ..." ముక్కున వేలేసుకుంటూ అందాయన భార్యామణి బహుతృప్తిగా.

—ప్రతాపచంద్ర

## అబద్ధాలు ఆడితే...

అపర సత్యహరిశ్చంద్రుడిలాంటి భర్త ఈమధ్య ఎందుకిలా తయారయ్యాడో సుప్రజకి అర్థంకాలేదు. ఆ వేళ రాత్రి ఇంటికి పదిగంటలకు వచ్చాడు హరిశ్చంద్ర. "ఏవండీ... లేటయ్యారు" అని అడిగితే ఆఫీసులో పేపర్ వర్క్‌వుందని చెప్పాడు. కానీ ఆ మరుసటిరోజు అన్నయ్య కనిపించి 'నిన్న సాయంత్రం బావగారు, నేను సినిమాకు వెళ్ళామని' చెప్పాడు.

సినిమాకి వెళ్ళాను అంటే తను ఆయనగారి పీకతీసేస్తుందా. మొన్నటికి మొన్న... సుప్రజ హరిశ్చంద్రని ఆఫీసునుంచి వేగంగా రండి, రవీంద్రభారతికి వెళ్ళాలని చెబితే సరేనన్నాడు. తీరా ఆరోజు అన్నిరోజులుకంటే ఆలస్యంగా వచ్చాడు. కారణం అడిగితే, 'ఎన్ని



సార్లు చెప్పాలి? ఆఫీసుకి వెళుతూ చెప్పాను గదా - ఈరోజు రావడం చాలా ఆలస్యం అవుతుందని' అని బుకాయించాడు.

సుప్రజకి కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

పెద్దవాడు స్కూలు ఫీజు కట్టాలి డబ్బివ్వమని అడిగితే నిన్ననేగా ఇచ్చానంటూ వచ్చి అబద్ధం ఆడాడు. సుప్రజ పోపు డబ్బాలో దాచిన డబ్బులే ఫీజుకి ఉపయోగపడ్డాయి. చిన్నవాడు లంచ్ చేస్తుంటే 'గాడిదా - ఎన్నిసార్లు చేస్తావురా లంచ్?' అని కసిరాడు.

"అదేమిటండీ... వాడు స్కూల్‌కి పోయి ఇప్పుడేగా వచ్చాడు" అంది బేలగా సుప్రజ.

"నీ ముఖం నీ బుకాయింపులు నా దగ్గరా? వీడు ఇందాకే నా కళ్ళెదుట తిన్నాడు" అభాండమేశాడు.

ఇలాంటి అబాద్ధాలు ఒకటా రెండా... కోకొల్లలు. ఇంట్లో సుప్రజ, ఆమె నలుగురు మగపిల్లలకు అదో న్యూసెన్స్ అయిపోయింది.

హరిశ్చంద్ర అబద్ధాలు ఇంటికే పరిమితం కాకుండా బయటకూడా వ్యాపించాయి.

వీడి పెళ్ళాం వాడితో లేచిపోయిందని... వాడు లంచం ఇచ్చి ప్రమోషన్ సంపాదించాడని... ఆ నవల ఇంగ్లీషు నవలకి కాపీ అని... ఆ పదంతస్తుల బిల్డింగ్ ఎల్.ఐ.సికి అపాత్ర దానం చేశానని... చీఫ్ మినిస్టర్ తనకి బాగా క్లోజ్ అని... మహేశ్వరీ పరమేశ్వరీ జంట థియేటర్లు తన సొంతమని... ఇలా లెక్కకు మించినన్ని అబద్ధాలు వాగేస్తున్నాడు.

సుప్రజకీ అవుటర్స్‌నుంచి కూడా కంప్లైంట్సు రావడంతో ఇక లాభం లేదనుకుంది.

ఆ రాత్రి పడుకుంటూ మెల్లగా అంది "మనం పొద్దుట సైకియాట్రిస్ట్ దగ్గరికి వెళదామండీ"

"మనమా... ఎందుకు?"

"మీ మెంటల్ డిజార్డర్ నాకు ఆందోళన కల్గిస్తోంది"

"నాకు మెంటల్ డిజార్డరా? ఎవడా కూత కూసింది?"

"ఎవడో ఎందుకు నాకు తెలియదా? మీ ఇష్టంవచ్చినట్టు అభాండాలు వేస్తున్నారు. ఒక్కటంటే ఒక్కటీ నిజం మాట్లాడటంలేదు"

"నిజమే సుప్రజా! నాకు ఇంతకుముందున్న మంచిపేరు ఇటీవల పోగొట్టుకున్నాను. వెధవ ఆడపిల్లకో నమస్కారంగాని ఇక అబద్ధాలు ఆడలేను" అన్నాడు పశ్చాత్తాపంగా.

"ఆడపిల్ల... అబద్ధాలు... ఏమిటండీ?" అయోమయంగా అడిగింది.

"మనకి నలుగురు మగపిల్లలు. ఈసారైనా ఆడపిల్ల పుడుతుందేమోనని చిన్ని ఆశ! ఇంకా అర్థంకాలేదా? అబద్ధాలు ఆడితే ఆడపిల్ల పుడుతుందంటారు గదా" నవ్వేశాడు హరిశ్చంద్ర.

—కొల్లిమల్ల అప్పారావు

# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

చతుర ఫీచర్



# నీటిముంపుకు గురయ్యే దేవళాల తరలింపు

**1961లో** కృష్ణానదిపైన శ్రీశైలంలోని పాతాళ గంగవద్ద ఆనకట్ట నిర్మాణం మొదలైంది. మొదట కేవలం 770 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పాదనకని నిర్దేశించారీ ప్రాజెక్టును. తరువాత నీటిపారుదలకు కూడా ఉపయోగించాలని భావించారు. కర్నూలు జిల్లాలో 1.95 లక్షల ఎకరాలకు కుడికాలువ ద్వారాను, నల్గొండ జిల్లాలో 3.00 లక్షల ఎకరాలకు ఎడమకాలువ ద్వారాను నీటిపారుదల సౌకర్యాన్ని కలగచేయటానికి వీలుగా అంచనాలు సవరించారు. విద్యుచ్ఛక్తికే ఇప్పటివరకూ దాదాపు 404 కోట్లు ఖర్చుకాగా నీటిపారుదలకు ఉద్దేశించిన 371 కోట్లను కలుపుకొంటే మొత్తం ఈ ప్రాజెక్టు వ్యయం రూ.775 కోట్లు.

సముద్ర మట్టం నుండి 887 అడుగుల ఎత్తున నిర్మితమయింది శ్రీశైలం రిజర్వాయర్. దీనివల్ల కర్నూలు, మహబూబ్‌నగర్‌జిల్లాల్లో 117 గ్రామాలకు చెందిన 28,871 కుటుంబాలు నీటిముంపుకు గురిఅయ్యాయి. 1,06,925 ఎకరాల భూమి కూడా మునిగిపోయింది. దాదాపు 251 చారిత్రక ప్రాధాన్యంకల దేవాలయాలు, ఎన్నో విలువైన కళాఖండాలు, శాసనాలు, పురావస్తు ప్రాముఖ్యంగల చారిత్రక స్థలాలు కూడా ముంపుకు గురైనాయి. ప్రాగటూరు, ముర్వకొండ మున్నగు చోట్లగల కోటలు సైతం మునిగిపోయాయి. ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఈజిప్టులోని అశ్వాక డామ్ నిర్మాణంవల్ల 1 లక్షా 20 వేల మంది, వియత్నాంలోని పామోన్ ప్రాజెక్టు కింద 5 లక్షల మంది, శ్రీలంకలోని మహావేలీ ప్రాజెక్టు కింద 15 లక్షల మందీ, చైనాలోని త్రీ గార్జన్ డామ్ కింద 20 లక్షల మందీ ఇదేవిధంగా నిర్వాసితులవటాన్ని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవాలి. వీటితో పోలిస్తే మనదేశంలో ప్రాజెక్టుల నిర్మాణంవలన నష్టపోయే వారి శాతం బహు తక్కువ. బహుళ ప్రయోజనకరమైన ఇటువంటి భారీప్రాజెక్టులవల్ల తరతరాల సంస్కృతికి ప్రతిబింబాలనదగిన కళా సంపదకు కూడా ఏదో ఒక రూపంలో నష్టం వాటిల్లటం జరుగుతోంది. ప్రపంచంలోని చాలాదేశాలు ఇలాంటి సందర్భాలలో ప్రాజెక్టులు పూర్తయేలోపునే ఆయా చారిత్రక స్థలాల్లో త్రవ్వకాలు పూర్తిచేయిస్తున్నారు. కళాఖండాలను ఎగువ ప్రదేశాలకు తరలించి భావితరాల కోసం గత వైభవాన్ని చాటిచెప్పే మ్యూజియంలలో వాటిని భద్రపరుస్తున్నారు. ఈజిప్టు

క్రీ.శ. 12వ శతాబ్దానికి చెందిన మల్లేశ్వరస్వామి రెండంతస్తుల మంటపం



దేశంలో నైలునదికి అడ్డంగా జరిగిన అశ్వాన్ డామ్ నిర్మాణం ప్రపంచదృష్టిని ఆకర్షించింది. దీనివలన సుమారు 3000 సంవత్సరాల క్రితం అక్కడి కొండను తొలచి, మలచిన "అబూ సింబల్" అనే సూర్యదేవాలయానికి దాని వెలుపల ఉన్న శిల్పాలకు ముంపు ప్రమాదమే ర్పడింది. ఖచ్చితంగా యునెస్కో ఆధ్వర్యంలో ఇటలీ, ఇంగ్లాండు, స్వీడన్, అమెరికా మొద లైన 16 దేశాలకు చెందిన సాంకేతిక నిపుణుల సహాయ సహకారాల్తో కొండను తొలచి మలచిన ఆ పురాతన దేవాలయాన్ని తరలించేపని చేపట్టారు. కొండనుంచి 30 టన్నుల సమాన బరువుగల శకలాలను కోసి విడగొట్టి ఎగువ ప్రాంతానికి సురక్షితంగా తరలించనా రంభించారు. ఇలా మొత్తం ఆలయం పునర్ని ర్మించటానికి 1963లోనే దాదాపు 43 కోట్ల రూపాయలు ఖర్చయింది.

మనదేశంలో గోదావరినదిపై మహారాష్ట్రంలో జయకవాడివద్ద నిర్మించిన డామ్‌వల్ల ముంపుకు గురైన రెండు చారిత్రక దేవాలయా లను ఇలాగే తరలించి పరిరక్షించారు. కృష్ణాన దిపై నాగార్జునకొండ వద్ద నిర్మించిన నాగార్జున సాగర్ డామ్‌వల్ల ప్రపంచ ప్రఖ్యాత గాంచిన బౌద్ధ కట్టడాలు, హైందవ ఆలయాలు మునిగి పోయే ప్రమాదం ఎదురవగా భారత పురావస్తు శాఖ వారు ఎత్తైన ప్రదేశంలో బౌద్ధస్థూపాన్ని అవశేషాలను పునర్నిర్మించారు. అలాగే కర్నా టక రాష్ట్రంలో కూడలి సంగంవద్ద ఆనకట్ట నిర్మించటం వలన ఏర్పడిన ప్రమాదం నుంచి కూడలి సంగమేశ్వరాలయాన్ని కాపాడటానికి ప్రయత్నాలు చేపట్టారు.

నీటిముంపునుండి కళాసంపదను కాపాడటాని కి సత్వరచర్యలు గైకొనే నిమిత్తం రాష్ట్ర పురావ స్తుశాఖ కొన్ని అధికారాలతో శ్రీశైలం హైపవర్ కమిటీని నియమించింది. ఆ కమిటీ పురావ స్తు ప్రాముఖ్యత కల స్థలాలను అన్వేషించి త్రవ్వకాలు జరపాలనీ, ఎంపిక చేసిన ప్రాచీన దేవాలయాలను దిగువప్రాంతం నుండి తర లించి ఎగువ ప్రాంతంలో పునర్నిర్మించాలనీ, పురాతన కళారూపాలైన శిల్పాలను, శాసనాల ను సేకరించి సంబంధిత జిల్లాలో మ్యూజి యంలనేర్పరచి, భద్రపరచి, ప్రదర్శించాలనీ నిర్ణయించింది. అందుకనుగుణంగా శ్రీశైలం ప్రాజెక్టు వలన ముంపుకుగురైన ప్రాంతంలో పురావస్తు సర్వేకి వివిధ ఏజెన్సీలు రంగంలోకి దిగాయి.

ఈ సర్వేలో కృష్ణా-తుంగభద్ర, కృష్ణా-భవ నాశీ నదుల సంగమ ప్రాంతాలలోపాతరాతి యుగం నుంచి చరిత్ర మధ్యయుగము వరకు గల అనేక పురావస్తు విశేషాలను కనుగొన్నారు. కొన్ని మిలియన్ సంవత్సరాల నుంచి ఈ ప్రాంతం ప్రాక్ చారిత్రక మానవుని ఆవాసంగా ఉంది. పాత రాతియుగం, మధ్య రాతియుగం, క్రొత్త రాతియుగం, తామ్రశిలాయుగం, బృహ త్శిలా యుగంనాటి అవశేషాలను కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలలోని సోమశిల, కారపా కుల, కొత్తూరు, సింగవరం, ఉప్పలపాడు, కూడవెల్లి, శేరుపల్లి, వీరాపురం. వెల్లాల, బూడి

దపాడు, యావర్ల, వెల్లటూరు, చాగటూరు, పిన్నాపురం, చిన్నమారూరు మొదలైన గ్రామాలలో లభించాయి. కూడవెల్లి, సాతానికోట మున్నగు చోట్ల కేంద్ర పురావస్తుశాఖ, చాగటూరు, క్యాతూరు, యావల్దీవిపాడు, చిన్నమారూరు, బూడిదపాడు మొదలైన చోట్ల పురావస్తుశాఖ, సిద్దేశ్వరం, మునలి మడుగుల, నాగార్జున యూనివర్శిటీ, వీరాపురం వద్ద బిర్లా పురావస్తు సంస్థ, త్రవ్వకాలను జరిపి ఎన్నో విశేషాలను వెలుగులోకి తేవటం జరిగింది. ఇంతేకాక చరిత్ర తొలి యుగానికి చెందిన శాతవాహన కాలాల నాటి అవశేషాలు వీరాపురం, సాతానికోట, రంగాపురం మొదలైన చోట్ల వెలుగులోకి వచ్చాయి.

వీరాపురం, రంగాపురం, గుమ్మడం, సిద్దేశ్వరం, కూడలిసంగమేశ్వరం మొదలగు చోట్ల క్రీ.శ. 1 నుంచి 4వ శతాబ్దములకు చెందిన శాతవాహన తదనంతర ఇష్టికా నిర్మాణాలైన శైవాలయ పునాదులను కనుగొన్నారు. ఈ ప్రాంతంలో కీ.శ. 6వ శతాబ్దం నుంచి క్రీ.శ. 17వ శతాబ్దం వరకూ వివిధ రాజవంశాల వారు నిర్మించిన అనేక వాస్తు విశేషాలున్నాయి. తొలికాలపు ఇష్టికా నిర్మాణాలను తరలించవీలువడకపోయినా పశ్చిమ చాళుక్యుల కాలము నుండి నిర్మింపబడిన రాతి దేవాలయాలను ఊడదీసి ఎగువ ప్రాంతాల్లో పునర్నిర్మించగలిగారు.

కూడలిసంగమేశ్వరం, మల్లేశా, ప్రాతకోట మొదలగు చోట్ల క్రీ.శ. 7-8 శతాబ్దాలకు చెందిన పశ్చిమ చాళుక్యుల దేవాలయాల, మాపాల సంగమేశ్వరం, ప్రాతకోటలోని క్రీ.శ. 8-9 శతాబ్దాలకు చెందిన రాష్ట్రకూటాలయాలు, సోమశిల, రామతీర్థరి, మల్లేశ్వరం, అలంపూరులోని క్రీ.శ. 10-12 శతాబ్దములనాటి కళ్యాణీ చాళుక్య దేవాలయాలు, సోమశిల, మల్లేశ్వరం మొదలైన చోట్ల క్రీ.శ. 13వ శతాబ్దమునకు చెందిన కాకతీయాలయాలు, ఈర్లదిన్నె జటప్రోలు, మంచాలకట్ట చిన్న మారూరు మొదలగు చోట్లగల విజయనగర, తదనంతర కాలమునకు చెందిన దేవాలయాల్ని దాదాపు 70 వరకూ ముక్కలుగా ఊడదీసి ఎగువ ప్రాంతాల్లో పునర్నిర్మించారు.

అలంపూరులో బాదామీ చాళుక్యులచే నిర్మించబడిన క్రీ.శ. 6-7 శతాబ్దాల నాటి నవబ్రహ్మాలయాలను నీటిముంపు నుంచి రక్షించటానికి దాదాపు 2 కి.మీ. పొడవుగల రక్షిత కుడ్యాన్ని నిర్మించారు.

అలంపూరు సమీపంలోని కృష్ణా, తుంగభద్రా నదీ సంగమస్థానమైన కూడవెల్లి గ్రామంలోని కూడవెల్లి సంగమేశ్వర ఆలయం క్రీ.శ. 7వ శతాబ్దపు నిర్మాణం, గర్భాలయ అర్థ మంటపం, 16 స్థంభముల మహామంటపం, ప్రదక్షిణాపథంతో బాదామీ చాళుక్యుల రేఖానాగర విమానంతో నిర్మించబడింది. ద్వారమున కిరువైపులా నున్న శంఖనిధి, పద్మనిధి, గంగా యమున శిల్పాలు కడురమ్యంగా ఉన్నాయి. దీనికి 1967లో సర్వే జరిపారు. 1979-80లో ఊడదీసి అలంపూరుకు తరలించారు. ఇటీ



జటప్రోలులో పునర్నిర్మించిన 16వ శతాబ్దపు మదన గోపాలస్వామి ఆలయం



జటప్రోల్‌లో పునర్నిర్మించబడిన 13వ శతాబ్దపు మల్లేశ్వర ప్రధానాలయాల సముదాయం

వలే కేంద్ర పురావస్తు శాఖ ఆధ్వర్యంలో పునర్నిర్మాణం జరిగింది. ఇదే వూరిలో తుంగభద్రా నదీ తీరానున్న పాపనాశనం దేవాలయ సముదాయాన్ని కూడా తరలించి ఎగువ ప్రాంతంలో పునర్నిర్మించారు.

సంగమేశ్వరంలో క్రీ.శ. 8-9 శతాబ్దాలకు చెందిన రాష్ట్ర కూట ఆలయాలున్నాయి. ఇక్కడి సంగమేశ్వర, భుజంగేశ్వరాలయాలు పల్లవ రాతిరథాలవలె సుందర వాస్తు విన్యాసంతో రూపలావణ్యంతో కల్పించిన అపురూప శిల్పాలు. రాష్ట్ర కూట శిల్పుల హస్తలాఘవాన్ని, కళాకౌశాలాన్ని చాటి చెప్తాయి. దేవాలయ గోడ మీది ఒక శాసనాన్ని బట్టి ఈ దేవాలయాన్ని పోయూరి ఆచారి కొడుకు నిపిడింపిమోజు అనే శిల్పి నిర్మించినట్లు తెలుస్తుంది. ప్రధాన దేవాలయాన్ని దేవాదాయశాఖ ఖండాలుగా ఊడదీసి నందికొట్కూరు బంగ్లాలో చాలాయేళ్లు భద్రపరచి ఉంచింది. ప్రస్తుతం కర్నూలు సమీపంలోని జగన్నాథ గట్టు మీద పునర్నిర్మాణం గావించబడుతోంది. భవనాశి నదీతీరానున్న ప్రాత కోట దేవాలయాలు క్రీ.శ. 8-9 శతాబ్దాములకు చెందినట్లు శాసనాదారాలున్నాయి. ఇక్కడి నాగేశ్వరాలయాలు, నందన గుళ్లను ఊడదీయుటం 1982లో జరిగినా గ్రామం రెండుగా విడిపోవటం చేత ఇప్పటికీ నిర్మాణానికి నోచుకోలేదు.

కృష్ణానదీతీరాన కొండ దిగువ భాగాన మల్లేశ్వరంలో దాదాపు 15 దేవాలయాలు, ఒక తోరణం ఉన్నాయి. 1979-80లో వీటిని ఊడదీసి జటప్రోల్ అడ్డరోడ్డులో పునర్నిర్మించారు. మల్లేశ్వరం క్రీ.శ.11-13 శతాబ్దముల కాలంలో మంచి తీర్థక్షేత్రంగా విలసిల్లిందని చెప్పవచ్చు. శాసనాలలో మల్లేశ్వరం పేరు అగస్త్యేశ్వరంగా చెప్పబడింది. ఇక్కడ కళ్యాణీ చాళుక్యుల కాలమునకు చెందిన క్రీ.శ 1031-1110 సం॥లకు చెందిన ఆ శాసనాలు లభించాయి. ఈ సముదాయంలో ప్రధానాలయం అభిముఖంగానున్న రెండు గర్భాలయాలు, మధ్య రంగ మంటపం, పైన సుగనాసి, అధిష్ఠానాలు పైన కక్ష్యసనములు, దేవాలయాలపైన దివ్వెల శిల్పాలు, మధ్యన అపస్మారక పురుముని పై నాట్యం చేస్తున్న నటరాజు, అధిష్ఠానములోని గజధార మొ॥న శిల్పవిన్యాసాన్ని బట్టి క్రీ.శ. 13వ శతాబ్దంలో కాకతీయులచే నిర్మించబడినదని చెప్పవచ్చు. ఇక్కడున్న రెండంతస్తుల మంటపం చూపరులను ఇట్టే ఆకర్షిస్తుంది. 14 ఆలయాలు శివాలయాలు కాగా, 15వ ఆలయంలో మాత్రం శేషశాయి విష్ణు విగ్రహం ఉండటం విశేషం. మల్లేశ్వరానికి ఒక కిలోమీటర్ ఎగువ సోమశిలలో క్రీ.శ. 10-13 శతాబ్దముల నాటి దాదాపు 14 దేవాలయాలున్నాయి. ఇవి ఏ కారణంచేతనో తరలింపు



క్రీ.శ. 8-9 శతాబ్దాలనాటి కుబేర విగ్రహం కర్నూలు జిల్లా ప్రాతకోట నుండి తరలించబడింది

కార్యక్రమంలో చోటు చేసుకోలేదు. తమ సర్వేలో భాగంగా 1980లో రాష్ట్ర పురావస్తు శాఖవారీ దేవాలయాన్ని పరిశీలించి, ప్రభుత్వాన్ని ఒప్పించి ఎగువ ప్రాంతంలోకి తరలించి పున ర్నిర్మించటానికవసరమైన నిధులను పొందగ లిగారు. సోమశిలలోని ఒక దేవాలయ సోమ సూత్రం మీద కళ్యాణీ చాళుక్య రాజైన సోమేశ్వ రుని శాసనమున్నది. అతని పేరు మీదుగానే ఈ దేవాలయానికి సోమేశ్వరస్వామి దేవాలయ మని పేరు కలిగి ఉంటుంది. క్రీ.శ. 1184 నాటి కందూరు చోడుల శాసనంలో సోమశిల ప్రసిద్ధ తీర్థంగా పేర్కొనబడింది. సోమశిల గ్రామం ఎదురుగా నున్న సిద్దేశ్వరాన్ని చూస్తూ ఉంటుంది. సోమశిల-సిద్దేశ్వరం కొండల గుండా కృష్ణానది సన్నగా చిన్నగా నల్లమల కొండల్లోకి వొంపు సొంపుల సోయగాలతో చిందులు వేస్తూ ఉరకలు వేస్తుంది.

జటప్రోలు గ్రామంలో క్రీ.శ. 16వ శతాబ్దంలో నిర్మించిన జటేశ్వర వేణుగోపాల, మల్లిఖార్జున, మదనగోపాలస్వామి ఆలయాలు ఉండేవి. ఇవి, ఒక కోట నీటిముంపుకు గురైనాయి.

రామాయణకాలంలో సీతనపహరించుకొని పోతున్న రావణుని జటాయువు అనే పక్షి ఇక్కడే ఎదుర్కొంది. ఆ పోరాటంలో తన తుదిశ్వాసను ఇక్కడే వదిలింది. ఆ కారణంగా ఈ గ్రామానికి జటాయుపురం అనే పేరు



క్రీ.శ. 8వ శతాబ్దపు మహిషాసుర మర్దిని సిద్ధేశ్వరం గ్రామం నుండి కర్నూలు మ్యూజియంకు తరలించబడింది

కలిగిందనీ క్రమేపీ జటప్రోల్‌గా మారి, అలాగే పిలువబడుతుందనీ స్థానికుల కథనం.

16వ శతాబ్దం పూర్వార్ధంలో అనెగొంది రామరాయల వలన దేవరకొండ రాచకొండ దుర్గములను పాలిస్తున్న వెలమ వంశానికి చెందిన కుమార మాదానాయుడు జటప్రోలు సంస్థానాన్ని పారితోషికంగా పొందాడు. అప్పటి నుంచి క్రీ.శ. 18వ శతాబ్దంవరకు జటప్రోలే రాజధానిగా ఉంది. తరువాత కొల్లాపూరుకు మార్చబడింది.

క్రీ.శ. 1527 ప్రాంతంలో కుమార మాదానాయుడు తనపేరుమీద జటప్రోలులో మదనగోపాలస్వామి ఆలయాన్ని విజయనగర వాస్తు సాంప్రదాయాలతో నిర్మింపజేశాడు. ఇది గర్భాలయం, అర్థమంటపం, మహామంటపం, 84 స్థంభాల సభామంటపం, రాజగోపుర పాకశాల, యాగశాల, ప్రాకార మంటపాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దబడింది. జటప్రోలు సభామంటపంలోని స్థంభాలన్నీ విచిత్ర రచనా విన్యాస చాతుర్యంతో అలరారుతుంటాయి. గోపురం అటు వాస్తులోనూ, ఇటు అలంకార శిల్ప రీతులతోనూ విశిష్టమైనది. 42 అడుగుల ఎత్తుతో ఉన్న దీనిని తెలంగాణాలోనే పెద్దగోపురంగా చెప్పుకోవచ్చు. సుమారు 40 టన్నుల బరువుగల ద్వారశాఖలను పునర్ని



సోమశిల దేవాలయాల పునర్నిర్మాణ దృశ్యం

ర్మించటానికి 60 టన్నుల క్రేన్ సహాయం తీసుకోవలసి వచ్చింది. గోపురంమీద కృష్ణలీలలు, దశావతారాలు, సురసుందర శిల్పాలు అత్యంత రమణీయంగా మలచబడ్డాయి.

ఇక్కడి మల్లిఖార్జునాలయాన్ని మంచాలకట్టి మాధవస్వామి ఆలయాన్ని జటప్రోలు ప్రభువు, చంద్రికా పరిణయరచయితయైనమాధవరాయలు, క్రీ.శ. 1550 ప్రాంతంలో నిర్మించాడు. మంచాలకట్ట మాధవస్వామి ఆలయాన్ని కొల్లాపూర్‌లో పునర్నిర్మించారు. జటప్రోలు మదనగోపాలస్వామికి చెందిన కొయ్యరథాన్ని ముక్కలుముక్కలుగా ఊడదీసి పట్టుకెళ్లి రాష్ట్ర ప్రదర్శనశాలలో ప్రదర్శన నిమిత్తం పునర్నిర్మించారు.

నిధులకొరత మూలంగా జలాశయ ప్రాంతం నుండి తరలింపుకు నోచుకోని దాదాపు 48 పురాతన దేవాలయాలున్నాయి. వీటికి నమూనా ప్రతిరూపాలను బలపవ్పురాతితో దేవాదాయశాఖ తయారుచేయించింది. వీటిని పురావస్తుశాఖకు ప్రదర్శనార్థం అందజేశారు.

సిద్ధరాజలింగాపురం, మునలిమడుగు, ప్రాతకోట, నంగమేశ్వరం, కపిలేశ్వరం, ఎర్రమఠం, ప్రాగటూరు, గొందిమల్ల మొదలైన గ్రామాల్లోనున్న దేవాలయాల్లో వాస్తుకళాత్మక భాగాలను సురక్షితంగా ఊడదీసి, కర్నూలు మ్యూజియంలో భద్రపరచారు. విజయనగర రాజులకాలమునాటి ప్రాగటూరు వరదరాజస్వామి ఆలయం రెండోఅంతస్తుద్వారమునకు అద్భుత వాస్తుశిల్పములను కూడా తరలించి రాష్ట్రపురావస్తుశాఖ అధీనములో ఉంచారు. నందికొట్కూరు తాలూకాలోని చేబ్రోలు వద్దనున్న దిగుడుబావి వాస్తుశిల్ప భాగములు కూడా కర్నూలుకు తరలించబడ్డాయి.

జలాశయ ప్రాంతంలోనున్న శిథిలాల నుండి రాష్ట్ర పురావస్తుశాఖ దాదాపు 200 శిల్పాలను కర్నూలు, హైదరాబాద్ మ్యూజియంలకు తరలించింది. వాటిలో మల్లేశ్వరం నుంచి శేషశయన, ప్రాతకోటనుంచి నటరాజ, కుబేర, సప్తమాతృక శిల్పాలు, నంగమేశ్వరం నుంచి యోగనరసింహ, మునలిమడుగు నుంచి దిక్పాలశిల్పాలు, సిద్ధేశ్వరంనుంచి మహిషాసురమర్ధిని,వెల్లిపాడునుంచిగణేశ,సిద్ధి

రాజలింగాపురం నుంచి గంగా యమున శిల్పాలు, మారమునగాల నుంచి రతీమన్మథ శిల్పాలు విభిన్న సంస్కృతుల కళారీతులకు దర్పణాలని చెప్పవచ్చు.

తరలించటానికి ఎంపిక చేసిన దేవాలయాలను, పరిసరాలను శుభ్రంచేసి ప్రతిఒక్క రాయికీ పెయింట్‌తో నంబర్లువేసి, అన్నివైపులా ప్లానులు గీచి, ఛాయాచిత్రాలను తీయటాన్ని డాక్యుమెంటేషన్ అంటారు. డాక్యుమెంటేషన్ పూర్తవగానే, మయమతం, విశ్వకర్మీయం, కాశ్యపతి, శిల్పరత్నం, మరీచి విమానార్చన కల్పం, పూర్వకారణాగమము మొదలైన శిల్ప ఆగమ శాస్త్రాల్లో చెప్పిన జీర్ణోద్ధరణ విధిననుసరించి బాలాలయ నిర్మాణం కావించి, ఋత్విక్కుల మంత్రోచ్చాటనంతో మూలబింబం నుంచి 'జీవకళల'ను దర్భత్రాడు ద్వారా తీర్థపుకలశంలోకి ఆకర్షణ చేస్తారు. దీనినే కళాకర్షణ అంటారు. తరువాత ఆ విగ్రహాలను దేవాలయం నుంచి వేరుచేసి భద్రపరుస్తారు. తిరిగి దేవాలయ పునర్నిర్మాణం జరిగేంతవరకూ కలశానికి నిత్యపూజలు చేస్తారు. తరువాత దేవాలయ విమాన భాగం నుంచి ఆధారశిల వరకూ ఊడదీసి ఎంపికచేసిన స్థలానికి జాగ్రత్తగా చేరవేస్తారు.

క్రీ.శ. 16-17 శతాబ్దములకు చెందిన శ్రీకుమారుడు తన శిల్పరత్న గ్రంథంలో దేవాలయ నిర్మాణాలకు అనువైన ప్రదేశాలను గురించి వివరించాడు. తీర్థములు, తటనీతటములు, జలనిధి తీరాలు, సరిత్సంగలు శైలాగ్రము, అద్రితటము, వనము, ఉపవనము, ఉద్యానాలు, సిద్ధాదుల నివాసము, పురము, పట్టణము ఇంకా ప్రకృతిమనోహరతగలిగిన చోటుల దేవాలయ నిర్మాణమునకు భూమిని నిర్ణయించాలని చెప్పబడింది. ప్రదేశము యొక్క సౌందర్యము, అక్కడి ప్రకృతి రామణీయకత మానవుని మానసిక శాంతికి దోహదము చేస్తూ ఆధ్యాత్మిక సౌందర్యమును ఇనుమడింపచేస్తుంది. పైన తెల్పిన అన్ని దేవాలయాలూ ఈ ఫార్ములాకు సరిపడేవే. అమరగిరి దేవాలయం అరణ్యంలోనూ, మల్లేశ్వరం సముదాయం కొండ సమీపంలోనూ, సోమశిల, సిద్దేశ్వరం, అలంపూర్ మొదలగుచోట్ల నదీతీరాన, కూడలి సంగమేశ్వరం, రూపాల సంగమేశ్వరం ఆలయాలు నదుల సంగమస్థానాలలోనూ, ప్రజ్ఞాశాలురైన నాటి శిల్పులు నిర్మించా



సోమశిల పునర్నిర్మాణంలో క్రీ.శ. 12వ శతాబ్దంనాటి దేవాలయాలు

రు.

దేవాలయాల పునర్నిర్మాణానికి అనువైన స్థలాల ఎంపిక చేయటానికి పురావస్తుశాఖ సంచాలకులు డా. కృష్ణశాస్త్రి, దేవాదాయశాఖకు చెందిన శ్రీ గణపతి స్థపతి, పురావస్తు ఇంజినీరు శ్రీ బి. సత్యనారాయణసింగు, వివిధ ప్రదేశాల్లో పర్యటించి కృతకృత్యులైనారు. సోమశిల దేవాలయ సముదాయానికి అనువైన స్థలాన్ని ఎంపికచేయటంలో డా. కృష్ణశాస్త్రి చేసిన భగీరథ ప్రయత్నం ఫలించటమేకాక చుట్టూ కొండలు, హరితవనాలు, ఆహ్లాదాన్ని కలిగించే సుందర జలాశయాదృశ్యం మధ్యగా పైదేవాలయసముదాయాన్ని పునర్నిర్మించటానికి అన్ని చర్యలూ తీసుకొన్నారు.

ఎంపిక చేసిన స్థలాల్లో కట్టడానికి సరిపడే పునాదులను వేసి ఇంతకు మునుపు తయారు చేసిన ప్లానుల ఆధారంగా ఆధారశిల నుంచి స్థూపివరకు యథాతథంగా పునర్నిర్మించటమే కాక శిథిలభాగాలను కూడా పునరుద్ధరిస్తారు. పునర్నిర్మాణానికి దేవాదాయశాఖ, పురావస్తుశాఖకు చెందిన స్థపతులు, ఇంజనీర్లకు మొదట తమిళనాడుకు చెందిన శిల్పులు తరువాత జటప్రోలుకు చెందిన సాంకేతిక నిపుణులు సహాయపడ్డారు.

అన్నివిధాలా పూర్తయిన దేవాలయాలకు కళాకర్షణగావించిన విగ్రహాలను తిరిగి రప్పించి ఋత్విజుల మంత్రోచ్చాటనతో తీర్థకలశం నుంచి బింబమునకు దర్భత్రాడుల ద్వారా పూర్వపు 'జీవకళల'ను యథాపూర్వకంగా 'బింబంలోకి తిరిగి ప్రవేశింపజేస్తారు. దీనినే కళాన్యాసం అంటారు. దేవాలయంమీద కలశాన్ని కూడా స్థాపించి సప్తనదీ తీర్థంచేత మహాకుంభాభిషేకము మహాసంప్రోక్షణ గావించి నిత్యపూజకు బింబాన్ని ఆలయాన్ని సిద్ధంచేస్తారు.

శాస్త్రాలలో విధులుచెప్పబడ్డా ఆచరణలో ఎన్నోసమస్యలు ఎదురవుతాయి. శిల్పాల తరలింపులో, మా గ్రామంలోని దేవుణ్ణి చస్తే తీసుకుపోనివ్వమని, మావూరు దేవళం నీళ్లలో మునిగిపోనిస్తాముగానీ ఊడదీయనివ్వమని, దేవాలయాల్ని ఊడదీయటానికి సాహసం చేస్తే తీవ్రప్రతిఘటన, గొడవలు ఎదుర్కొనవలసి ఉంటుందని మొదట అధికారులను బెదిరించిన సంఘటనలు ఎన్నోఉన్నాయి. తరువాత వారికి నచ్చచెప్పి ఎలాగో ఒప్పించి తీరా ఊడదీస్తే, తరలించేటప్పుడు ఇక్కడ అని, అక్కడని ఎటూ తేల్చక పనులు సాగనీక ప్రజలు అడ్డం చెప్పేవారు. దేవాలయాల పునర్నిర్మాణంకోసం స్థలాలను ఇవ్వజూపిన వారు పనులు ప్రారంభించేసరికి ఏదోకారణం చేత తమ అనమ్మతి తెల్పటంతో భూసేకరణపరమైన ఎన్నోఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. భూముల నష్టపరిహారం చెల్లింపులో కోర్టుల జోక్యము, రాజకీయపరమైన జాప్యం తద్వారా నిర్మాణఖర్చులు అధికమైనాయి. ఎటూతేలని నిర్ణయం ద్వారా ప్రాతకోటలోని దేవాలయాలు ఇంకా పునర్నిర్మాణానికి నోచుకోక, రాళ్లపై వేసిన గుర్తులు కూడా పూర్తిగా చెరిగిపోయాయి. దేవాలయాలను ఊడదీసే పరిజ్ఞానం స్థానికులకు లేకపోగా తమిళనాడు నుంచి శిల్పులను హెచ్చువేతనాలపైన రప్పించి తర్ఫీదు నిప్పించవలసిన ఆగత్యమేర్పడింది.

శ్రీశైలం హైపవర్ కమిటీ ఆమోదించిన 44 దేవాలయ సముదాయాలేకాక ఇంకా చరిత్ర ప్రాధాన్యంగల ఎన్నో దేవాలయాల తరలింపు ఆవశ్యకతను గుర్తించి, 1982 డిశెంబరులో డా. వి.వి. కృష్ణశాస్త్రిగారి నేతృత్వంలో శ్రీ బి. సత్యనారాయణసింగ్, డాక్టర్ సుబ్రహ్మణ్యం, శ్రీ శివనాగిరెడ్డి జరిపిన తక్షణసర్వేలో రామతీర్థం, అలంపూరు పిచ్చికగూళ్లు, సిద్ధరాజలింగాపురం, పాతకోట, మునలిమడుగు, కొక్కెరంచ, గొందిమల్ల మున్నగుచోట్లగల దేవాలయ, మంటపాలను తరలించటానికి సత్వర చర్యలకై ప్రతిపాదించగా ప్రభుత్వము ఆమోదము తెలిపినదరిమిలా పనులు చురుగ్గా జరుగుతున్నాయి.

— డాక్టర్ సుబ్రహ్మణ్యం,
— శివనాగిరెడ్డి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 52685, Visakhapatnam 52211, Tirupati 5291.

# గుర్తుపెట్టుకోండి, పోషణనిచ్చే సమపాళ్ళుగల ఆహారాన్నివకపోతే ఏమి జరుగుతుందో? ...రుకుదనాన్నివ్వడానికి అవసరమయ్యే, 'సరియైన' తీరులోని కేలరీలు మీ పాపకి అందవు.

## ...ందుకే నేను మా పాపకు ...రిలాక్ యిస్తాను."

'సరియైన' కేలరీలు అంటే ఏమిటి?
అనేదిది. ఆహారంలోని ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు ...లు, ఖచ్చితమైన సమపాళ్లు యీ కేలరీలలో వుంటాయని. నిజానికి ఇవి ...గా పెరగటానికి, చురుకుగా వుండటానికి, అవసరమైన కీలకమైన పదార్థాలు.
...కు 'సరియైన' కేలరీలు లభించేటట్లు ఖచ్చితంగా చూడాలి. ...హారి యిచ్చే ఆహారంలో వుండాలి. రోజూ మామూలుగా వారం ...ంగా యిచ్చే ఆహారంతో అలా యివ్వగలగటం చాలా మంది తల్లులకి ...కాదు.

పరిష్కారం ?
... పోషణ నిచ్చే సమపాళ్లుగల సంపూర్ణ ఆహారం. పాపకు 4 నెలలు ...ప్పటి నుండి అంటే, కేవలం పాలు యిస్తే చాలని వయస్సు నుంచి. ఆహారం.
...లో ప్రొటీన్లూ, కార్బోహైడ్రేట్లూ, కొవ్వు పదార్థాలూ విటమిన్లూ, కాల్షియం, వున్నాయి. దాంతో మీ పాప చురుకుగా వుండటానికి ...మైన 'సరియైన' కేలరీలు లభిస్తాయి. రుచికరంగానూ వుంటుంది. యివ్వండి వెంటనే మీ పాపకు, పోషణనిచ్చే సమ పాళ్ళలోగల ...

...కు 6 నెలలు వచ్చినప్పటి నుంచి వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ అదనపు లాభం అందించండి.
... ప్యాక్‌పైన యివ్వబడిన సూచనలను పాటించండి

---

... సెరిలాక్ బేబీ కేర్ బుక్
...డి : సెరిలాక్, పోస్ట్ బాక్స్ నెం 21, న్యూ ఢిల్లీ 110029

---






పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402